పాఱి బేలతనమునన్, గలవే యింతకు మును హంసలతోఁ బురడించు వాయసంబులు జగతిన్. (60) సీ॥...ఆ॥ వె॥ లోనుగాఁ గ నెట్టులైనను మీకోరి నట్ల పఱచి మేటియంచయైన, దాని నిపుడ గెలుతుఁ, దక్కటియంచలు భయము వొందఁ గాకి పదువు వొంగ. (61) వ॥ అనుటయు మున్నాహూతంబైనహంసం బక్కాకంబు నాలోకించి. (62) ఆ॥ వె॥ నూఱుగతుల నీవు వాఱు దే నన్నియు, నెఱుఁగఁ బులుఁగులెల్ల నెట్లు వాఱు, నడవి యాకసమున నిడుబాట నట్ల పాఱుదము రమ్ము జలధిచదల ననిన॥ (63) వ॥ అయ్యెడం గూడినకాకంబు లపహసించి శతప్రకారగతియగు దీనితో నేకయానపర్యవసాన హీనసముత్సాహ దోహలి వగుని వెట్లు మచ్చరించెదవు... ఇట్లు రెండును మున్నీటిపై మిన్ను దఱిసి పాఱునట్టియెడ. (64) ...ఆ॥ వె॥ ఎలమిఁ గడచి పోవుఁబిలుచుఁ గ్రమ్మఱి వచ్చిముక్కుముక్కుమీఁద మోపుఁ జుట్టు, నేచి తిరుగు నీఁకె లీఁకలతో రాయు, నొరయుఁ జిత్రగతుల మఱియు నవ్వు. (65) వ॥...ముదితంబులైనవాయసంబు లధికస్వరంబుల మెఱయుచు హంసంబుల గేలికొని నవ్వుచు...మరాళంబు పరాభవంబు బొందెడుఁ జూడుం డని పెద్దయెలుంగునం బలుకుచుండ... హంసంబు భరితోత్సాహంబై. (67) క॥ పోడవునకు నెగసి యెప్పటిపడమటిదెస, నిగిడి పెలుచఁ బఱచినఁ గూడం, గడురయమునఁజని యుంచం, గడవంగాఁ గీలకఱచి కాకము పాఱున్. (68) వ॥ పాఱిపాఱి...కాకం బాకులాంతరంగమ్మును...నై యిట్లని వితర్కించు, (69) క॥ నేరక తొడరితిఁ గాలోకన, భూరుహములు లతలు గిరులుఁ బొడ లేమియు లే, వాయు బహుళసత్త్వమయము, వారిధి, డగి పోఁకెనపుడ నలయున్ బోలియున్. (70) వ॥ అనుచు...అవశత నంతకంతకు డిగుచున్నయక్కాకిం గనుఁగొని కలహంసం బిట్లనియె. (71) ఆ॥ వె; నీ వనేకగతులు నేర్చితి యెగ

తిఁ జెపుమ. . .(72) వ॥ - - రాయంచకు నక్కాకం బిట్లనియె. (75)... .క॥ నాకొలఁది యిప్పు డెఱిఁగితి, నీకరుణాలోకనంబు నిగిడించి శరణ్యా! కావు నన్ను మగుడం, గాకులలోఁ గలుపఁ దగవు గాదే నీకున్. (77) ...క॥ వెరవునఁ దత్తనువుం దన, చరణమ్ముల నిఱికి యెత్తి ...పేఁపున ధరియించుచు వచ్చెఁ బక్షితతులు నుతింపన్. (80) వ... రాయంచ యక్కాకి దెప్పిఱిన దానితో నచ్చటికాకులు విన నిట్టియవినయంబిఁకె న్నండును జేయకు మని పలికి నిజసహచరంబు లగుమరాళంబులుం దానును వలయుచోటికిం జనియె, (81)...(భారతము- కర్ణపర్వము-౨-ఆ)

మాలోకానుభవమును బట్టి నే మీక్రిందిపద్యము ననుకరించి వర్తింతుము.

చ॥ వెనుబడి కాకవుల్ తనదుపేఁపుపయిన్, జరణమ్ము లుంచి తాఁ
చిన నది లెక్క సేయకయ చివ్వకుఁ బూనక వైన తేయుఁ డే
మనక శిరమ్ము వంచుకొని యల్లనఁ బోవఁడె శక్తిమంతు లెం
దును నలఁతుల్ పొనర్చు నలతుందుడుకుల్ గణియింప రంతగన్

తారతమ్య జ్ఞానహీనుల యుపదేశములను జెవిఁబెట్టకుఁడు, ఇట్టివారేక దామన కీకయ్యమును బెట్టినవారు చూడుఁడు.

క॥ తు కర్కశ్యముపై నెక్కిన, నిక్కపుసంతోసమందు నిపుణులు కవులం
దెక్కువతక్కువ లరయుదు, రొక్కని యిది విన్న నవ్వరొక్కొ విబుధుల్.

పై రెండుపద్యములును నుత్తరరంగములో రాఁదగుననియైనను జవి చూపుటకిం దుదాహరించితిమి మీరును మీపక్షమువారును దిట్టుతిట్లు మేము లక్షింపము

"శ్లో॥ శరీరం యే వినిందంతి తే సహాయా జనా మమ,
ఆత్మానం యే వినిందంతి స్వాత్మానం స్వయమేవహి"

సోదరకవులారా! మీరును మీకు సంబంధించిన మహాభాగులును నైరంతర్యముగాఁ బ్రచురించు నసత్యములు లోనగునవి నైఁపవీలుగాక యశోరక్షణార్థమై మాయొనర్చిన యీపరిశ్రమమును మావలనఁ బ్రత్యక్షముగాఁ బ్రత్యక్షరమును వినియుఁ దెప్పించుకొని కనియుఁ దమతమయభిప్రాయము లను గొంద ఱంపియున్నారు. అందుఁ గడుఁ గొంచెముగఁ జూపుచున్నారము. ఇందునుగూర్చి యుత్తర

రంగము విశేషించి తెల్పఁగలను. రక్తమాంసములు క్షీణించు నంతపరిశ్రమ చేసి రచించిన యీచాటుభారతమెల్ల నిట్టియోగ్యులకొఱకే కాక మఱెందుకు.

నాగులుప్పలపాడు, చదలవాడ పోస్టు; ఒంగోలుతాలూకా

7-1-1913

చివుకుల శ్రీరాములు నమస్కారములు.

అయ్యా:—మీరున్నూ శ్రీ॥ తిరుపతి శాస్త్రిగారున్నూ వేమవ రాగ్రహారములో శ్రీ॥భాగిచెన్నయ్య గారింటిలో రెండు దినములు జేసి నయవధానము సాంతముగా నవలోకించి మూడవదినమందుమీరు సభకువినిపించిన "గుంటూరిసీమ" యను గ్రంథ ముదయము 8 గంటలు మొదలు మధ్యాహ్నము 3 గంటలవరకు కాలవేగము నెరుగకుండా వినుచున్నవారలలో నేనొకరుండ, గుంటూరిలో నాసనపుచర్చ, యుత్తరప్రత్యుత్తరముల కాలములో నేనచ్చట నున్నాను. తమరువినిపించిన సంగతులన్నియును వాస్తవమని చెప్పగలను............

క॥ "గుంటూరిసీమ"ముగిసిన, వెంటనెయొకపుస్తకంబు వీ. పీ. గనునా
యింటికిఁబంపఁగ మిము శత,ఘంటకవీ! వేఁడువాఁడఁగదు భక్తి మెయిన్.

19-2-13

...నెలరోజులక్రిందట వేమవరపుసభలో "సీమను" తాము చదివిన్నారట? విన్నా మిత్రులందరు "యథార్థము తెలుపుటలో "సీమ" వంటిది లేదనియు, దానిని చదివినచో శక్తిలేనివారుగు లెత్తరాదు, అసత్యపు దారిత్రొక్కరాదు. సత్యబలము సర్వబలములకంటె గొప్పది" అను అంశము దీనివలన దెలిసితీరును. అని చెప్పిరి...."సీమను" వి.పి.గా వెంటనే దయచేసి చిత్తగింపుడు. కంనాళ నరసింహాచార్యులు. కుంభపురం

ఆర్యా 1-[illegible]-13

ఈ కార్డు తమసన్నిధికిఁ జేరిన వెంటనేఁ "గుంటూరి సీమ" అను తమ

పుస్తకము నొకటి వీ. పీ. గాఁ బంపింపఁగోరెదను ఆలస్యము సేయవలదు ఎప్పుడెప్పుడా అని చంద్రచకోరన్యాయముగాఁ గనిపెట్టుకొనియున్నాను ......పోతరాజు వరదయ్య వ్రాలు, పర్చూరుగ్రామము, సంతమాగులూరు పోష్టు, గుంటూరిసీమ

---

3-2-13

గీ॥ శ్రీకరోభయభాషాగరిష్ఠకవిత, స్వాదుమధురధారఁ జేనిప్డు మిమ్మయొనసె
గానకవిసింహ బిరుదవిఖ్యాతులైన, తమకు సాష్టాంగము లొనర్తు
దయను: గొనుఁడు

ఉ॥ వేమవరాగ్రహారమున వీనులవిందుగఁ దాము సత్కవి
స్తోమము గోరుకోర్కి పయి శోధితకామను సీమ నెత్తి ని
స్సీమకవిప్రభం జదివి చెప్పి తదర్థము లచ్చటచ్చటన్
స్వామి! యఖండమోదము నొసంగితి రందఱికున్ విశుద్ధిగన్

గీ॥ అట్టి గుంటూరిసీమ నేఁడచ్చునుండి, బయలు వెడలినదని విని వ్రా
యుచుంటి, వీ, పిగా నొక్కప్రతి నాకు వేంకటకవి, చంద్ర! దయచే
యుఁడని భవత్సుముఖమునకుం. గుండెపూడి, శంకరనారాయణ

కొత్తపేట, గుంటూరు

---

మర్రిపూడి 3-3-13

నేను వేమవరం శతావధానమునకు వచ్చినప్పుడు తమరు చేయుచున్న గుంటూరిసీమలో పద్యములను విని సంతసించితిని ... తయారు కాగానే నా కొకబుక్కు వి, పీ గా పంప ప్రార్థించుచున్నాను.

Malladi Ramakristnayya Teacher, Marripudi,
Bapatla Post.

నేను వేమవరమందు చేసిన శతావధానమునకు వచ్చి యామూ డునాళ్లు కడుసంతసమవ్రునటుల చక్కగాచూచి యుంటిని, యప్పుడే.మీా రు చదివినిపించిన గుంటూరుసీమ చర్యయంతయు విన్నానుగాని య థావిధిగా పుస్తకముచూడవలయునని కోరిక కలిగినది, నాయందు దయవుంచి ఒకపుస్తకముగుంటూరుసీమ ముగిసినవెంటనే V. P. Post గా పంపమని ప్రార్థించుతూయున్నాను.

గొల్లపూడినరసింహారావు, బ్రాహ్మణనిడుమానూరు

---

... పంపిన సీమ గ్రంథములోని భాగము చూచి పరమానందభ రితుడనైతి. 25 పేజీనిగల ఆసనచర్చకు పూర్వము మీారు వివరించిన కొన్నివిషయములు నాకు తెలియకుండెను ఇతరులకు తెలియకుండుట కు ఆశ్చర్యముగాదు ఆముఖ్యవిషయములను తాముచక్కగ విశదీకరిం చినారు అవిచదివినవారు తమయందు లేశమైనదుడుకులేదనిన్ని తమరి ని అవమానింపఁ దలంచి, చేసినప్రయత్నములను పడగొట్టిరనిన్ని ఎట్టి వానికైనను తెలియకమానదు ఈవిషయములను చదివిన తరువాత నామనమునకు ఎక్కువతృప్తి గలిగినది ఇదివరకు ఈవిషయములు నాకు తెలియవయ్యె ఆరంభమందు మీాకును వారికి గలిగినసమావేశమున బ్రి॥ తి॥ శా॥ గారు ఆశుకవిత్వమును గూర్చి చెప్పినవిషయము దానిపై వారికి కోపము వచ్చుటయు ఆ పూర్వరంగము పబ్లికుగా జరుగకపో వుటవల్లను అదిలోకమెఱుంగదయ్యె ఈవిషయములు తెలియని వారు తమపైనిందమోపవచ్చును ఇవి తామత్యద్భుతముగా పరిశీలించినారు మీాపుస్తకమునుజూచిన తరువాత నాకు తెలిసిన విషయమిద్దియె ఇది చాలాముఖ్యమని తోచెడిని 34-41 పద్యముల సందర్భము చాలా బాగుగనున్నది. ఆశుకవితాతత్వమును సందర్భ పూర్వకముగా బో

ధించినారు దీనికితోడు మీరు ఫుట్‌నోట్లలో వేసిన ఆర్యమతబోధిని టంగుటూరి శ్రీరాములు, శ్రీనివాసరావుగార్ల వ్యాసములుస్థిరపరచుచున్నవి మొత్తముమీరులోకముకన్నులు విప్పినారు... కవిత్వములోనేమి గ్రంథవిషయములలోనేమి తమనూతనపద్ధతుల నిట్లుమెచ్చుకొనని మూర్ఖులుచాలతక్కువ ... క్రొత్తమార్గము తమనీగ్రంథము చూపుచున్నది మనభాషయందు చరిత్ర సత్యము ప్రధానముగా వ్రాయుట యింతవరకులేదు అందులో ఇతరులువ్రాసిన దాఖలాలనుతీసుకొని సత్యమును వెల్లడిచేయుట అంతకుమున్నేలేదు ఇంగ్లీషున దీనినే డాక్యుమెంటరి ఎవిడెన్స్ (Documentary evidence) అనిఅందురు ఆంగ్లేయులచరిత్రములు ఈవిధముగా వ్రాసియున్నారు (Documents of English History or English History fiom criginal sources) తమరింగ్లీషు పఠింపని వారయ్యు, తమరీపద్ధతిని చరిత్ర వ్రాయుట తమప్రజ్ఞావిశేషమును తెల్పుచున్నది. ...చా॥ వెం॥ శా॥ 26-7-12

ఉ॥ శక్యము గానికోర్కి గొని సాగమి నం దవమానమంది సా
ర్థక్యము లేనిదబ్బఱలు తద్దయు సింపం దొడంగు దుర్జనో
వాక్యపరంపరల్ నిలిపి వైపుగ దిర్పతి వేంకటేశచా
ణక్యులు దీని వ్రాసిరి ఘనప్రతిభల్ నిజముగ్ గ్రహింపఁగన్

ఈపద్యము మేము రచియించిన దేమైన మునిందలిచాణక్యపదము శ్రీదొడ్డం పేటజమిందారు గారగు శ్రీవాడ్రేవు విశ్వసుందరరావు గారు మాసీమ, గ్రంథమునం గొన్నిభాగములను మావలన విని ప్రశంసించు ప్రసంగములోనిదని తెల్పుచున్నారము మాగ్రంథమును మెచ్చువారిలో వైదికమహాశయు లెందరైనను నెకనియోగిమహాశయునికి సరి గా మేము గ్రహింపనేరము అందులో సెట్టివారినొ వేంకుమందికి దీటుగా భావించుచుందుము, కావున వారిమాటను మే మింత విలువగలదానిగా గణించి పద్యమం దొకవజ్రముగా గూర్చి యానందించుచున్నారము

ఇదిగాక వీరువయస్సుచేఁ జిన్నలయ్యును విద్యాబుద్ధులలో నెంజఱకన్నను కూడ మిన్నలని చెప్పవలసినవారు, ఇట్టివారిమెచ్చుకన్న మాపరిశ్రమకు సార్థక్యమేమి కావలెను? "కృతార్థా వయం"

ఇట్టివారికలిమి నాధారముగఁ జేసికొనియే భర్తృహరి యీమాట వలికెను.

శ్లో॥ జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయం॥

మత్తకోకిల.

మంగళం జయమంగళం శుభమంగళం జగదీశ్వరీ!
మంగళం బగు నీకు మాకును మమ్ముఁదిట్టెడివాండ్రకున్
మంగళం బగు నాశుఘోష సమాఖ్యకుర్కురపుచ్ఛముల్
గంగనీఁదఁగ నూఁతగాఁ గొను కాకవిద్విజపాళికిన్.

సర్వేజనా స్సుఖినోభవంతు.

ఇట్లు
తిరుపతి వెంకటేశ్వరులు.



## వేమవరాగ్రహార శతావధానము.

అనేకావధానములు మావిదివఱకేఁ జదివియున్నారో చదువరులారా! దీనిని గూర్చి వేఱువిధముగాఁ దలంపుఁడని విన్నవించుకొనుచున్నారము, ఇందలి పద్యాదులను గూర్చి యింతగా వ్రాయమునుఁడీ, పద్యములసొబగట్లుండనిండు ఇది చదివినచో ననేకాంశములు తెలియును, అసత్యముగను, అప్రగల్భముగను, బ్రసంగించు వారలగుట్టిది బైటఁ బెట్టునట్లేదియు బైటఁ బెట్టనేరదు, దీనిపీఠిక యెంతో కర్ణరసాయనముగనుండును, ఇందుతుమ్మెదపాట, కూడఁ గొంతవఱకు చవిచూపఁబడినది. ఇంకెన్నో అంశములుగలవు పుస్తకము 100 పుటలుండును అనేకకవులపద్యములిందుఁగలవు చదివితీరవలెను, గుంటూరిసీమ, కిదిసోదరుని వంటిది.

దీనివెల రు 0-7-0 అణాలు మాత్రమే

☞ 95 వపుట 3వ పంక్తి ధీయుత, శ్రీయుత, అనియు 104వ పుట 15వ పంక్తిలో, యతిస్థానము మొదలు "చెప్పితి మింకొక కొంతమంది నా" అనియు దిద్దుకొని తన స్నేహమ్ము, దెవి, తుల్, మెచ్చి, లోనగుస్వల్పలోపములనుఁ దిద్దికొనదగు



శ్రీమత్పరదేవతాయై నమః

# గుంటూరిసీమ, పూర్వరంగము.

(గుంటూరు.)

"శ్లో॥ స్వాధీనో రసనాంచలః, పరిచితాశ్శబ్దాః కియంతః, క్వచి
త్క్షోణీంద్రో ననియామకః, పరిషద శ్శాంతా, స్స్వతంత్రం జగత్,
త ద్వ్యాయం కవయో, వయంవయ, మితిప్రస్తావనా హుంకృతి
స్వచ్ఛందం ప్రతిసద్మ గర్జత,వయం మౌనవ్రతాలంబినః" ౧
(సాహిత్యదర్పణపీఠిక)

*ఉ॥ మామయు నల్లుఁడే వెనుక మాటకు నత్తయుఁ గోడలే, యటుల్
భూమి నియోగులెల్లరును బూర్వము వైదికు లయ్యు నెందు కీ
స్వాములు సాము చేసెద రసత్యము నూఁతగ నూని వైదిక
స్వాములమీఁద, నేఁ డిది విచారణసేయఁగదమ్మ శాంకరీ ౧

---

(1911 సం॥ నవంబరు 8 వ తేదీ ఆంధ్రపత్రికనుండి.)

## నియోగ వైదిక కక్షలు.

*తిరుపతి వేంకటేశ్వరులవారికిని కొప్పరకవిసోదరులకును జరుగుచున్న వివాదముల ఫలితము, యీగుంటూరుజిల్లాలో వైదికనియోగకక్షలమితముగా పెరుగుటయయియున్నది రెండువైపులను నారదమహామునులు యీకలహములను అమితముగ వృద్ధిచేయుచున్నారు. బి. ఎ. బి. ఎల్. పరీక్షలలో ప్యాసయి ఇట్టిభేదములవలన దేశమున కనర్థము వాటిల్లుచున్నదని ఎఱింగియు వీటిని వృద్ధిచేయుచున్న మహాజనుల నేమనవలయును! బ్రిటిషుప్రభుత్వమే లేక పోయిన యెడల ఒకరొకరి గొంతుకలను పరపర తెగగోసికొని యుందురని వ్రాయుటలో నతిశయోక్తిలేదు. ఈభేదములవలన జనించుచున్న ద్వేషాగ్ని ప్రతిపట్టణములోను గ్రామములోను మూలమూలలను వ్యాపించుచున్నది. బడులలో జదువుకొనుచున్న పసిబాలురును బాలికలును యీవైదిక నియోగ భేదములనే చర్చించుచు నొకరితో నొకరు దగవులాడుచున్నారు...వేయేల? యీగుంటూరుజిల్లాలోని స్త్రీపురుషులు.

మ॥ కవులున్ బండితులై నృపాలకులు గానన్ బేల్ వెట్టఁగా వైదిక
ప్రవరుల్ వోలె నియోగు లుండిరి, ధరాపాలుర్ నియోగించుకా

బాలికా బాలకులందరును యీవిషజ్వరముచేతనే బాధపడుచున్నారు. ఈ కార్చిచ్చు నార్పుటకు 10, 15 సంవత్సరములయినను కావలసియున్నది. విద్యాధికులమని విఱ్ఱవీగునట్టి పెద్దమనుష్యులీసందర్భమున చేయవలసినట్టి కర్తవ్యము లేదా?
.........గుంటూరు ఒక ఆంధ్రుడు.

(1911 సం॥ నవంబరు 15 వ తేదీ ఆంధ్రపత్రికనుండి.)

ఒక మాసముక్రింద బ్రహ్మశ్రీ తిరుపతివేంకటకవుల శిష్యు లగువేలూరి శివరామశాస్త్రిగారు మాకాలేజీ బాలురుచేయించుటవలన శతావధానముసల్పిరి. వారికి 28 వ తారీఖున బంగారుపతకమును కాలేజీహాలులోయిచ్చిరి. వారినిమర్యాదచేయుటకు "గుంటూరు ఎమెచ్యూర్సు" అనునాటకకంపెనీవారు చో, చో, నాటకమాడిరి. ఆరాత్రియే వేంకటకవిగారిని, శివరామశాస్త్రిగారిని, ప్రెసిడెంటుగారిని గుఱ్ఱపుబండిమీదెక్కించి యూరేగింపించిరి. 29 వ తారీఖు రాత్రి వారి కెదురు పార్టీవారైన నియోగులు నియోగివంటబ్రాహ్మణుని గుఱ్ఱముమీఁదనెక్కించి యూరేగించిరి. ఆహా! లోకమెట్లుమారినదో చూడుడు. ఇరువదిసంవత్సరముల ప్రాయముగల బాలుడుశతావధానమొనరించెనన నేరికైనను తలవంపేగదా! ఇదెంతయు నరసిచూడ యేమియుబాగుండలేదని నాతాత్పర్యము. ఇదంతయు పులినిచూచి నక్కవాతపెట్టుకొన్నట్లాయెను మాపురమందు కక్షలధికమగుచుండె ఇవన్నియు బాపుకొనుడని నేనుప్రార్థించుచున్నాడను.
గుంటూరు ఒక కాలేజివిద్యార్థి.

(1911 సం॥ నవంబరు 5 వ తేదీ దేశాభిమాని నుండి.)

శివరామశాస్త్రిగారిని యూరేగించిన మరుదినము, ఒకవంటలవానికి జగన్మోహనకవి, యని పేరిడి గుర్రముమీదనెక్కించి, ఆవిఁదీపములు- బేండువాయిద్యములతో నూరేగించుటయే కాక, దారివెంటను- కొందరు వైదికుల యిండ్లముందరను గలభా చేసిరి.

(మ॥ రా॥ రా॥ కార్చెర్ల శ్రీనివాసరావుగారి ‹కొప్పరపుకవులు, ఆశుకవిత్వము, అను చిన్ని పొత్తము నుండి.)

...ఇప్పుడు జరుగుచున్న సంగతులన్నివిని బాగుగాఁబరికించి చూచిన కక్ష నియోగులకుఁ గలదుకాని వైదికులకు లెదని తోఁచుచున్నది.........కానఁగక్ష నియోగులకు మాత్రమే కలదు. (2) వైదికులగు శ్రీ తిరుపతివేంకటేశ్వరకవులు శ

ర్యవిధుల్ దీర్చుచు సేవ సేయుచు నియోగ్యగ్రేసరుల్ వోలె నేఁ
డవనిన్ వైదికు లుండి, రేటిపని కంబా! *వీరి కీభేదముల్ ౨

చ॥ తెలుఁగుకవిత్వమున్ సలిపి ధీవరమాన్యత గాంచినార్నియో
గులు మును పెంద లేనియును, గొందఱు సంస్కృతమందుఁ గూడఁ బ్రా
జ్ఞలు గలవార లుండి, రొక సంస్కృతమే తమజీవనంబుగా
మెలఁగిరి వైదికుల్, తెలుఁగుమీఁదికి నంతగ రారు వారొగిన్ 3

---

తావధానమును మిగుల శ్లాఘాపాత్రముగా నొనరించుచుండుటచే వారికవిత కొప్పరనియోగికవిగారి కవితకంటె వేయిమడుఁగులధికముగాఁ బ్రకాశించుచుండుటచే నోర్వఁజాలక నియోగిప్రముఖులు సభలో నేదోయొకయల్లరి వెట్టిరని బుద్ధిమంతుల కందఱికిని దీనిమూలముగాఁ దోఁచక పోదనితలఁచెదను. .........కాననియోగులే కక్షను వహించుచున్నారని దీనివలననుదెలుచున్నది. .........శివరామశాస్త్రిగారు .......... శతావధానమును మిక్కిలి జయప్రదముగా నొనరించిరి. సభవారానందించుటయేకాక సంతోషాతిశయముచే నవధానిగారిని బురవీథుల నూరేగించిరి. అందుపై నియోగిప్రముఖులు నియోగిపుంగవుండగు వంటబ్రాహ్మణు నొక్కని దీసుకొనివచ్చి 'వంటలశతావధానికీ జే'యని కేకలు వేయుచు నూరంటనూరేగించిరి. ఇతరులు చక్కఁగాఁ గవిత్వమును చెప్పిన వీరలకెంత కడుపుమంటఁగానుండునో యిదియే బోధింపఁగలదు. నియోగులగుకొప్పరకవుల నియోగులు కొన్నితావుల నూరేగించుచువచ్చిరి, అప్పటి వైదికులు తమలోనివంటబ్రాహ్మణుల మరల నూరేగించిరా? అట్టిబుద్ధిమంతు లెవరును తలంపఁజాలరు. అసూయలేనివారుకనుకనట్లు వైదికులు చేయలేదు, లెకున్న నేలచేయరు? ...... ... నేను వైదికినిగాను, నియోగినిగాను, ఉభయుల క్షేమమునుగోరుద్విజేతరుఁడను. ఇవి నాయూహలు. దేశక్షేమమును గోరి నేనిట్లు వ్రాసితిని.

*(జూను 15 వ తేదీ 1912 సం॥ దర్బారులోని, కే. వి. లక్ష్మణరావు, ఎమ్. ఏ. గారి యుపన్యాసమునుండి.)

...ఇందుచే వైదికులు తమశ్రోత్రియత్వమే కారణముగాఁగల యాధిక్యమును మఱవవలెను. ఇటులేనినియోగులుకూడ తామధికులమని యనుకొనఁగూడదు. వీరు తామధికులమనుకొనుటకుఁ గారణమేమి? తాము లౌకికధూర్వహులమనియు రాజకీయాధికారముచే శోభితులమనియు రసికులమనియు వైదికులట్టివారు గాక యాచనయే జీవనాధారముగాఁ గలిగి లౌకికజ్ఞానము లేని యరసికులనియుఁగదా వీరితాత్పర్యము. ఈయంశములు పూర్వకాలమున నెంతనిజమైనను నేఁడు నిజములుకావని యందఱకుఁ దెలిసినవిషయమే. ప్రస్తుతమనేకవైదికులు ఇం

చ॥ తెలుఁగలసంస్కృతమ్మునకుఁ దీయనిచుట్టము సంస్కృతంబొ! ఆ
తెలుఁగునఁ గల్పకున్నయెడఁ దీపి జనింపదు చప్పనౌ, నటుల్
గలియవలెన్ నియోగులును గ్రందుగ వైదికు, లట్లుగానిచోఁ
గలిగెడునష్ట మెవ్వరిదొ గాంచఁగ లేదె ప్రపంచ మంబికా

చ॥ తెలుఁగన! నీవు, సంస్కృతము దేవర శుద్ధశివుండు, నీకునున్
గలుగవు మాయకున్ భిదలు, గన్గొనఁ వారికి నీకు భర్తకున్
గలుగున భేద మేర్పడెడుఁ గాని యశక్తులు దీని నెప్పరో
లలితరొ! సార మియ్యది బలంబు సమస్తము నీకు భర్తయే

చ॥ పరశివు వీడి నీ వొనరుపం గలకార్యము నుంత లేదు, ని
న్నమర సేయుపై నతని కంతిను కాని స్వయంప్రకాశుఁ డా
స్మరహరుఁ, డిట్టిభేదమసుమా! తెలుఁగున్ మఱి సంస్కృతంబు డం
బలరునియోగివైదికులు నందుచు నుండు రెఱుంగ నేర్చినన్

శా॥ మాయాస్థానము తెల్గు, సంస్కృతము సాంబస్థానమున్ జెందె నం
బా; యీరెంటిని బ్రాహ్మణప్రవరులే పాలించుచున్నారు తా
రేయేయాశ్రయ మేరొనర్పదరొ వా రేర్పాటుగాఁ దద్గుణ
శ్రీయుక్తింగన కెట్లు మానుదురు, నీచే మాన్పఁగా శక్యమే

తే॥గీ॥ ఉభయభాషాశ్రితులకబ్బు నుభయగుణము, లేక భాషాశ్రితులకబ్బు నేకగుణము
తత్తదను సారముగ వారి దారులుండు, నదియ యీకబ్బమందు నీవరయవలయు

ఉ॥ ఎన్నఁటికేని మాయ యది యింకక మాన దటంచు శుద్ధస
త్త్వోన్నతి తత్త్వమున్ దెలియుయోగులు చెప్పెడిమాట సిక్కమే
యన్నయెడన్ నిజం బెటులొ ఆర్యులవ్రాఁత లె తెల్పుఁగాక ప్ర
త్యేనున్నలవ్రాఁతలం గలయసత్య మవశ్యము బైటఁ బెట్టుచున్

---

గ్లీషులో గొప్పపరీక్షలనిచ్చి తహసీలుదారు డిప్యుటీకలెక్టరు మొదలయిన గొప్పయుద్యోగములను జేయుటయు వారియింటిలో నియోగియగు సింగన్న పంతులుగారు పాకాధ్యక్షుఁడు గానుండుటయు మనము ప్రత్యక్షముగా నిప్పుడు చూచుచున్నాము. ఇట్టి సింగన్న పంతులుగారు నేను అమాత్యపదవికి నర్హుఁడను కావున ఈవైదికికంటె శ్రేష్ఠుఁడనని చెప్పినయెడల హాస్యాస్పదముగనుండదా? కావున మనమిట్టిగర్వము విడువవలెను. ప్రస్తుతము వైదికమునఁ దేమి లౌకికమునందేమి యందఱును సమానులయినారు. ... ... ... ...

*ఉ॥ కొప్రపువారిపైఁ గలదు కూరిమి బోలెఁడు మాకు, వారియా
శుభ్రతిభావిలాస మది చూడఁగఁ బత్రిక నంపి యుంటి మా

---

## *(1911 జనవరి 17 తేది మంగళవారము శశిలేఖ నుండి.)

### శ్రీకొప్పరపు సుకవి ప్రశంసావరత్నములు.

శా. అయ్యా! కొప్పరపుం గవీశ్వరులు! మీ హాస్యంబు మే మెప్పుడే, నెయ్యం బూడఁగ లేదు శిష్యుఁడొకఁ డోహో! యంచు మెచ్చెన్ మిమున్। వెయ్యార్లియ్యఁ గశక్తిలేదు కొనుఁడీ వెయ్యారులే యంచు మే। మియ్యంబూనిన పద్దెముల్, మనుఁడి మీ రెచ్చోనిరాఘాటులై. ౧ చ॥ "అరుదగు మీకవిత్వ" మని యాప్తుఁడు శిష్యుఁడు నైనమాత్రమా! కరము వచింపఁగా విని యఖండముదంబును బొందినాముఖం। దరుదరి కేగుదెంచియును దామటుపుల్ జనుదేరకుంటి మీ। సరిసైన మబ్బు దయ్యెఁ బరితాపకరం బిది మాకు నెంతయున్. ౨ చ॥ "సరిగ శతావధానములు చక్కఁగఁ జేసెడివారు పూర్వమే। వఱలిరి నేఁడు లే" రనెడివార్తలు కల్లలు, దివ్యవాగ్ఝరీ, భరిపరిపూరితాద్భుతసభాసదలంకరణప్రచారసుం।దరగతర భావభావుక కనద్భవదీయ వధానసంపదన్ ౩ చ. "చనెడి శతావధాన మనుజాహ్నవి సంద్రమునం దడంగఁగా"। నని జగమాడునప్పలుకు లన్నియు నేఁటి శుద్ధమయ్యెఁ ది। నన్నికవితాప్రవాహమున నాటకవేషములట్లుగాక మీ।రొనరుచుచున్న దివ్యకవితోదయ మున్ ప్రహదమద్దు వచ్చుటన్. ౪ ఉ॥ ఏమొకకొంతకాల మెదియే నొకతీరు శతావధానముల్। గ్రామములందుఁ బల్లెలను రాట్సభలన్ బట్టి రాజధానులన్। స్వామికృపావిశేషమున సత్కవనాగను సల్పుచుంటిమిం। కేమగునో! మఱేమికొదవీరవధానుల రుద్భవించుటన్. ౫ ఉ. బందరు వచ్చి యప్పటిసభాసదులన్ దనియించి వారిచేఁ। జగదసమా! సుమంబొ! మఱి శక్తికి మించని దేదిగాని మీ।రంద కృతార్థులన్ సలుపుఁ డంచు।మమున్, మిముఁ జూచుకోరికమా। డెందములందు మిక్కుటముగ డెందిగ సంపద చేసెడన్ జూడీ ౬ చ. అనఘులు! కావకూర్గ్రములయట్లొకచోటనె మగ్గి సగ్గి నూ। తనమగు నాడుత్రోవ నవధానము మానము గంగఁ గప్పితో, మన్నిక యూంత... ఁ గొనెడి యర్చకపుంగవులట్లుగాక మీ।రొసపుచు మార్గముల్ మది "కహా" యని మెచ్చొడఁగూర్చెడున్ జూడీ! ౭ క. మీనామంబులు మియవధానము విని మాయకవులు తలలెత్తక లో। లోన నిఁక నేని సిగ్గును। బూని గొనుకట సుంద్రము గాక బొమ్మలపోల్కెన్. ౮ క. శశిలేఖ గోనఁ జదివితి। విశదంబయ్యెన్ భవత్ప్రవీణత మికున్। బూన మబ్బుఁ గాక భగవ। ద్వశమై యాయువును సిరియు వఱలెడుఁ గాతన్.౯

ఇట్లు

తిరుపతి వేంకటేశ్వరులు.

క్షిప్రకవుల్ మహేమె దయనేయరు పిమ్మట వారిసీమకే
*స్వప్రథితానురాగ మది చొప్పడ మమ్మును బిల్చెఁ బెల్లనన్ ౧౦

¶ వ॥ అచట నియోగివైదికుల కంతకుఁ బూర్వమె కక్ష లఁట! త
త్ప్రచురత నంతయున్ దెలియ వచ్చినవారము గామిఁ బేర్మి మే

---

(12-8-11 గుంటూరు.)

*బ్రహ్మశ్రీ... గారికి, ... మున్నగు పెద్దలచేత ... తిరుపతి శాస్త్రులుగారును తామును ... శతావధాన మొనర్చునట్లుసభ ... ధ్రువపఱుపఁ బడినది ... పై పెద్దల చేవ్రాళ్లుగల యాహ్వాన పత్రిక రేపుతమకును. తిరుపతి శాస్త్రులవారికిని జేరితీరును. తాముభయులును గలసివచ్చునట్టి వీలును దామేర్పఱుప వలయును. తమసభఁ దిలకింపఁ బెక్కు గ్రామములనుండి పల్వురుతటస్థులు రానుత్సాహపడియున్నారు. తమదర్శనమె తరణోపాయమన్నంత యెన్నిక యిటఁ గల్గియున్నది, తామువచ్చినప్పుడె యిచ్చట ఘస్తూకంపెనీవారు తమ పాండిత్యవిజయముఁ బ్రదర్శింపఁ గుతూహలులైయున్నారు, ... పెక్కురు సరసులు తమరాకకై నిరీక్షించియుండిరి, ... దేవుని వరమడిగినట్లు దేవరవారి నొకమాట వేఁడికొనుచున్నాఁడను, తాముభయులును బందరునుండి యేరోజున నేటయమున నేబండికి నేటయమునకు గుంటూరున దిగుదురో దయయుంచి తెల్పినచో నే నాబండిని గాచుకొని యుందును, అటుపై నాకుటీరమున నాలెంక పూటలును నివసింపఁ బెక్కు సాష్టాంగము లాచరించెదను. అనేకజన్మార్జితపుణ్యఫలమిదియే యనుకొందును.

శిష్టా హనుమచ్ఛాస్త్రి, టవున్ హైస్కూల్ తెల్గుపండితుఁడు.

---

¶(1911 సం॥ నవంబరు 5 వ తేదీ, దేశాభిమానినుండి)

ఈ గ్రామమున నియోగి- వైదికకక్షలు బాగుగ ప్రబలినవి- ప్రబలుచున్నవి. వీటి కంతకు గారణము ఈ పత్రికయం దింకొకచో ప్రచురింపబడిన "నియోగి, వైదికశాఖలవారి కొకవిజ్ఞాపన" యను వానియందుసూచింపబడిన, "ద్వైతాద్వైత" ఏర్పాటె కారణమని తలచెదము.

---

(ఫిబ్రవరి 2 వ తేదీ 1912 సం॥ కృష్ణాపత్రిక నుండి.)

ఒకనియోగి వద్దనుండి.

... దీక్షితులుగారు చనిపోయినతరువాత కొంతకాలమున కీగడబిడ యణగెను. ... ఇట్టికాలమున ద్వైతాద్వైత మతస్థాపకులగు ... శర్మశాస్త్రిగారు బయలుదేరిరి. ఆదిశంకరాచార్యులువారు అద్వైతమతస్థాపకులు, ఆచార్యులవారికి సమస్తశాస్త్ర

గీ॥ ఇతఁడు జూపూడికులుఁడు న స్తుతమునందుఁ బ్రజ్ఞఁగలవాఁడు* సుకవిస్వభావ
నగ్రము, డల్లసీమనియోగులయందు రామ, రావు తరువాత నితఁడె కరంబు మేటి.

క॥ జూపూడిహనూమత్కృతి, యీపగిదిన్ బలుక వెంటనే యానుడి సం
స్థాపించుచుఁ గోటీశ్వర, శాపాయుధుఁ "డౌను జడుఁడ జను వీర లనెన్ ౧౮

చ॥ నుగుణను నిట్లు పల్కుటయు మోమున వెల్వెల బోఁచెఁ బాప మా
సుగుణికిఁ గొప్రపుంగవికిఁ జూచి "యి దొప్పనితోఁచె" యంచు వీ
రిఁగ నిటు లాడుచుండిననునింతుల కొప్పఁగ రా దటంచు నె
ప్పగఁ గని వేంకటేశ్వరుఁడు పేర్మి గనంబడ నిట్లు పల్కెడున్ ౧౯

ఉ॥ ఏమిగ నిట్టులాడెద రహీనుల రయ్యును విద్దెరానిలో
కేమి గణింతు, రీయన ఘుఁ డెంతయు దట్టుఁడు పూర్వపుణ్యమే
సాగఁగఁ జేయు నీతనికి సత్కవితాగరిమంబటంచుఁ దా
నాఁగఁగ వార లిట్లనిరి యాతని కేమముగాఁగ మీఁగుదున్ ౨౦

ఉ॥ ఎందుల కిచ్చకంబు, లెవఁడేనిఁ గవిత్వము చెప్ప నేని మె
ప్పందునయేని విద్యయెడ నంతయు నింతయు ప్రజ్ఞ యుండు నెం
దుం దగు లేక యున్న యెడ దోసము లుండక మాన, నంచు నా
రందఱు నేకవాక్యముగ నాడిరి యుక్తివిశేష మేర్పడన్ ౨౧

చ॥ అది నిజ మంచెఱింగియును నాపుఁడు కొప్రపుసోదరుండు నె
మ్మది నెటు లెంచునో యనుచు మాటికిఁ గొంకుచుఁ "బోతరాజు గా
రెది పఠియించె, నింక నుకఁ డేది పఠించెఁ! బఠింపకున్న నే
కొదయును రాదు నిక్క" మని కొప్పరపుంగవివక్ష్యమూనుచున్ ౨౨

---

బ్ర॥ శ్రీ॥ ... గారి పాదపద్మముల సన్నిధికి,

*చ॥ నవకవితావిలాసినికి నాయకు లాంధ్రనృపాలసత్సభా, భవనములందుఁ బూజ్యులు శుభంకరమూర్తులు దుష్ప్రవర్తనో, ద్భవకుకవీంద్రగౌతము లుదారులు తిరుపతివెంకటేశ్వరుల్, స్తవమున కర్హులౌ కవులసన్నిధికిన్ విలిఖించె పత్రమున్ ॥౧॥

తే॥గీ॥ శతవధానాంశ కవితాప్రశస్తులైన, మిమ్ము నే బద్యములఁ వ్రాయ నెంతవాఁడు, కొంచెమో గొప్పయో నేను గాడ నట్టి, వాఁడననుటను దెలియక వ్రాసినాఁడ॥౨॥...

జూపూడి హనుమచ్ఛాస్త్రి,
శతావధాని, బండారుపల్లి.

4-2-11.

క॥ వాదింపఁ దుదకు నెట్టులొ, వాద మెదుటివారు నెగ్గి "పాండితి కవికిన్
లేదేనిఁ గవిత యది కొఱ, గా దని సిద్ధాంతపఱిచి కదుఁ బేర్మి మెయిన్ ౨౩
క॥ బోధించిన విని యాతఁడు, సాధుత మెఱయంగఁ జదువుఁ జదువఁగ నొప్పెన్
గాథ యిది వేంకటేశుఁడు, శోధించుచునుండె శంక చొప్పడుకతనన్ ౨౪

ఉ॥ ఎందుల కీప్రసంగ, మితఁ డెట్టిఁడయే నగుఁ గాక చూడ వ
చ్చెం దనవారు దాను, నిటు శ్రీపతి యాడఁగ రాద, ఆడెఁబో
బందుగు లౌనివారాగులును బల్కుట యేటికి సంభవించె, నెం
దెందును గాక యీపలుకు లిక్కడ వచ్చు టయుక్త మెంతయున్ ౨౫

ఉ॥ చూడక మున్న మెచ్చితిని సోదరులన్, మఱి చూచినంతలోఁ
బోఁడిమి కొంత తేలె, నిఁకఁ బోలద వేఱొకమాట పల్క "ము
క్కోఁడొ యొకండు గోసికొన నెల్లరుఁ గోసికొనంగ లెదె" యా
జాడయె యిప్డు పట్టవలె సత్యముతోఁ బని లేదు సుంతయున్ ౨౬

చ॥ తిరుపతి మెచ్చ లే దనియుఁ దీరిక నూరక మెచ్చె వెంకటే
శ్వరుఁ డొకరుండు మాత్ర, మని స్వాంతమునందు నెఱింగి రేని యె
వ్వరు పయి కాదువార "లవి పంపిరి యిర్వురుఁ గూడ" నందు రం
దరసినఁ గన్పడున్ దిరుపతయ్యయు వారికి సాక్షిభూతుఁడై ౨౭

తే.గీ॥ అట్టిచో విప్ప డిటులాడు టంత మంచి.మాట గా పల్లవారికి మంచి గోరి
చెప్పినను నన్యథాబుద్ధి సేయు జగము, కాని యింకొక లాభంబు గలిగె నేఁడు
క॥ తిరుపతితో పాటుగఁ గొం, డఱు తద్బంధువులు గూడఁ దద్వాక్యము నే
సరి యనుటె కాక యున్నే, తఱచుగ బోధించువిధము తగఁ జెప్పిరొగిన్. ౨౮
చ॥ మనయెడఁ * గొప్పగంపుఁగని మన్ననయున్ గడుభక్తియుక్తి యుం
డి నడచుచున్న యట్టులు గదిందగ సాక్ష్యము లుండె వీరలన్

---

* (1910 సం॥ డిశంబరు 10వ తేదీ ఆంధ్రపత్రికనుండి.)
కొప్పరపువారి అష్టావధానములోని పద్యము.
చం॥ అరుదుగ నిచ్చ మెచ్చి విబుధావళియేత మశ్లోక మెన్నఁగా। హాగపుగ శ్రీ
సమన్వితులు నై విజయానుచరత్వమూని యా। తిరుపతివేంకటేశ్వరుల తీరునఁ జె
ప్పఁగ నొప్పినారిలన్! దిరుపతివేంకటేశ్వరసుధీరులె శ్రీకనుపర్తివంశజా

గనకరయె మెచ్చియుంటిమి పగల్ మఱి యెవ్వియు లేవు, వారికిన్
జనవున నేని యెందులకు సల్పవలెన్ హితబోధ బాధగన్

---

## (1911 పిబ్రవరి 1 తేది బుధవారం శశిలేఖ, నుండి)

## శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరుల ప్రశంస

### చన్పకమాలిక

తిరుపతి వేంకటేశ్వర సుధీశ్వరులార! మహేశ్వరీకృపా । భరపరిలబ్ధభవ్యమతివల్లభతానతసర్వసత్కవీ । శ్వరధరణీశ్వరార్పితలసద్రసవత్పద పద్యమండనా। దరణగుణప్రభూతకవితావనితామహితానురాగసుం। దరతరమూర్తులార! రచితాద్భుతకృత్ప్రథితప్రబంధబం । ధురతరహృద్యపద్య చయతోషితపండితమండలీసుదృ । క్సరసిజనిస్సరన్మధురసభ్రమకారిముదశ్రువారిశీ । కరపరిషిక్తహస్తపటకల్పితశీతలవాతపోతవి । స్ఫురితతనూసుఖాకలితపుణ్యజనస్తుతివాగ్విలావసం । భరితసమస్తపట్టణ నివాసజనాంచితమానసాంతరాం । కురితనవానుమోదరసగుంభితపద్యకవిత్వమల్లికా । పరిమళితాష్టదిక్కుహరభాసురకేసరులార! భూసురో । త్తమమణులార! మిత్రజనతామరసాకరమిత్రులార! సు । స్థిరపరమోపకారగుణసింధువులార! శతావధానధీ । పరిణతులార! పూజ్యకవిబాంధవులార! విధేయులైన సోదరకవులిచ్చువందనశతంబులివే కరుణన్ గ్రహించుఁడీ । చ॥ ప్రవిమలభవ్యసద్గుణవిభాసురుఁడైన ప్రభాకరాఖ్యస । త్కవివరుఁడెట్టి యష్టవధానము గన్గొని తెల్పినంతనే, సువిలసితాఖిలార్థపదసుందరపద్యకదంబకంబు మా। కవునని మెచ్చిపంపినదయాబ్ధుల మిమ్ము నుతింపశక్యమే॥ క॥ ఒరులన్ మెచ్చినచోఁదన । పరువు చెడునటంచు నెంచుపద్ధతి నీర్ష్యా। కరమగుసీకలివేళన్ । బరమామోద మిడె మీస్వభావంబు బళీ॥ ఉ॥ యక్షపసంపదం గనినయట్టిధనాఢ్యులొసంగు వేయి నూ, ర్లాక్షణ ముండియేచనెడినక్షరసంపద గన్న మిమ్ముఁబోల్ దక్షులు మెచ్చి యిచ్చు సుకళాంచిత మైతగు శ్లోకమెంతకేనక్షరసంపదన్ మిగుల నందినశ్లోక మొసంగఁజాలెడిన్ చ॥ జననుతులార! మీపురము సన్నిధిప్రామరె గొప్రమవోలులన్, గనియవధానముల్ జరుపుకాలమునం దటకేగుదెంచి ద, ర్శన మొనరింపఁగా మదిని జాలఁగఁగోరితిమప్పుడింటఁద, ప్పని పనిగల్గుటన్ జనుట పొల్పడెఁగావున నాఁటికోర్కెదీ,రని పెనుచింత యింత యనివ్రాయఁగ శక్యము కాదు లేఖినిన్ శా॥ లాఁతింబోని రసజ్ఞశేఖరుల సల్లాపంబు గల్పించి వి।ఖ్యాతిం జెందిన మీకుఁబద్యములనీఁగాంక్షించినా మిమ్మిమీ, చేతఃప్రీతిఘటింప నేరవయినన్ జేకొంద్రు గా కాప్తులై "శీతాంశో రమృతార్పణం" బనునుడిం జింతించి ధీరోత్తముల్! ఉ॥ సత్కవితావిలాసము పొసంగఁగ నీమదరాసులో సుధీ,రోత్కరమాదరింప నిపుడుండియు బందరుచేరి మిమ్ము సంగ, పత్కరులం గనుంగొనెడు భాగ్యము గోరుచునుంటి మింక వి, ద్వత్కవివర్యులార! భగవంతుఁడు మాక

చ॥ ఆనిమనమందు వెంకన తనంతన సందియ మందుచుండి యా
తనియెడఁ బ్రీతి యెక్కుడుగఁ దద్దయుఁ జూపి బహూకరించుచు
న్ననుమనమందు నాశుకవి "నాకిటుతిర్పతిశాస్త్రి బోధ చే
యునె" యని కొంకుచున్నటులెయూహకు వచ్చుచునుండె మెండుగన్ 31

ఉ॥ ఇంతకు మున్నె చెప్పఁదగు నింకొకసంగతి; రామయాఖ్యుఁడ
త్యంతము కీర్తిశాలి ఘనమై తగుపద్ధతిఁ బొల్చువాఁడు శ్రీ
మంతుఁడు మమ్మువిందునకు మన్ననఁబిల్వఁగ నేగుదెంచె స
త్స్వాంతులు బందుగుల్ బలసి తన్నును వెంబడిఁ గొల్చుచుండఁగన్. 32

ఉ॥ వచ్చినతోడనే పలికె వారక యాఁతఁడు "మిమ్ము నేఁడు మే
మిచ్చటఁ గోరుకోర్కు లివి, యెయ్యవి యందురయేని! విందుకై
వచ్చుట యొండు, నాశువునఁ బామరులన్ గరఁగించుటొండు, వి
ద్వచ్ఛ్రయమాన్యతల్ మనుపె తద్దయుఁగాంచితి రీరు నావుడున్ 33

---

ద సంఘటించుతన్ క. అరనిముసమయినఁదీరిక । బొరయమిచే నిన్నినాళ్ల బోయెనుబత్రికయు । త్తరమున్ వ్రాయఁగ గావునఁ। గరుణ క్షమింపవలె నిది జగన్నుత చరితుల్॥

ఇట్లువిధేయులు, కొప్పరపు వేఁకటసుబ్బారాయ,-వెంకటరమణయ్య.

---

( 4-9-11 న తేదీని వేటూరి ప్రభాకరశాస్త్రిపేర కొప్పరపువారు వ్రాసినలేఖనుండి.)

" ... మరుసటిదినము ఉదయమున వారు (తిరుపతివేంకటేశ్వరులు) రంగావఝ్ఝల హనుమయ్యగారు అను ప్లీడరుగారియింట్లో నుండఁగా దర్శనము చేసికొనుటకు వెళ్లినాను, వెళ్లివారినిగుఱించి నాకుండుసంతోషమును భక్తిభావమును వెల్లడించుచుఁ గొన్నిపద్యములను చదివి 11 గంటలకు మరల భోజనవేళయగుటచే శ్రీ ఏకా రామయ్యపంతులుగారింటికి వచ్చినాను,...

---

(శ్రీ జయంతి రామయ్యపంతులవారియుత్తరమునుండి).

...... ఈకలహమునకుఁ బూర్వము వారికిమీయందుగౌరవముండెనని నేనెఱుఁగుదును, వారికిమీరు సాదరముగాఁ బద్యములంపినారు, మీకీ భేదము నితరులు కలుగఁజేసినారు....

ఉ॥ పలికెను వెంకటేశ్వరుఁడు భావ మెఱింగి "వధాన మైనయ
ష్వల నది యట్లు చేయుదము పండితులొప్పని ఫక్కి యేల! వా
రలు మఱియన్య లొప్పికొను రాణనె పోవుద" మంచుఁ బల్కిన
ప్పలుకులు వించుఁ దిర్పతియుఁ బల్కె సమంచితఫక్కి నీగతిన్ ౩౪

ఉ॥ కోరినకోర్కె లం దొకటి గొప్పది గాదు, మఱొక్కటో, మహా
భారము, పామరుల్ గరఁగుపద్ధతి గాఁ గవనంబు చెప్పినా,
దారులు మున్నెఱుంగ మది తప్పని దండురయేని వ్రీడనం
హారము కాక యెట్లొదవు నట్టికవిత్వము నేఁడు మా కొగిన్ ౩౫

ఉ॥ "వ్రీడ" యటన్నప ల్కె తఁడు వేయక వేయు తెఱంగుఁ జూపె నా
ప్రౌఢ వచించుమాట యది పూర్తిగ వ్యంగ్యపురంగు లీనుచున్
"దూడలతోఁ గవిత్వ మది తుందుడుకొప్పఁగఁ జెప్పకుం" డెని
గ్గేడను లేదు దానికిఁ గవీంద్రులు పూనరు వేయు నేటికిన్ ౩౬

ఉ॥ కొప్పరపాశుధార యది గొప్పగ మీమది నెంచి మీరు మ
మ్మొప్పగిదిన్ దడాబిడిగ నల్లుట కోరుచునున్నవార లా
తప్పదుకైత చెప్పినపదంపడి* పండితులెల్ల నవ్వ నా
యొప్పమికేరు పాల్పడుదు రూరక వాఁగుటయున్ గవిత్వమే ౩౭

చ॥ చదువనివానిపోలికిని "జర్బర చర్బర" విద్య నేర్పు వాఁ
డెది వచియింపఁగా గలఁడె! యెందును లా యెఱుఁగంగ లేని వా
ర్వదరెడిపోల్కి లా తెలియువారు వచింపఁ గలారె! శాస్త్రసం
పద యడఁచున్ వదావదత, పామరమాన్యత కైత కేటికిన్ ౩౮

ఉ॥ "శ్లీ[illegible] బల్ల [illegible]ద్దె"- నని వేమరుఁ జెప్పుచు మెప్పు చూపు నా
జాడకవిత్వమున్ సలుపు కైలికి నక్కవి పోఁడు చక్కఁగా
దూడలు రాకయుండుగతి దూఁకుడుగాఁ గవనంబుఁ జెప్పినా
ప్రోడ లె పెద్దనాదు, లిటు పోయిన వారికిఁ బేరు నిల్చునే ౩౯

---

*శ్లో॥ నాఽకవిత్వ మధర్మాయ, మృతయే దండనాయవా, కుకవిత్వం పున
స్సాక్షాన్మృతి మాహుర్మనీషిణః,, (మహాకవి దండి)

ఉ॥ బొబ్బిలిపాట మెచ్చఁ దగుపూజ్యులు గొందఱు, బొమ్మలాటపెన్
బొబ్బలు మెచ్చఁగాఁ దగినపుణ్యులు గొందఱు, వీరిమెచ్చుకై
సిబ్బితి వీడి యేసుకవి చెన్నఁటికైతకుఁ బూన నేర్చు! "మే
లబ్బెను మ్లేచ్ఛభాష తుద, కన్న బుధోక్తికిఁ దా వానంగుచున్ ౮౦

చ॥ రయముగఁ బండుధాన్యము కరం బహితం, బది కూలినాలికిన్
వ్యయమొనరించి యుంచుక యనంతర మేయవి పండు వానినే
కయికొని గాదెఁ బోసికొనఁగా ఘననాగరికుల్ దలంతు ర
ట్ల యతిగఁ జెప్పనాశువును నాశువు నప్రియమున్ బ్రియంబు నౌ ౮౧

ఉ॥ ఇంతటివ్యంగ్య మిచ్చుగతి యేర్పడఁ దిర్పతి వెక్కె దానిపైఁ
గొంత మనమ్ములో వగపు కొప్పరపుంగవి దాల్చె దానికిన్
జింత గలట్టివెంకనయుఁ జేయనుపాయము లేక యెట్టులో
సంతసమున్ ఘటించుటకుఁ జల్లఁగ నీగతిఁ బల్కె నొప్పుగన్ ౮౨

మ॥ వినుఁడీ రామయగారు! మాహృదయమున్, వేయేల! ఘంటాశతం
బును జెప్పం బ్రయతించువాఁడె* కలుపున్ బూర్వోక్తముల్ పద్యముల్
మనవా రెట్టులు కల్పకుందు! రిది సామాన్యంబు, పూర్వోక్త వ
ర్ణనముల్ చేరని యట్టి దేకథయు నుండన్ బోదు లోకమ్మునన్ ౮౩

ఉ॥ అప్పుడె కైత చెప్పినను నజ్ఞుఁడు నమ్మనుగాని, ప్రాజ్ఞుఁడో!
చెప్పిన వింతఁ దూర్చెనని చిత్తములోఁ దలపోయు "నాశుగాఁ

---

*(జూలై 1912సం॥ ఆంధ్రభారతిలోని శ్రీకవిరాజు శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిలవారి వ్యాసమునుండి.)

......మఱియు నీయాశుకవులు:— "గీ॥ జల్లిపదములు నాలుగు సంతరి[illegible]। గురువు లిడుచోట లఘువులు కొన్ని గూర్చి। విరతిగూడక మీఁదులు వెదకికొనుచు। నచ్చుపొల్లుల నైసుంచు నతఁడు కవియె॥" అనునీపద్యాభిప్రాయమునకుం బాత్రులై దేశాటనము చేయుచుం బ్రార్థించి సభలు చేయించుకొని సభలలో నేదే నొకవిషయమీయ దానింగూర్చి పద్యములు నోటికివచ్చినట్లు చెప్పుదురు, ఆచెప్పుటలో నది వఱకుఁ బెక్కుచోట్లఁ జెప్పినవియు నుండును......

జెప్పెడివారికట్లనిది చెల్లు'' నటంచురో! *కొన్ని యాశుగాఁ
జెప్పను వచ్చుఁ గొన్ని మును జెప్పియుఁ దూర్చను వచ్చుఁ గొల్లగన్. ౭౭

చ॥ వలసినఁ జూపువార మిది వాస్తవ మిట్లొనరింపకుండ నా
నలువయు నాఁపనేరఁ డిది నమ్మరయేనియుఁ గొప్పరంపువా
రల నడుగుండు భిన్నమగురాణను జెప్పదు రేమొ యంచు న
వ్వల నల కొప్పరంపుఁగవివంకకుఁ గాంచి సుహృత్త్వమేర్పడన్ ౭౮

మ॥ కలదే మాదగుప్రశ్న కుత్తరము వక్కాణింపఁ డీ రట్టివా
రలు గారాశువునందె చెప్పదురు సర్వంబున్, మఱేరేని యి
ట్టులు వాదించినవారి కుత్తర మదెట్టుల్! పూర్వపుంబద్దెముల్
గలియన్ మానెదు వెట్టులుండురని వక్కాణింపఁగా నేర్తుమే ౭౯

---

(*1911సం॥ జూలై, అభినవసరస్వతిలోని ఆచార్యశిష్యవ్యాసమునుండి.)

(సోదరకవులు.)

......నిర్దిష్టములగు వృత్తములు నూటికి 345 కి పైగా పల్లించిన పద్యములై యుండు నని రెండుమూడుసారులు వీరి యాశు కవితను వినియేమాత్రమైన ధారణగల్గు ప్రతిబాలునకును దోఁచక పోదు. దీనికి దాహరణముగ ''సరసిజ వైరివైరి నెకసక్కెములాడెడుమధ్యమంబుతో, సరసిజవైరివైరినగఁ జాలెడుమేలగు కప్పుకొప్పుతో, సరసిజవైరివైరులపసం దులఁ దూఁగు కుచద్వయంబుతో. సరసిజగంధివచ్చె నలుసన్నిధికిన్ మదనాశుగంబనన్'' అనుపద్యము మున్నగు కొన్ని పద్యములు పట్నములో నలచరిత్ర యాశుధారగఁ జెప్పినపుడు చదివితిమని మా గురువుగారికి వినిపించిరి. ఆ పైపద్యములనే గుంటూరిలో జరిగిన రెండవసభలో సావిత్ర్యుపాఖ్యానములో ''నలుసన్నిధికిన్'' అనుచోట ''నృపసన్నిధికిన్'' అని మార్చి చదివిరి. ఇటులనే ''నిష్కపటస్వభావమున'' ఇత్యాద్యనేకపద్యములు శ్రుతపూర్వములే వినవచ్చెను. ... ... ... ...

(1912 సం, ఆర్యమతబోధిని 8వ సం పుటమునుండి)

...... వీరు(కొప్పరపువారు) చేసికొనియున్న పద్యములు చదువుదురనుట సత్యమును గాదు. అసత్యమును గాదు. అదివఱకుఁ జేసికొనియున్న పద్దెములో కొంత సారము కలిగియుండును. అప్పటికప్పుడల్లినవి చాలవేలపముగా నుండును. వీరు చెప్పినపద్యములె మరల మరల చదువుచుందురను వాదుక పూర్ణముగా సత్యము కాదు. ఒక్కసారియే విన్నవారి కీవిశేషము తెలియదు గాని రెండుమూడు సభలకుఁ బోయివిన్నవారికి సందియము తీరిపోవును. గంజాము వారి యింటను, గళాశాలలోను జదివిన పద్యములు కొన్ని పోతావ్రగ్గడ వారియింటను వచ్చినవి....

క॥ నిన్నటిసభలో నేదో చె, ప్పె న్నారాయణ! యదియుఁ గవిత్వమె యకటా!
నిన్నే మనందుఁ గనుమీఁ, ద న్నెటి మెచ్చంగ రాదె తత్తఱమేలా. ౫౬

చ॥ పురపురఁ బంపినందులకు బుద్ధిసి జెప్పెద రింకఁ జూడు వా
ర్వరపర చెప్పుపద్ధతిని బాడఁ గలాఁడవె నీవు, లేనిచో
గరువమె కానియాశుకవి గాఁ డలవెంకన యంద్రు నూచనా
స్ఫురణము కొప్పరంపుఁగవి పోవుచుఁ గన్పడఁ జేసెఁ జూచితే. ౫౭

చ॥ అనవుడు వెంకటేశుఁ డను "నంతకు వచ్చుట నిక్కమేని నేఁ
బనిగొనువాఁడ నప్పనికిఁ, బన్పిన నాశువె చెప్పలేనె! యం
దునకుఁ బ్రయత్నమేల! యిదె తుందుడుకుంగవితన్ వచింతుఁ గ
న్గొనుమని చెప్పఁగాఁ దొడఁగెఁ గొక్కిరి బిక్కిరిపద్యపుంజముల్. ౫౮

చ॥ తిరుపతి యిట్లు పల్కె నిది దెప్పరమే! తుదకెట్లు లబ్బె నీ
తురకలబాస యంచు నిను దూఱుదు రక్కట! పండితుల్, యశ
స్కరపుఁగవిత్వమున్ సలుపు* సత్కవి కియ్యది త్రోవ గాదు కా
దరయఁగ నాశు వియ్యది; రయంబునఁ బాడినయంత నాశువే. ౫౯

---

* (శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారి వ్యాసమునుండి)

......మఱియు నీయాశుకవిత్వమందుగంట కెన్నివందల పద్యములు కావలయుననియే కాని యిట్టి యిట్టిపద్యములుండవలయును, అన్వయము సరిగనుండవలయును, గణములు, యతులు, ప్రాసములు, ఛందము, చందము, వ్యాకరణము, శబ్దము, అర్థము సరిగ నుండ వలయు నని నియమము లేదు, ఉన్న దన్నను లాభము లేదు. ఆ పిచ్చిధోరణిలో నొక ప్రాసమునకు మఱియొక ప్రాసము నొక పద్యమునకు మఱియొక పద్యము మూఁడుచరణములు రెండుచరణములు, రెండున్నరచరణములు నొక్కచరణము గలపద్యములు పుట్టుచుండును. మఱియు ననేక మహాదోషములిందు నిండ యుండును. అట్టియాశుధారా కవిత్వము వినునప్పుడు మది కింపుసంపాదింపదు. ఓటితాటియాకు చేద వాయించుచున్నప్పు డెట్లుండునో యట్లు వెగటుగా నుండును. అనినిశ్చయముగాఁ జెప్పఁగలను. ఇది పద్య మెఱుఁగని పామరులకుఁ దక్కఁ దక్కిన వారికందఱకు నిట్లేయుండుననియుం జెప్పఁగలను. ఇట్టికవిత్వము చెప్పుటకుఁ బ్రయత్నించువారు గురులఘుజ్ఞానమించుకంత సంపాదించుకొని యిప్పుడిప్పుడే ప్రపంచమునఁ దలయెత్తుచున్న వారనినిశ్చయించుకొనునది. అట్టివారికి నహంకర్తృత్వాభిమానము హెచ్చు. వీరే క్రాగుచున్న పాలు. ................ (ఆంధ్రభారతి)

చ॥ నిజమగు నాశుధారయన! నెన్నెనె తెత్తెతె పెప్పె పేలు లే
కజతరుణీ కృపన్ గలము నాఁగక చెప్పటో గుప్పటో యగున్

(23వ జూలై 1912 సం॥ సువర్ణలేఖలోని, టంగుటూరి శ్రీరాములు. ప్లీడర్, బి, యే, కార్లిలియన్ ఎడిటరుగారి వ్యాసమునుండి.

## సుకవులా--శుకములా.

......కవిత్వమన నేమో కవులనగా నేమో చక్కఁగ తెలిసియుండవలసిన సదభిప్రాయులగు కొందఱు విద్యాధికులుగూడ ఇద్దరు కవిమాత్రులను లేకయేవో పద్దములల్లగనేర్చినవారిని దైవసములుగ పూజించుచున్నారు. వారిని కొప్పరపు కవులని పిలచెదరు. మరికొందరు సరస్వతీ అవతారము లనియు కవిచక్రవర్తులనియును భావించుచున్నారు. అక్కఁడక్కఁడ వారికి (Medals) స్వర్ణపతకములు నగలుబహుమానములు, కవిసింహులు· కవిచంద్రులు, కవిభాస్కరులు, మొదలగు బిరుదనామములు నెన్నియో యొసంగబడుచున్నవి· నవయౌవనులును విద్యాధికులునగు శ్రీపిఠాపురము రాజుగారుగూడ వీరిచిత్తజల్లుమాటల కవనమున మోసపోయి ఈరెండవరకముపద్యనిర్మాతలకు గా రూ 1116 లు పాడుచేసిరి, ఏది మంచికవిత్వమో, ఏదికాదో యనుసంశయము నింతమంది విద్యాధికులు సైత మెరుగకుండుట మిక్కిలి వింతగ నున్నది. వింత వింతధ్వనులు గల మాటల కవిత్వమునకు పశువులును, బాలురును, ఆటవికులును, సంతసింపదగినది. విద్యాధికుల న్నసట్టికవిత్వముగాక కొంతసత్కవనమును కోరదగినది. అవాచకములనోను వాచకములనోఛందోబద్ధముగ వ్రాయుటగాని నుడువుటగాని కవిత్వముకాజాలదు....ఆంధ్రకవిత్వము యొక్కయు ఆంధ్రవాఙ్మయము యొక్కయు నభివృద్ధినికోరుపట్ల ప్రజ్ఞారహితమును అనర్థదాయకమునగు కవనమనబడుచున్న కొప్పరపు సోదరుల యాశువును నిరసించుటకుబదులు ఎందరో అనాలోచనముగ వారికి ప్రోత్సాహము గలిగించుచున్నారు. ఆంధ్రకవిత్వమును ఆంధ్రవాఙ్మయమును నభివృద్ధినొనరించు మార్గమిదియేనా? ఆంధ్రవాఙ్మయమున స్వతంత్రగ్రంథరచనకు ప్రోత్సాహముకలిగించు మార్గమిదియేనా! సుకవనమందు సదనురాగము గలవారందరు ఇట్టికవనమనెడి యాశువును నిరసించుట విధాయకమగునా కాదా? పిఠాపురము రాజుగారివంటి ధీయుతులుగూడ ఈరీతిగల కవిత్వమునకుగూడ 1116లు ఎందుకు పాడుచేయవలెను.... ... ... ...

---

(1912 సం॥ 19 జూన్, దేశమాత నుండి,)

.. ...అయితే నేను వారివీరి మాటలను విని వ్రాయువాడనో కానో నన్నెరి

గజిబిజి వడ్లుబియ్యమును గాఁబచరించుట నిన్నుబోఁటియా
రజపుఁగవుల్ గొనందగదు రంకుగతిన్ బరుగెత్తు *టాశువే. ౬౦

గిన వారందరు ఎరుగుదురు, నాతో ఎదురుగా వాదించిన వారినందరను కొప్పరపువారికవిత్వము నిజమైన కవిత్వము కాదని ఒప్పించియున్నాను. మీపత్రికలో వీరి కవిత్వమును గురించి నాకు తీరుబడిగా ఉన్నప్పుడు ముందుముందు విశదముగా తేటతెల్లముగా వ్రాయు నుద్దేశముతో నేఁటిమీగత సంచికలో ప్రచురించిన చిన్న ఉత్తరమును నేను వ్రాసియున్నాను చర్చలకు వాదములకు కొన్నికొన్ని నీతి పద్ధతులున్నవి. ఆపద్ధతులకులోబడి చర్చించువారితో చర్చించుటకు నేనుసిద్ధముగా నున్నాను. వారుపొగడినారు వీరు పొగడినారు కాబట్టి మీరుపొగడవలెనంటె నేను ఒప్పుకొనువాడనుకాను. కవనమనగా ఏమిటో కవులనగా ఎవరో కొప్పరపువారి కవనము ఎట్టికవనమో ఈఅంశములు నిష్పక్షముగా చర్చించి నన్ను ఒప్పించినయెడల నేను వారికవనమును పొగడుటకు సిద్ధముగానున్నాను, చర్చించవలసిన అంశములను గంగలోకలిపి పచ్చిబూతులపంచాగములువిప్పి దెబ్బలాడదలచుకొన్న గొప్ప గొప్ప పండితులతో సమానముగా దెబ్బలాడ శక్తిలేనివాడను కనుక, వారితో నేను చర్చించ తలచుకోలేదు. తిరుపతివెంకటేశ్వరకవులని పిలువబడు వారికిన్ని కొప్పరపుకవులని పిలువబడువీరికిన్ని గుంటూరులో జరిగిన కొట్లాటవంటి కొట్లాటకు నేను శక్తిగలవాడనుగాను. 18-6-12 టంగుటూరి శ్రీరాములు.

* (అభినవసరస్వతి, ఆచార్యశిష్యవ్యాసమునుండి.)

......కావున సరస విద్వత్కవివరేణ్యుల కవిచ్ఛిన్నమును నిర్దుష్టమును దాత్కాలికమును నగు పద్యభాగయే యాశుధారగాని పలుతెఱంగులఁ బాదనియమము లేని తోడుపదముకొనదాఁక పెట్టుకొని గంటకిన్నియన్ని యనులెక్కతో నవసరము లేదని నాయభిప్రాయము.

(సువర్ణలేఖలోనిటంగుటూరి శ్రీరాములుగారి వ్యాసమునుండి.)

......స్వతంత్రములును మానవమనోభావములను వెదచల్లు నట్టివియును నిర్దుష్టములునున్నూ నూతనములును, జీవయుతములును ఉత్సాహకరములును నగుపద్యములను 10 వ్రాసిన రెండవరకముపద్యములు రెండువేలైన నా10కి సరిగాజాలునాని అది యిటుండనిండు. చిలుకపలుకులు పలుకువారిని మహాకవులని మిన్నుముట్టకొనియాడువారు కవిత్వమును గూర్చియును కవులనుగూర్చియును తమకుగల యల్పపరిచయమును లోకమునకు వెల్లడిచేసుకొనువారగుచున్నారు.

(శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులువారి వ్యాసమునుండి.)

...ఆశువునందభ్యాసము చేసినవారు తమకవిత్వము (గంటకిన్నివందలనులెక్క-

తే॥ గీ॥*ఆశుకవిత యనఁగ నదివేఱు శ్రీశిష్టు, కృష్ణమూర్తి జగతి కెఱుఁగఁ జేసె
నంచునిందు మట్టి యసమానవిద్వాంసుఁ, డేడ! యిట్టికుకవు లేడ! యనుడు.

ఉ॥ ఆకవితావిశేష మది యక్కఱ లే దిట. వేగ మొక్కఱే
చేకొనిపోవ నీజనులచిత్తము మెచ్చెడి, సిగ్గు వీడి నే
నాకవితన్ రచించి దురహంకృతి మాపెద, నింక నెందు నా
పై కతఁ డేగుదేఁ డని ప్రపంచక మీవు నెఱింగినట్టిదే. ఉ.౨

క॥ శ్రీవీరిరువురు నీరసగతి, గా రచియింపంగలారు కవనము, రఘువం

---

గలది) వాగ్రూపముగాఁ గాక లిఖితరూపముగాఁ జేసినప్పుడుగదా మెప్పునకుఁ బాత్రమగును. వాగ్రూప పద్యసంఖ్యలో నిపుడు కొన్ని రెట్లు తగ్గినను దృగ్గోచరమైవిమర్శపాత్రమై యిదమిత్థమనుటకుం దగియుండును. ఇట్టి లిఖితరూపమగు నాశుకవిత్వము నవసరము పడెనేని యెరులకుం దీసిపోకుండ నే నిప్పటికిని జెప్పుటకు సిద్ధముగా నున్నాఁడను. ... ... ... (ఆంధ్రభారతి)

---

(*1912 సం॥ ఆర్యమతబోధిని 8వ సంపుటమునుండి)

......ఇటీవల శిష్టు కృష్ణమూర్తికవి, మాడభూషి వేంకటాచార్యకవి లోనగు ప్రబంధకర్తలును నాశువునందుఁ బనిచేసిరి. ఇప్పుడు పనిచేయుచున్నవారును బల్వురు కలరు. సర్వవిధములఁ బ్రౌఢులు రసవత్ప్రబంధకర్తలు నగు మహాకవులు కొందఱు వినోదముకొరకై యాశుకవిత్వమును గూడఁ జెప్పుచురాఁగా రసవంతమగు ప్రౌఢకవిత్వము చెప్పఁజాలనివా రాశుకవిత్వము చెప్పుటకై బయలువెడలి గనహీనమైనను వృత్తనియమాపాయము కలిగినను భావశూన్యమైనను నెట్లో పద్యములల్లుటయే ప్రధానము చేసికొని నీరసపద్యముల వ్రాయుటకుఁ బ్రారంభించిరి కవిత్వమునకు రసభావాదులు ప్రధానములను దలంపుపోయి త్వరగాఁ బద్యముల ల్లుటయే 'యుత్తమగుణముగా నెంచుకొనువారును గంటకు నూఱులకొలఁది పద్యములల్లువారును బల్వురు బయలువెడలిరి నిక్కమగు కవిత్వముయొక్క విలువ రసజ్ఞులగువారికిఁ దెలియును గాని జనసామాన్యమునకుఁ దెలియదు. లోకములో రసజ్ఞులు తక్కువగను దక్కినవారు హెచ్చుగను నుందురు.... ...

(కార్చెర్ల శ్రీనివాసరావుగారి పొత్తమునుండి.)

......వైదికులు సత్యమునుమీఱి నిందించుచున్నది లేదుగాని కొప్పరకవులు నియోగులనుశాఖాభిమానము నొక్కదానిని బెట్టుకొని కొందఱునియోగిపుంగవులతిమా

శారంభతంద్రు లవథా, * నారామోదారజాతకాష్టమచంద్రిల్॥ ౭౩

ఉ॥ ఆశువు చెప్పువారలకు నందఱకున్ సులభంబ నిక్క మ
త్యాశువు దానితాత వరమాశువు నైతము, నీద్వయంబు నే

---

త్రిముగా వారిని ముఖస్తుతిచేసి వారికొక విధమైన నష్టమును గలిగించుచున్నారు. వీరి సభలను నేనుజని చూచియున్నాను. వీరికిఁ బుట్టుకీటుతక్కువ, కవిత్వము పేలవముగా నుండును. సహజమైన కవితాధారకలదు. వీరు కొంతకాలమింకను గురుకులవాసముచేసి బాగుగా గ్రంథపరిశోధనముచేసి యాపైఁ గవిత్వము చెప్పుటకు మొదలుపెట్టిన బాగుగానుండును. ... ...

---

(1912 సం॥ ఆర్యమతబోధిని 8వ సంపుటమునుండి.)

ఇఁకఁ గొప్పరకవుల యాశువుంగూర్చి ముచ్చటించుకొందము. వీరికి సహజముగాఁ గవితాధారకలదు. బాల్యమునుండియును వీరుపద్యముల నల్లుట కలవాటుపడియున్నారు. కాని సంస్కృతమురాదు తెలుగునందున నైనను మంచిపాండిత్యము సంపాదించుకొని యుండలేదు. గ్రంథపరిశోధన మంతగాలేదు పిండికొలఁదిరొట్టెయని కోవిదులకు వేఱుగఁజెప్పనక్కఱలేదుకదా- వీరు వడిగఁ గవిత్వము చెప్పుదురనుటకు సందియము లేదుగాని యది పేలవమై బహుదోషములు కలిగి మూఁడువంతు లర్థశూన్యముగా నుండును.... ... ... ...

---

(12-9-11 (Marutur) పురవాసుల యుత్తరమునుండి)

......కొప్పరపు వారు...తెలుగునందు బాల వ్యాకరణమైనను చదివినట్లు కనుపడదు.. నోటికి వచ్చినట్లు తప్పులొప్పులు తెలియక రసజ్ఞానమంతకు మున్నె తెలియక చెప్పువారి ఆశుకవిత్వముననే.;....

---

*(ఆర్యమతబోధిని. 8 సంపుటము. 3, 4, 5, 6 సంచికలనుండి)

కొప్పరక్షవుల యవధానము.

కొప్పరకవు లాశువుగాఁ బద్యములల్లుటమాటయటుండ వీరు సభ్యులు కోరినరీతిగాఁ బద్యములఁజెప్పుచు శతావధానాదులనరిగఁ జేయఁగలరాలేదా యను సంశయము లోకమునకుఁ గలదు. ఏమన వీరట్లు చేయఁజాలరని వాడుక పుట్టినతరువాత గుంటూరులో శతావధానము చెప్పఁబోయిరి గాని యది చెడినది కవిగారవధానమధ్యమునఁ దలనొప్పివచ్చి పడిపోవుటచేత నది యాగిపోయినది. చెన్నపురిలో శ్రీ రెంటాల వేంకటసుబ్బారావుగారొక కథనిచ్చియొకకొన్నినియమములు

కోశమునందు లజ్జయును గొంకును *వీడినయత్తరక్షణం
బే శరణాగతంబగు జయింత్రవి వీడినవారు లోకముల్. ౭౮

కోరి యట్లుచెప్పఁడనినప్పుడును వీరికిజబ్బు చేయుటచే నాఁటిసభయాగిపోయినదఁట. అది దైవవశము కావచ్చును. అయినను బలువురకు సందేహము మాత్రము బాధించుచున్నది. రవిపత్రికలో వ్రాయఁబడియున్నట్లుగా శతావధానులు, అష్టావధానులు పెక్కుండ్రు కలయీపురియందు వీరొక సభలోనైన శతావధానము చేసియుండిన బాగుగానుండును. అట్లు చేసియుండలేదు. "ఆంధ్రభాషావధూటికి నివాసమగు నీపురమున శతావధానులు, అష్టావధానులు, పెక్కుండ్రుకలరు. అట్టి పండితులందఱు కలసి యీసోదరుల కొకబిరుదము నిచట కూడ నిచ్చుట యుచితము" అని రవిలో వ్రాయఁబడియున్నది. సోదరకవులు కాకినాడపురమునఁగల శతావధానులును అష్టావధానులును మెచ్చుఁదగురీతిగా నవధానములఁ గావింతురేని వారు బిరుదుల నిచ్చుటకును సందియములేదు పురజనులు కోరలేదుగనుక చేయలేదనుటను వలనుపడదు. శ్రీపల్లూరిరాణిగారు తామొక సభచేయింపఁదలంచి యున్నామనియు నిదివఱకు నాశువుగా నానాశపురాణములు రెండుమూడు చెప్పియున్నారు గాన మేము శతావధానము చేయింతుము మీకిష్టమేని తెలుపుఁడు అని కొప్పరకవులకు వ్రాయించియుండఁగా మేము వెళ్లిపోవుచున్నాము గాన నిప్పుడు చేయలేమని సమాధానమిచ్చిరి. అట్లు సమాధానమిచ్చిన తరువాత నాల్గు దినముల వఱకును నిచ్చటనే యుండిరి! ఒక సంపన్నులు సభ చేయింతుమనియుఁ దగురీతి నినన్నానింతు మనియు వ్రాసినను కూడ శతావధాన మొనరింపకయే యీపురమునుండి వెడలిపోయిరి. అట్లు చేయక శతావధానము చేసి పిమ్మటఁ జనిన బాగుగానుండును

*(శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారి వ్యాసమునుండి.)

... ... ... ... నాకుఁ దొంటి నుండియు నాశుకవిత్వమం దభ్యాసము కలదు. ఆయభ్యాసమును గ్రమక్రమముగాఁ దగ్గించుటకుఁ జాలప్రయత్నము చేసి శ్రమపడి కొంతవఱకుఁ గృతకృత్యుఁడనైతినని విన్నవించుచున్నాఁడను. ఈవదకుఁబోతుఁగవిత్వ మభ్యాసము చేయవలయునని ప్రయత్నించువారు కనుపడిన దాని నెల్ల (పుల్లియాకు)— "గీ॥ పుల్లియాకుఁబాడఁ బిల్లలు గనివేయ। రోడ్లయందుఁదిరుగ నడ్లుపడుచు। బాటసారి గమికిఁ బాటుగూర్చెఁడుగాన। జక్కఁబెట్టవలెయు జనవరేణ్య॥" వెంగ్రుక:— క॥ వెండ్రుకఁ, బీకిన మేనికి। వేండ్రమ్మును గలుగఁజేసి వెనవెత్తురులు। గుండ్రముగఁ బుట్టఁజేయుచు। నాండ్రకు మగలకును సుఖము నతుకు నరేంద్రా॥ ఇత్యాదులు సత్వరా చెప్పుచు నభ్యాసము చేయవలయును. ఇట్లు చేసినచో గంటకు 4, 5, 6 నూఱులవఱకుం బద్యములు చెప్పు మహాశక్తి 2-3 నెలలలోఁ బరిపూర్ణము గాఁ గుదురునని దృఢముగాఁ జెప్పఁగలను. (ఆంధ్రభారతి)

చ॥ పలికెడివేళ మధ్య భగవంతుని నామము సారెకున్ యతి
స్థలమునఁ దూర్చి కొందఱు ప్రసంగ మొనర్తు రెఱుంగుదే! యతే
యలవడి రీకవుల్, సులభమాగతి నందఱు నేర్వవచ్చు, నా
పలుకులు నీకవిత్వము, నపత్రప రెంటికిఁ గూడఁ ద్యాజ్యమా, ౬౫

చ॥ అతితరమైన యాశువు మహాకవి చెప్పును గాక, కాకవి
ప్రతతి వచించుఁ గాక యొకపద్ధతివే దొసఁగుల్ పొసంగు, నా
చ్యుతి మతికెక్కదే సూరులకు, శుంఠకు "సర్వము తోఁటకూరసం
గతిఁ గనుపట్టు" భేదమిది, గాక సమస్తము తుల్యమే యిఁకన్ ౬౬

చ॥ నిలిచిన యప్డు నాదము జనింపని జీవము లుండుఁ గొన్ని, య
ట్టులె యొక కొంతమందికిఁ గడుంగడుఁ బర్విడు చోటఁ దప్పఁ దా
నలవడదంట! కైత, అది యట్టిదయే యగునేని దానికిం
గలుగు రసంబె దీనికిని గల్గు నటంచు వచించు టొప్పదే॥ ౬౭

క॥ ప్రతికెడి నాడియు వాచియు, ప్రతికెడి కవితయును దగిన పడిగల్గి యథో
చితగతి నడుచుట యుక్త "మ్మతి సర్వత్ర" యని పెద్ద లాడుట వినమే"

శా॥ ఆలోచించి రచించువారలకు లేవా! దోసముల్, మాకు నే
లా లేకుండెడి! నంద్రు గొంద, అది వీలా! యట్టులేనిన్ ధరా
పాలుండున్ మన మొకట యన్నమె కదా! భక్షింతు మప్పట్టునన్
వాలాయంబుగ భేద మే మనిన, నెవ్వారేని నైరింతురే॥ ౬౯

ఉ॥ పద్దెములల్లు మందనెదొ! పంబలపాటలు పాడుమందువో!
సుద్దులు చెప్పమంచ నెదొ! చూతువుగాని మదీయ ధార, యే
హద్దును బద్దు లేనియెడ నాశువు చెప్పు టదేమిలెక్క! యీ
విద్దెయు విద్దెయే! యిది కవిత్వమె! దీనికి నింతయేటికిన్. ౭౦

మ॥ మునుశ్రీనాథుఁడు గొల్లసుద్దు లొకటన్ మూర్ఖావనీశుల్ తనున్
ఘనవిద్వత్కవి మెచ్చ లేనితఱినే కట్టెన్ గదా! యంతక
న్నను నుత్కృష్టకవుల్ గలారె! మన మున్ నైకొందమా పూర్ణ; మీ
ఘనులన్ మెచ్చఁగఁ జేయ వచ్చి యిఁకఁ గొంకన్ లాభ మేముండెడిన్. ౭౧

క॥ పద్దెములకన్న నాశువు, సుద్దులలో నెక్కువేసుఁ జూపించెద నా
సుద్దియుఁ జూతువు నాకీ, విద్దెలలోఁగలదు సూ! ప్రవేశంబునఖా ౨౨

క॥ రయమే ముఖ్యమువీరికి, భయమేమి!యదే యిటన్ సభన్ జూపింతున్
నయవిదుఁడు కాళిదాసుఁ డ,నియె* గ్రామ్యసభన్ గుఱించి నీవదివినవే ౨౩

క॥ కల రెండకేని యిటుఁ బ్రా, జ్ఞులు వారికి వీరికవిత సుంతయుఁ బడదే
కలయు నెఱుంగని తలత్రి, ప్పలమారులె వీరి కిడిరి మును బిరుదు లిటన్ ౨౪

క॥ వారలె వీరిని మనమై, కారోహింపంగఁ జేయ నాలోచనమున్
వారక చేతురు తుదకున్, సారాసార ప్రసంగచర్చయు వచ్చున్. ౨౫

గీ॥ ఏమివచ్చినవచ్చుఁగాకెంతమనకుఁ, దోఁపఁగాఁజేయునాత్మనాత్రోవఁదక్క
నిచ్చకపుమార్గమునఁ బోవుటిది హుళిక్కి, ప్రాజ్ఞలోకంబు మెచ్చనిభక్తియేల.

క॥ అనివాదించిపిదపఁ గ్ర, స్నన భోజన మాచరించి నాఁటిసభకుఁ బో
యినపై జరిగినకథ చె, ప్ప నవసరం బంత లేదు పత్రికలుంటన్ ౨౬

ఉ॥ ఊరును పేరు మార్చికొని యూరక వ్రాసినపిచ్చివ్రాఁతలన్
గౌరవ మెవ్వఁడున్ ఘనుఁడు గైకొనఁ డెవ్వఁడో అట్టివాఁడె త
త్సార మెఱింగి యుండియును దానిన యూఁతగఁ జేసి యేవిసో
కాఱులు గిల్కుచుండు నవి ఖండిత మైనను వాఁడు కైకొనున్ ౨౭

ఆ॥వె॥ ముఖ్యమైనయంశములకుదాహరణంబు, తగినవానివ్రాఁతదక్కఁగొనము
చరితమాత్రఁ దెల్పుసంగతి కెవ్వరి, వేని గొందు మింత యెఱుఁగు మంబ ౨౮

శా॥ ఏకారామయగారు లోనయినవా రేకారణంబైన నే
మీ! కొ్రంపుఁగవిన్ సహాసనముపై నెక్కింప సంకించి; రే
సాకో సభ్యులు చూపి యాఁగి, రది చర్చన్ బెంచె, నామీఁద నే
యేకల్లోలములేని గద్దె నటుపై నేమందు మావ్రాఁతలన్ ౩౦

మ॥ సభలో విద్వదుదారసత్కవివరస్థానోన్నతిన్ బొందరా
మి భరంబున్ గని తత్క్షణంబ చని బల్మిన్ బందుగుల్ సూప బల్
రభసప్రక్రియఁ బంపెఁ బత్రమును ధీరమ్మన్యపున్ వ్రాఁతతో
సభయుండై యలకొప్పరంపుఁగవి మాకా నాఁటనే రాతిరిన్ ౩౧

---

* "బుధజనఇవ గ్రామ్యసదసి" (కాళిదాసు)

ఉ॥ ఇంచుకవిస్తరించి వచియించెద మానసచర్చలోని యా
మంచియుఁ జెడ్డయుఙ్ విబుధమండలియుఙ్ భవదంతరంగముఙ్
గాంచుచుఁగాక సూకలిడఁ గాఁదగువారిని మందలింపఁ గా
కంచితులైనవారలకు నబ్బఁగఁ జేసెడిఁగాక కీర్తులఙ్ ౮౨

చ॥ ఒగి సభకేగు ముందఱఁ జలోక్తికి వెంకటశాస్త్రి తిర్పతిఙ్
దగఁగని "నేఁడు నీశతవధానము కొవ్వపువార లాసుధా
రఁ గురియఁ జేసి మెచ్చెదరు రచ్చనుగూడ "నిదేటిధార" యం
చగడుగఁ బ్రొద్దుటింబలెనె యాడుదొ! యేమొ! యనంగ నాతఁడుఙ్ ౮

ఉ॥ హాయిగ నుండెనేని "వహవా! యని మెచ్చి బహూకరింతు, లే
దా! యది నిన్నుఁ బోలె విని యాదరము న్నటియింప నేర, నా
రాయణ! ఓమ్, హరో మనుచు నాడుట నిక్రమము, యింకనైన వా
రీయలవాటు మానికొని యిం పగుభక్రికి వత్తు రొప్పగఙ్ ౮౪

క॥ *హరిదేవర సుబ్రాయని, తెఱఁగునఁ జనువారి మెచ్చితివి వారలు నీ
మరియాద కలరి దానికె, గరువముగొని బాగుపడెడిగతిగనరకటా ౮౫

శా॥ సంగీతం బన రాగపల్లవులు నిచ్చల్ సత్స్వరో ద్రేకపుఙ్
భంగుల్ గాని; యపస్వరావలయదాంపత్యంబులైనాగ నే
రంగో నించెడి గూనిరాగము లనన్ రా దట్టులే చిత్తము
ప్పొంగఙ్ జేయునదే కవిత్వ; మితరంబో! పో! కపిత్వంబె యా ౮౬

చ॥ డివిడివిడివ్విడివ్వి గరిడీలు రుచించునె యన్న, నిక్రమే
యవమతి నేని నట్లగుఁగదా! యపు డిట్లనుచో ననంగ, నే
నవమతినేయ నక్రముల యం దభిమానమె నాకుఁగూడ, నే
చవియునులేని పద్దెములు సైఁపవు నాచెవి కేమినేయుదుఙ్ ౮౭

(*1912 సం॥ 8వ సంపుటము, ఆర్యమతబోధినినుండి)

......ఈదినములలో నాశువునందే కాలము గడపినవారునుగలరు. కీర్తిశేషులైన హరిదేవర సుబ్బరాయ కవిగారిట్టివారే. ఈ సుబ్బరాయకవిగారు మనకొప్పరకవుల వలెనే పద్యములతోడనే వడిగాఁ బ్రసంగించెడివారు. తుదకాయన కవిత్వమంతయు గాలిపాలే యయినట్లున్నది.... ... ... ...

క॥ వారివె యన నేటికి ని, స్సారంబులు నీవియేని సైఁపవు, నీపై
గౌరవము లేదె నాకు న్వ, ఘారటనమ్మునకు నలరు తజ్ఞుఁడు కలఁడే ౮౮

ఉ॥ ఆడుదు నేను బిల్లదము లాడిన దాడకరయుండ నట్లు నీ
వాడఁ గలాఁడవే యనిన నార్యుఁడు దానికి సిద్ధమైనయ
ట్లీడివిడివ్విపాట కెటు లీవు గడంగెదు చెప్పుమయ్య! నీ
పోఁడిమి దానఁ జేసి చెడిపోదె! బుధుల్ హసియింపకుందురే. ౮౯

మ॥ మనకున్ సాధ్యము గాదఁ టాకవనసామర్థ్యంబు! క్రొవ్వంబు దా
ననియోన్ బొబ్డుట వింటివే! యది సితాంతాహంకృతింబట్టి వ
చ్చినవి, లెక్కట్లును దప్పువీదినము కుస్తీపట్లు, లీ విద్య శాం
తిని బోధించెద పూరకుండెదవె యేదీ! చూత మప్పట్టునన్. ౯౦

క॥ నాకెందు కూరకుండెద, నీకున్ నీవ మొక్కనేని నేఁ గాదుగదా,
లోకమ్ముల్లను నొకరై, తాఁకియు వారింపలేమి తథ్య మెఱుఁగుమున్. ౯౧

క॥ నాళ్ళుడు మన కెందుకు వా, రేవో పద్దెములు చెప్పిరేని వినుము లే
దా! వినక యూరకుండుము, నీవలెఁ బ్రతివాఁడు చెప్ప నేర్చునె కవితల్ ౯౨

క॥ పనిపడుచోఁ గయ్యంబది, చనుఁగాక వృథాగ నేల? సత్యమనుచుఁ బ
లికిననది సత్యమైయైనను, మనమున నవ్వారికొదవు మాత్సర్యంబుల్ ౯౩

క॥ అనుచు భవిష్యత్సూచన, కనుగుణముగ నాడికొంచు నరిగిరి సభకే
మనవచ్చు దైవఘటనం, బును సభలో బీజమొకఁడు మున్నే మొలిచెన్ ౯౪

(ఆనన చర్చ.)

* తే॥ ఆసన మొందు వేసి, రదియక్కఱ లేదనికొంద, ఱున్న చో
దోసమె! యంచుఁ గొందఱును దోఁచినయట్లు వివాద మెంతయున్

---

(*1911 సం॥ 7వ సంపుటము, ఆర్యమతబోధినినుండి)

—రెండవదినపు చర్య—

........మొదటిదినము మిక్కిలి వర్ణనీయముగా నడుచుటచే నా కీర్తి పురమునం దంతటను వ్యాపించి రెండవనాడు పురజనులు చాల హెచ్చుగా సభకు విచ్చేసిరి. సభాభవనము చాలినది కాదు. రంగస్థలమున మొదటిదినమున నిద్దరుకవులకును సభాధ్యక్షునకును వేసిన మూఁడుకుర్చీలును గాక నేఁడెవరిచేతనో నాలవకుర్చీ

జేసిరి కొంత సేపు, వయిఁ జెప్పిరి కొప్పరపువారికోసమై
వేసితిమంచు వేసిన వివేకులు గుట్టది బైటికెక్కఁగన్॥ ౯౫

ఉ॥ కొప్పరపువారి కాసనము గూడదు నేఁడని కొంద, ఱౌర! యే
మప్రధితాత్ములే! యటుల నాడుట కంచు కొంద, ఱంతయున్
సుప్రథితుల్, తథాపి యది చొప్పడదంచును గొంద, ఱీగతిన్
బ్రప్రథమంబు వాదమును బాదుకొనన్ బొనరించి రెచ్చుగన్. ౯౬

మ॥ ఘనులౌ సత్కవులున్ బుధుల్ శతమితుల్ గన్పట్టుచున్నారు వా
రిని గాదంచును గొప్పరంపుఁగవిగారిన్ దెచ్చి యర్చించుటా

---

కూడ రంగస్థలమున నుంచఁబడినది అప్పుడు సభలో నీక్రిందిప్రశ్నోత్తరములు జరిగినవి. (ప్రశ్న) పైఁగానీ కుర్చీయెందుకు? ఎవరు వేసిరి? (ఉత్తరువు) ప్రభూజనముండియే వేసిరి. (ప్ర॥) అదియేమి? (ఉ॥) కొప్పరపు కవులు కూర్చుండుటకు. (ప్ర॥) నేఁడు వారు అవధానము చేయుటలేదు. వారి పని నేడులేదు. వారును నిన్నటివలెనే మనలోఁ గూర్చుండవలెనుగాని నేఁడవధానము చేయువారితోఁ గలసి కూర్చుండుట యెందుకు? (ఉ॥) వారును శతావధానులే కావున. (ప్ర॥) శతావధానులనుకొందఱికిని కుర్చీ పెట్టవలయునా? (ఉ॥) పెట్టవలెను మనము "Sata vadhanies welcome" అని వ్రాసినాముగాన నీశతావధానిగారికని కుర్చీ యీయవలెను. (ప్ర॥) మనము "The Satavadhanies welcome" (ఈ శతావధానులకు స్వాగతము) అని వ్రాసినాము కావున మనము నిర్దేశించినవారు నేఁడు శతావధానమొనరించుచున్న తిరుపతి వేంకటేశ్వరకవులె యగుచున్నారు. వారికి స్వాగతమనినాము. వారికి స్వాగతమిచ్చువారము మనమందఱమున్నానై యున్నాము మనలోనివారే కొప్పరపు వారును నగుదురు. కావున మనమందఱమును నెచ్చట కూర్చుంటిమో యచ్చటనే వారును గూర్చుండవలెను.... ... ...

(1911 సం॥, సెప్టెంబరు, 8 వ తేదీ దేశాభిమానినుండి.)

......తిరుపతి, వేంకటేశ్వరుల శతావధానము హిందూనాటకశాలలో ముంగుగ జరుగుట వటస్థించినపుడు ప్రథమదినమున కొప్పరపుసోదరులలో నొకఁడగు కొప్పరపు వెంకటసుబ్బరాయ శర్మయనువారు మొదటితరగతి చూపరులు గూర్చుండు గోతిలో వేయబడిన కుర్చీపై గూర్చుండిరి. మరుదినమున గూడ నట్లె జరిగియున్నచో బాగుగానుండియుండెడిది పైసూచించిన ప్రకారము అలజడులు చెలరేగునాలగుటచే సనాలోచనపరులగు నెవరోకొందరు మరుదినమున సిగ్గును గోల్పోయి విషయమును బూర్తిపరము బాధ్యతగల తిరుపతి వెంకటేశ్వరులతోపాటు కొప్పరపు సోదరునికి గూడ రంగస్థలమున కుర్చీ యిడవలయునని మూడవ కుర్చీనుంచ దానిని వేసి యుంచిరి. దానినెవరు వేసిరో యింతవరకు తెలలేదు.........

లంతియ" యంచు వారడుగ, నాయన "కొప్పరపు వారి కివ్వఁడీ
చెంతను నాసనం బడుగఁ జెల్ల" దటం చనియెన్ ద్రిశుద్ధిగన్॥ ౧౦౦

ఉ॥ తార్కికుఁ డమ్మహాకవి యతండుఁడు హేతువు లెన్నొ చూపి తీ
వ్రార్కునిచందమైన నిఁక నాయనకుం బ్రతి చెప్పలేక దు
స్తర్కపుఁదోవఁబట్టి "మొటు తప్పద యాసన"మంచు గోల యా
కర్కశు లాచరించి రధికారితిరస్కరణంబు చూపుచున్॥ ౧౦౧

---

మీద కూరుచుండలేదా, వారు సభ చేయుచుండగా నేను వారిప్రక్కను కూరుచుండుట మాత్రము గౌరవమా,.........నాకెప్పటి చోటవే కుర్చీ వేయించిన యెడల కూరుచుండెదను, సభజూచుటకువచ్చి యేమేమో అభిప్రాయ పొందుల"కని నేనువారలతో జెప్పినను "మొదటవేయుట యెందులకు! తరువాతతీయుట యెందుల"కని నడుమగలవారు వాగ్వాదము జరుపుకొనుచుండిరి, అప్పుడు నేనేవెళ్లి క్రిందవేయబడిన కుర్చీమీద కూరుచుండ దలంచుచుంటిని, యీవాగ్వాదము అవధానము జరిగించు సభాప్రదేశమున గాక ఆ ప్రదేశమునకు వేరుగా నుండు మరియొక చోట జరిగినది... ... ... ... ఇంతటిలోన గ్రామనాధిపతిగారు ... ... ...యీ సంగతిని విచారించి కొంత ప్రసంగము జరిపిరి, ఆ ప్రసంగము ...... యుక్తియుక్తముగా నుండినది, ...2000మంది మహాజనములు కూడిన ఆ సభలో వెంకటశాస్త్రిగారు లేచి ఆ ఆశుకవిత్వము మాకవిత్వము వంటిది కాదు. ఆశతావధానము మాఅవధానమువంటిది కాదు, కావున ఆశతావధాని మాప్రక్కను కూరుచుండుటకు యీసరసనునిల్చి యుండుటకుదగడని...అందుచే వారికిని మాకును ఆశుకవిత్వావధానముల విషయమయి కొంచము కలహము ప్రాప్తమయినది ఇందు కొంతభాగము నడుమనున్నవారి మాహాత్మ్యము ... ... ...ధర్మపథవర్తులును మిత్రవరేణ్యులును న్యాయప్రియులునగు తమకు యథార్థమును విన్నపించుకొనినాము,

ఉ॥ వారిని మేము మమ్మురివారును జూడక యుండినప్పుడి, స్తారము గాక స్నేహము నెసంగగ జేసిన బుద్ధిశాలివో, ధీరవరేణ్య నీనయవిధిన్ గణుతింపగ! మాకు శక్యమే, కూరిమి కాపి యీ నడుమ గొందరు జేరి మనోవికారముల్, కూరిచి యెల్లరిన్ జరవ ఘోరముగా దలపెట్టి యుండిరీ, వైరమసాధ్యమైప్రబలవచ్చునటంచును దోచుచుండె లో, నీరసమింత లేకమది నెంతయు న్యాయ్యమెగోరుచున్నవి, ద్వారని కుండవంచును హితాగ్రణివంచును విన్నగించి నా, మీరన మెట్లుమారునె గ్రహింపుమి కీర్తికరా! ప్రభాకరా!

గుంటూరు, ఏకా రామయ్య గారియింటిలో } ఇట్లు విధేయులు, కొప్పరపు వెంకటసుబ్బారాయ, వెంకటరమణులు. 4-9-11

క॥ తిరుపతివెంకటకవులకు, *సరి కొప్పరపువారు, వారిసరసను మఱివి
ష్టరముండి తీరవలెన, క్కఱలే దన్యులకు వారు గారు సమానుల్. ౧౦౨

మ॥ అనిబింబప్రతిబింబభావ మిడి యధ్యక్షుల్ రవంతేనిఁ గై
కొనకే పట్టినపట్టు నెగ్గుటకునై కోలాహలమ్ముల్ దమం

(*1911 సం॥ ఆర్యమతబోధిని 7 వ సంపుటమునుండి.)

ప్రశ్న... అట్టి సమయములో నేమపనిలేని కొప్పరపు కవిగారికిఁగూడ నిందుఁ గుర్చీ వేల పెట్టవలెను? ఉ॥ శతావధానులు కనుక, ప్ర॥ అట్లయిన నిచ్చటనున్న శతావధానుల కందఱికిని గుర్చీలు వేయక యొక్క కొప్పరపు కవిగారికిమాత్రమే కుర్చీ వేయుటకుఁ గారణమేమి? ఇటనింకను బ్రహ్మశ్రీ జానపాటిపట్టాభిరామశాస్త్రులవారు కలరు. బ్రహ్మశ్రీ ములుకుట్ల వేంకటకృష్ణశాస్త్రులవారు గలరు. ఇంకను బల్వురుగలరు. వీరెల్లరు శతావధానులేకదా? వీరికందరికిని గుర్చీలు వెట్టవలయునుగదా? ఉ॥ తిరుపతివేంకటేశ్వరకవులతో సమానముగాఁగవిత్వము చెప్పగలమని వచ్చువారందరికని గుర్చీలు వేయవలసినదే. ప్ర॥ ఇతరశతావధానులకుఁ గుర్చీలు వేయవలసివచ్చిన వారినిఁ బరీక్షించి మఱియీయవలెనా! కొప్పరపువారినిమాత్రము మనయిష్టప్రకారము కూర్చుండఁబెట్టవలయునా? ఉ॥ కొప్పరపుకవులు తిరుపతి వేంకటేశ్వరకవులతో సమానులుగానఁ గూర్చుండఁబెట్టవలెను. ప్ర॥ ఇతరులు కారా? ఉ॥ సమానులమని రమ్మనుఁడు. ప్ర॥ కొప్పరపువారలేల యీప్రశ్న లేకపోవలెను? ఉ॥ వారు సమానులు కనుక. ప్ర॥ మనమానిర్ధారణము చేయువారము. అయినను సభాధ్యక్షుల యుత్తరువును దీసికొందము. అని సభాధ్యక్షుల యుత్తరువును గోరిరి. వారిట్లు తీర్పును జేసిరి:—"నేడీకుర్చీలు ఇచ్చటనున్నవారి తారతమ్యము నెంచుటకై వేయఁబడవని కావు. అవధానము చేయువారు నిరాతంకముగా సభ్యులకు దృగ్గోచరులగుటకై వేయబడినవి. వీరికి ముందు మఱియొక శతావధానికిఁ గుర్చీ యిచ్చియుండిన మిగిలిన శతావధానులకందఱికిని గూడ నీయవలసియుండును. అట్లిచ్చిన మన యుద్దేశము చెడును. నేఁడవధానము చేయువారియందుఁ బ్రత్యేకముగా లక్ష్యముండుటవలనఁగదా మనము వీరుభయులకును గుర్చీలు పెట్టినాము, శతావధానులమని వచ్చువారికెల్ల గుర్చీలఁ బెట్టుదుమేని మనయూహకు భంగము రాదా? వారు వీరితో సమానులగుదురా! కారా! మనము నావము నెట్టుకొందుమేని అదిసంవత్సరమునకైనను దేలదు" ...... ఆసభాధ్యక్షులు చేసినయీతీర్పు న్యాయముగా నేయుండినను రోగపీడితులవలె సభ్యులు గొందఱు పక్షపాతపీడితులగు కొప్పరకవిపక్షము వారికిది నచ్చినదికాదు. అందుపై నావలకుఁ బోయి యేమేమోయాలోచించుకొని మరలవచ్చి కొప్పరపుకవికిఁ గుర్చీయీయక తప్పదనియు నాతఁడు తిరుపతి వేంకటేశ్వరులతో సమానుఁడనియు చెప్పిరి....

తనెటో నల్పెడి దంటలన్ గని నితాంతక్రోధ బాధాభరం
బునఁ జిత్తంబు వశంబు దప్పుటయు నాపొంగార్చి యల్లల్లనన్ ౧౦౩

చ॥ మనమున వెంకటేశ్వరుఁడు "మాటికి నక్రుటా! వీర లిట్టులే
గొనగొనలాడుచుండెదరు కోవిదమూర్ఖ మెఱుఁగ లేరు ధీ
ఖని యగు నీసభాధిపతిఁ గాదని గోల యొనర్తు రింక నే
వినిచి యథార్థమున్, సభను వీడఁ గడంగుట కొంత మేలగున్ ౧౦౪

క॥ తెగదీవాదము నేఁడు వ్యా, ఘగఁ బెట్టిరి బంద రేగఁ దగు శీఘ్రముగా
నగుబాటుసభకు వచ్చితి, మిగ బా! సూక్రాల్ విడిచి, నెలవు మేకొను టెట్లో

వ॥ అదియటులుండుఁగాక "సమ"లంచును గోత్రపువారి నూరకే
వదిఁబదిఁ జెప్పవీరియపవాదము లీసభ నైఁచుఁ గాక యీ
యవనునఁ గొప్పరంపుఁ గవి "యట్లనఁ గూడదు తి"ప్పటంచుఁ బా
నెద నకలం బెఱింగియు నిసీ! తెగవెల్వఁడఁ డెట్టి ప్రాజ్ఞుఁడో. ౧౦౫

చ॥ తనకును నన్నదాదులకుఁ దక్షతలోఁ గలవార మూర్ఖుఁ డో
జనుఁ డెఱుఁగండుగాక తన స్వాంత మెఱుంగదె, యెందు "కీనహా
సన"మని యాడరాదె! తెరచాటది వెల్వడినచ్చి, దానఁ ద
న్నును జగమెల్ల మెచ్చదె యనుంగులు మెచ్చిన నొప్పకుండినన్ ౧౦౬

గీ॥ ధారనొకక్రుటి మాత్రమే తనకుఁ గలదు, దాని కెన్ని యుండిన నేమిదఁ బ్రజ్ఞుఁ డొప్ప
తండులమ్ముల మాత్రమే యుండి యొకఁడు, ష్డ్రసోపేతముగ భుక్తి సలుప నేర్చు

క॥ అన్నమ్మిత్ర యవాగువు నే . మున్నది లవణంబు తనఁగ నో యీ! యన నా
వన్నంబు నక్రు నే నం, వన్నం దప్పట్ల సద్దపడ నావదేటీ ౧౦౭

గీ॥ ఇంత యెఱుఁగఁడె తానింక నెన్ని యెంచ్ను, పదుపునైఁదాల్పుఁడగు నేరి జడులు పెలుప్పఁ
డన్న యంత నయం దప్పి "యనుము మినుము" ననక చాలునఁ గూర్పుంగదె నక్క టకట

చ॥ సభయెటులున్ జెడెన్ దుడదు సాగమి నిక్రుణ ఇంప రాయప్పుం
శుభగుభ లేర్పడెన్ *పృథగఁ గోత్రపువారిని నీఁక నుల్ల్యలన్

---

*శ్లో॥ "హేమ్నః ఖేదోన తాపోన, చ్ఛేదేన కషణేన చ, ఫలదేవపరం ముఖం యదుం జానమతో లనం" (వంచిల రాజశతకము).

రభసము నెత్తిపైఁ బడియె రాఁదగు నెద్దియొ వచ్చుఁగాక యే
మిభయము! నిక్రమంబు బలికి మేలనిపించెదఁగాక ధీరులన్ ౧౧౧

క॥ తగుసమయంబిది యిప్పుడు, మొగమోడఁగరాద, యింత మొగ మోడినచో
నగుదురు పండితు లిపు డిది, వెగటయ్యెడు విదప సారవిత్సమ్మతమౌ ౧౧౨

గీ॥ ఇంటిపేరుమాత్ర మేకమైనంత నే,తగిన జ్ఞాతియగునె తనకు! దాన,
కెన్ని యెన్ని యట్టివేకమ్ము గావలెఁ, గవియటన్నమాత్రఁ గలదె ఫలము ౧౧౩

గీ॥ తన కాణాచినిదూరగుఁ, డని యెఱిఁగియు నెవఁడు జ్ఞాతి కర్పించెడిఁ బా
లును, గోత్రపుసోదరుఁడీ, ధనమునకుం దగఁడు మిగుల దవ్వగు కతనన్

సీ॥ చరికొండధర్మఁ డార్జన చేసె నపీర సాలె *దేవేంద్రుఁడై మున్ను నాళ్లొ,
అవలఁ బట్టాపల్లమై భట్టునకు వచ్చె నెల్లూరి రాఘవునికది చేరె,
మాడభూషికి నది తోడ వేదంబయ్యెఁ దిరుపతి వెంకటేశ్వరుల కబ్బె,
తగినవారికి నారు దత్తుసేయక యున్న నా శ్లేషంబుఁ బాత్రులగుటయు ధ్రువము॥
తే॥గీ॥ కొప్పరపువారలిద్దఱుఁగోరుచుండ, నిర్వహించుట యున్న యుభిర్వాధార
ణాబలము లేకయుంటేని నమవనట్టి, యనికిఁ బుట్టిన దీపినదనము ఘనము ౧౧౫

మ॥ వినమే భోజుని యంతవాఁడు ఘనుఁడౌ ర్వీశ్వరుండౌటు శ్రీవిక్రమా
ర్కనిపీఠమ్మునఁ గూరుచుండఁదలఁచి నైకోర్వుగ్రమ పిశాళి యాపఁగో
పునెడన్ బంగరుసాలభంజికలు హో! పో, యనఁ గూర్చుండెనా
ఘనయోగంబది నేఁడు లేదన దె! వక్రంబ్ బోఁడె యాధీరుఁడౌనన్. ౧౧౬

క॥ కాపువనున్న యథార్థం, బనిపత్రలమాట నొప్ప నటు పూర్వంపుం
గోవిదులసరణిగన్నడు, నేవెడఁగువాఁ పలుకుబాటు లెవ్వఁడుఁగనెంచున్ ౧౧౭

చ॥ అనికి త్రతనిశ్చయుండయు హృదంతిక యంగాన నిర్పాటి యగుఁట గా
వినయము తోడు గానిలిచి వెంకన కొంకక యంత లేక జం
కనునది యూరకౌను దన జన్మరాష్ట్రకే యున్నెక్క్రుందించి యుండినన్
ఘనతరమున్నవనం బెనఁగఁ గా నిటు వల్ల సదుక్తికమ్మగన్ ౧౧౮

---

*మ॥ శలలక్షివ్యవధాన పద్యరచనాసంఖ్యా సురత్రాణచి, హ్మాతినామా! వరికొండధర్మనుకవి! నివాగ్విశేషమ్ములౌ, శతకంబోజ్జ్వల జాటకోటరకుటీశేతాంగు రేఖా సుధా, స్వతగంగాకన కాబ్జనిర్ఝరరనావిఖ్యాతి యాధుర్యముల్॥ (చిత్రభారత౦.౧౪౭)

చ॥ గురుకులవాసముల్ సలిపి కూరిమి మాధుకరంబు వారముల్
జరుపుచు నమ్మగానినొక సాధ్విని "అమ్మ" యటంచు బాబటం
చొరులను గొల్చి నేర్చితిమి యొండొకశాస్త్రము, పండితుల్ నెబా
నుర! యనిమెచ్చఁ బద్దెములు శ్లోకములున్ రచియింతు మాశుగన్ ౧౧౯

ఉ॥ కొప్రపువారనుంగవులె, కొప్రపువారికి మాకు విద్దెలో
సుప్రథితంబువారి, యదిసూరు లెఱుంగుదు రల్లవారలే
ప్రప్రథమత్వ మందినను బాల్పడ దియ్యెడ నాసనంబు న్యా
య్యప్రతిభన్ జెలంగెడి మహాత్ము లెఱుంగరె ధర్మపద్ధతుల్ ౧౨౦

క॥ అలసుబ్రహ్మణ్యుఁడు తా, నెలమిన్ బాదునెడ నూరకేయుండును స
భ్యులలోన వైద్యనాథుఁడు, అలి నీతఁడు సాహుపట్టులను నతఁ డప్లే ౧౨౧

క॥ సములైనను లేకమహో, త్తములైనను నొకనిపెండ్లి తతీ నందలమం
దిముడఁ దలంపరు వేఱొక, రమలినహృదయులకు సర్వ మవగతమొకదా!

ఉ॥ వాదము కోసమొప్పదము వారలె హెచ్చని, యట్టులేని యె
ట్లేఁదగు మాకు నేర్పడిన యీసభ మానరిగౌరవంబు, మీ
రేదెసఁ జూడలేదె! పురమేగెడిచోఁ దమశిష్యపెండ్లిలోఁ,
బాదచరత్వ మూనుగురుపత్న్యల, నట్టులె యట్టితఱ్ఱులన్ ౧౨౩

తే॥గీ॥ అట్టిచో సామ్యమే లేని యప్పుడిట్టి, చర్చయేటికి "విద్యాసనము" లటంచు
నాసనము వేయుటది గూడవన్యథా నొ, నగిరేనాసనము మాకు సమ్మతంబె.

క॥ *తగదు తగదు తగదంచును, మొగమోటను దక్కియిట్లు ముమ్మాటికిఁ బ
ల్కఁగ నేమని చెప్పదుమా, గఁగ రా సభ్యజనులకలకలమువలన్ ౧౨౪

క॥ "హరిలేదచ్యుత లే,,దను, తెఱఁగునఁ దిరుపతియుఁ జెలిసితెలియని యటు లా
తిరుపతి భూధరశృంగము, స్మరణకుఁ దగిలించుచుండె సభ్యులకెల్లన్ ౧౨౫

---

* ... అప్పుడు బ్రహ్మశ్రీ వేంకటశాస్త్రిగారు లేచి "ఇదివఱకును మీలోమిరు చేసికొను సంభాషణములలో మిమ్ము మీరు గూర్చి గావ మేమూరకుంటిమి. ఇప్పుడు కొప్పరపుకవులు మాతో సమానులని పదేపదే తెల్పినవారిబంబులు చెప్పుచున్నారు గాన మేము మాటలాడవలసి వచ్చినది కొప్పరపుకవులు మాతో సమానులు కారు. కాన వారు మాతో సమానముగాఁ గూర్చుండుటకు మీరొప్పనను మేమొప్పము. అని చెప్పిరి.... ..(ఆర్యమతబోధిని 7 వ సంపుటము 1911 సం॥)

ఉ॥ ఎంతయొ మబ్బు వట్టి పని యెయ్యదియో *చెడు నంచు నెంచుచు
న్నంతఁ బటప్పటద్రవ మనంతముగా సుడిగాలి వచ్చి యే
చెంతకొ దుమ్ము ధూళిగ నశింపఁగ మబ్బును బాఱఁ ద్రొబ్బిన
ట్లింతట నాసభాస్థలమునందలివారికిఁ దోఁచెఁ బూర్తిగన్॥ ౧౩౯

---

యః ॥శ్లో, శాంత్యా దాంతిగుణేన కీర్తినిచయై ర్వ్యక్తాస్తపోవిద్యయా, శ్రీభిర్వాక్యప్రమాణనికరైర్నిర్భాస్వరాంసమ్మతాః, గద్వాలేఽపిపిఠాపురే చ నగరే చెన్నాపట్నాయేనత్కృతాః, పూజ్యం తేన్మ పురేపురే బహువిధంగుంటూరుపుర్యాంయథా॥ శ్లో॥ శ్రీగుంటూరుపురేవరే నివసతా శిష్టాన్వయాబ్ధీందునా, సీతారామసుధీవరేణ రచితా వాగ్గుమ్ఫపుష్పాంజలిః, శ్రీమచ్ఛేషగిరీంద్రవేంకటరమానాథోత్తమాంగేఽర్పితా, సంతుష్ట్యై దిశతాద్బహూన్ శశికలాశుభ్రాన్ గుణాన్ పేచిరం॥ శ్లో॥ విద్వద్భిః కవిభి స్సభాస్థితజనైః పూర్ణావధానైరహో, జిల్లాన్యాయసభాస్థపీఠరుచిరై స్సంపూర్ణసంపద్యుతైః, వీణావాదనతత్పరై స్సుబహుభి స్సాశాబ్దికై స్తార్కికై, శ్శ్రీగుంటూరుపురీ పరం విజయతే సర్వోత్తమా గాయకైః ॥౨॥

---

ఉ॥ చిన్నతనమ్మునందె గురుసింహులసేవ లొనర్చి సాహితీ గ్రన్నన సేకరించి ఫణిరాజముఖోదితశాస్త్రపాండితిన్, మిన్నఁ దనంబుగాంచి బుధమిత్రములై పొరతేని చెల్మిరి, ద్వన్నులైన పూర్వకవివర్యులలీల నిలింపభాషలో నెన్నియొ గ్రంథముల్ సలిపియిర్వురుముర్వగనాంధ్రభాషలోఁ, బున్నియ మెంతొ చేసికొని పుట్టిన సత్కవు లంచు నెన్ననౌ, నన్నయతిక్కనాది కవినాథులు పోయిన పోకలున్ రసా,భ్యున్నతి గల్గుకబ్బముల నూపినయన్నిటి ప్రాసియంతకున్ మున్నె శతావధానము లమోఘమనీష నశేషభూవరా, త్యున్నతసత్సభాస్థలుల నొప్పఁగఁజేసి ''స్వతః ప్రకాశు'' లన్, నన్నుతు లంది దుష్టకవిసామజసింహులు మున్నుగాఁగనె, న్నెన్నెయశః పతాకల నహీనబుధుల్ పరికించి యీయఁగాఁ, బెన్నిధులన్ బలెం గొనుచుఁ జెక్కుబహూకృతులంది వహ్వరే, వెన్నెలఁబోలుకీర్తిపృథివీస్థలి నాశశితారకంబుగా, వన్నెవహింప నెల్లెడల వాసిమనోజ్ఞముగాఁగ మేలుమేల్, చిన్నెలమన్ననఁగనిరి శ్రీపతివేంకటసత్కవీశ్వరుల్, కన్నులపండువై

---

*తిరుపతి వేంకటేశ్వరుల గుంటూరి శతావధానపు పీఠిక నుండి.

......మరల మఱునాఁడు సభ ౩ గంటలకు సమకూర్పఁబడెను. కాని కొన్ని యనివార్యములగు నంతరాయములచే సభ మానుకోవలసినంత దుర్యోగము జరిగినను, గుంటూరివాస్తవ్యుల సుకృతముచేతనో, సిద్ధసంకల్పులైన తిరుపతి వేంకటేశ్వరుల మహిమచేతనో సభ జయప్రదముగా జరిగెను......

జతిజేపల్లి లక్ష్మీకాంతకవి, ప్రొప్రైటరు, చంద్రికా ముద్రాక్షరశాల.

"ఎచట జూడ! యన్న నేమది వంగతోఁటకడ సాగ దటం చనుకొనువారు
లౌకికులయ్యు నేలా కోరి రీకోర్కె? యం చొకరొకరిఁ బ్రశ్నించువారు

---

టూర్చురి॥ చ॥ తిరుపతి వేంకటేశకవిధీవరులార! నిరంతరంబు నా, తిరుపతి వేంకటేశ్వరుఁడె దీర్ఘతరాయువొసంగి మీకు సుస్థిరవిజయంబొసంగుచు విశేషయశంబొడఁగూర్చుఁగావుతన్, మఱవకుఁడయ్య మమ్ము బుధమాన్యులు మీకిదె మా నమస్కృతుల్॥

ఇట్లు
బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, ప్రొప్రైటరు చంద్రికా ప్రెస్, గుంటూరు.

---

చ॥ వరసుమనోగణంబున కవారితమోదము సంఘటించు నీ, తిరుపతి వేంకటేశుల కుదీర్ణకళాఢ్యులకేను భక్తినం, భరితసువర్ణపద్యఫలవర్గము కానుక గాఁగ నిచ్చుచుం దురు నవ నూలుపోగు బరితోషము మీఱ నొసంగు క్రైవడిన్॥ కం॥ అవధానులకవధానులు, కవులకుఁ గవులైన యీజగద్విదితులనేఁ, దవిలి ప్రశంసించుట గన, రవిసద్మమునందుఁ జూపఁబడుఁ జూపుటగున్, మ॥ మును వాల్మీకి గ్రహించి రామకథనీభూలోకమున్ నిండఁజేసిన చాడ్పున్ మును పెవ్వరో యెఱుఁగ కాసింగొన్న యీ విద్యనీ, జనవర్యుల్ గ్రహియించి దేశములపైఁ జల్లన్ విజృంభించె నిం, పెనయన్ దీనికి మార్గదర్శకులు వీరే గాదె! చర్చింపఁగన్ చ॥ గురుతరబుద్ధిశాలులగు గుంటురివాసుల కెల్లవారికిన్, ధరణి సమస్తదేశపరితఃపరిసరచ్ఛశిరుగ్యశోలస, త్తిరుపతి వేంకటేశకృతదివ్యవచస్కశతావధానము, బ్బరముగఁ జూడఁగాఁ గలిగెఁ బుణ్యమిదింతని చెప్పశక్యమే॥ కం॥ ఆకృష్ణుండన దగు కా, శీకృష్ణాచార్యవిబుధశేఖరుఁడు సభం, బైకొను టియాధిపత్యము, సాత్త్వికటహేమమునకబ్బు పరిమళముగదా॥ మ॥ రసమూలోపము లేదు, సాహితియు శాస్త్రజ్ఞానమా పూర్ణము, ల్లసితోద్వాగ్ఝరి తేట, కల్పన మహాలాలిత్య మొప్పారు వె, కనమాధారణయా! శిలాక్షరము, నికన్ బౌరయీనీతితో, వసుధన్ సామ్యము నొందువారెవరు, హా హా! వీరికిన్ వీరెగా॥ మ॥ నిటలాక్షాంగతటోజ్జ్వలన్నిలయనిర్ణిద్రాతభద్రాయితో, త్కటభావన్యతనూవిశేష విలసద్గౌరీకృపాసారసం, ఘటితానూనశతావధానకరిబాప్రక్రాంతతాతుల్యలౌకిరిడిస్ బటుదీనాకాయుపు శేముషీబలము శ్రీసాంబేశ్వరుండిచ్చుతెన్॥ సీ॥ ఏవారి దివ్యశతావధాన జ్యోత్స్న విబుధచకోరతృప్తి ఘటించె, నే మహామహుల యహీనబుద్ధిబలంబు సకలజనాళి కాశ్చర్యమొసఁగె, నే గురుభక్తుల కిలనెల్ల సభలలో విజయసౌఖ్యంబులె విజయమబ్బె, నే గుణాఢ్యుల వక్త్రభాగంబు భారతీనాట్యస్థలంబై నసనగనొప్పె॥ తే॥ గీ॥ నట్టి పరిపూర్ణ దివ్యశతావధాను, లలరు తిరుపతి వేంకటేశులు పొసర్చి, నట్టి యీ యవధానంబు నభినుతింప, శక్యమెవ్వారి కగు మహాసభికులార॥

ఇట్లు ముబికుట్ల వెంకటకృష్ణశాస్త్రి, శతావధాని.

సీ॥ తానెందుకనవలెఁ దగుమనుష్యులు లేరె యంచు వెంకటకవి నెంచువారు
అభ్యర్థుమాటపై నాఁగిన వెంకటేశ్వరుఁ డిట్టు లనఁడంచుఁ బలుకువారు
అతఁ డూరకున్నచో నావాద మీసాజిక్కైనఁ జేల దటంచు ననెడువారు
"నీభనీ"వనిపల్క్రే వారో యవ్వారి నెఱుఁగుదే యని చెలఁగ బలుకువారు

---

కుఁ గొప్పవరపుకవులు ప్రయత్నించిరన నదియే మొదటివారి యాధిక్యతను వేనోళ్ళ జాటుచున్నది. రెండవవారికది హానియిదే. చాలదు. ఇంక నీప్రయత్నము పరిహాసపాత్రము కాదా? మొదటిదినమున వచ్చి సభ్యులందఱును గూర్చుండిన తావునఁ గూర్చుండిన కొప్పవరపుకవిగారు రెండవనాఁడు మఱిపెనుక ప్రయత్నపూల చేయవలసి వచ్చెనోకాని తాము శతావధానము చేయునప్పుడు తామున్న తాసనములఁ గూర్చుండియుండఁగా శ్రీకృష్ణమాచార్యులవారు మున్నగు శతావధానులు క్రిందఁ గూర్చుండిరిగాని తమతో సమానముగాఁ గూర్చుండఁ బ్రయత్నింపలేదు. కొప్పవరపుకవిగారెఱుంగరా? "అక్రమన్నమావన్న శాఖ్యదంశు పెక్కన సాటికి నరవ్వెల్ల పెలిపుగపైపెక్కు"నన్నట్లు తిరుపతి వేంకటేశ్వరకవులెంతయున్నతాసనమునఁ గూర్చుండిన మనము నంతయున్నతాసనము వేయించుకొనికూర్చుండిన మాత్రముననే మనము వారితో సమానులమగుదుమా? మనయందు నిక్రమగుప్రజ్ఞకలదేని అది యెచ్చటఁ గూర్చుండినను బ్రకాశించుచునే యుండును కదా:...అప్పలలో పంకమధ్యమునఁ బడియున్న పద్మమునకున్న ఖ్యాతి ఆకాశము నెఱయు బూరుగుకొనయందున్న పూవులకు వచ్చునా? కావునఁ గొప్పవరపుకవిగారును దత్పక్షపాతులును నాడు చేసిన పని పిచ్చిపని. కొప్పవరపుకవులు తిరుపతి వేంకటేశ్వరకవులతో సమానులనిపించుకొన నెంచుచో వారివలెఁ దాముం హృద్యానవద్య పద్యకావ్యముల విరచింపవలె. వారివలెఁ దామును సరసజనవేద్యంబులగు గద్యకావ్యంబుల నిర్మింపవలె. వారివలె దామును నేత్రశ్రోత్రశ్రవ్యంగా నాటకంబులగు పాటినాటకంబులఁ గల్పింపవలె. వారివలెఁ దామును సులక్షణలక్షితంబులగు లక్షణగ్రంథముల గూర్పవలె. వారివలె దామును నుభయభాషలందును రసపోషితంబగు కవిత్వము చెప్పవలె వారివలెఁ దామును శతుమధ్యమునైనను నిరాంతకముగా నవధాన మొనరింపవలె. వారిదేహము లేయున్నతస్థితియందున్నవో యాయున్నతస్థితియందే తమదేహములను బెట్టవఁ గార్యము లేదు. వారి జ్ఞానమెట్టియౌన్నత్యమునందియున్నదో అట్టియౌన్నత్యమును తమ జ్ఞానమును నందియుండునట్లు చేసికొనవలయును. అంతియే కాని తమవారిలో బలవంతులెవరో దమ్మును దీసికొనిపోయి బలత్కారముగా తిరుపతి వేంకటేశ్వరుల సరసను గూర్చుండఁబెట్టినను, అంతకంటెను నొకమెట్టు దాటియా తిరుపతి వేంకటేశ్వరకవులఁ బడద్రోసి వారుకూర్చుండిన యాసనములందే వీరిని గూర్చుండఁబెట్టినను దానఁ దమకు లాభముండ నేరదు.

తే॥గీ॥ ఏమనిన నేమి తుదకు జయింపఁగలిగి, రే వృథావాదు లయ్యవి పోవుఁగాలి
క నెసువారు "నిల్లలికిన యంతఁ బండు,వగు నె" యిఁక జూడుఁ డేమా నొయ నేడువారు

గీ॥ ఏమి యగుఁ! దెల్విఁ తక్కువ యొందు నపజ, యమ్మనకుఁ గారణంబది యాచరించు
పక్ష మెన్నఁటికే నియుఁ బదుట ధ్రువము, వెఱ్ఱివేసముల్ సాఁగవు విద్వెపట్ల.

ఉ॥ తక్కిన వారికేమి యవధాన విధాన మదట్టులుంత మిం
పెక్కిన *గీరత శ్రవణ మెంత సుతించినఁగాని తీర దా
చక్కని పాక మెట్లొదవు! సార మదెంతయు లేకయున్న న
మక్క! నిజంబుగాఁ గవనమన్న! నదే యగు వేయునేటికిన్॥ ౧౪౩

చ॥ అనుచు ననేక మార్గముల నయ్యయి వారు ప్రశంస చేసికొం
చును ముదమందుచున్ జనిరి చూడఁగ వచ్చినవా, రసూయలో
మునిఁగిన వారు కొందఱు ప్రబుద్ధులు "తప్పదు వ్రాఁతవారినీ పే
రును జెడఁదీయలేమొ" యని రోఁజుచు నేగిరి యేగొ గొణ్గుచున్॥ ౧౪౪

క॥ "పంచశుభం పంచాశుభ" మంచున్ బుధులాడుమాట యచ్చుపడఁగ దీ
వించుచుఁ దిట్టుచు మెచ్చుచుఁ, గుంచించుచు నరిగి రంతకున్ సభ ముగిసెన్॥

ఉ॥ ఇంతకుఁ బూర్వమే స్వజన మెల్లను స్త్రీపురుషాదులాత్మలోఁ
బంతము పుట్టి "శాఖ కిది పర్వ నణంచె" నటంచు నెంచి "వి
క్రాంతి నియోగులంగలుగుఁ గాక యెటుల్ మఱి దాని నెదికుల్
గాంతు" రటంచు నక్కవికి గాటముగాఁ బురినెక్కఁ జేయుచున్॥ ౧౪౫

ఉ॥ ఒక్కరొ! యిర్వరో!, జనము లుండిరి వేలకు వేలు, తావృశం
బక్కట! యాసభాస్థలమునం దొక వైదికమాత్రుఁ డెంతయున్
న్నిక్క గనంబడన్ బలుకునే! నిను నింతటిమాట, నిద్దెలో
నెక్కువ తక్కువల్ గలుగునే యను మంతనె యింతగర్వమో॥ ౧౪౬

ఉ॥ గర్వమదేమొ చూచెదము గాకిది గుంటురిసీమ, యిందు వై
భార్గవులెందఱో గలరు తొల్లిటినుండి నియోగు, లిందెటుల్
దుర్వినయంపు వైదికుల త్రోవలు సాగెడి! నస్మదాదు లం
"దర్వనఁ బ్రక్క నిల్వఁగ నితండు దగం" డనుమాటఁ బల్కునే॥ ౧౪౭

* ఇంద్రులకు సంబంధించిన చరిత్రములు గిరతసీరికలోఁ జూడఁదగు-

ఉ॥ *మీసము "రెండు బాసలకు మేమె కవీంద్రుల"మంచుఁ దాల్చునా
వాసిని గోలుపుచ్చి మన వైపు నియోగుల చేతఁ జూపి "మీ
దాసుఁడ"నంచుఁ బల్కెఁడి విధమ్మున కక్కఁవిఁ దేకయున్న నీ
వేసము లేల! పాగలును వింతలకోటులు బర్వుగోసమే॥ ౧౪౯

ఉ॥ "ఉన్నను బాండితీగరిమ మెండొక వైదికులందు రౌజనల్
సున్న" యటంచుఁ ‡పెద్దన త్రిశుద్ధిగఁ జెప్పెనుగాదె, యేదియో
పన్నిక పన్ని యిక్కవుల పాత మడంతము గాక ఛాందస
త్వోన్నతు లేమి సేయఁగలరో! కనుఁగొందము గాక వైదికుల్॥ ౧౫౦

మ॥ ఇది గోదావరితీరమంచు మదిలో నేమేమొ యూహించెనో
విదితం బందు బలమ్ము వైదికుల, కావేసమ్ము లిప్పట్టునం
గుదురంబోమి యెఱుంగఁ జేయవలయున్ గుర్వీ సమానంబుగా
నెదవన్ రా దనుమాట కర్థమది యేమో! చూత మం చుద్ధతిన్॥ ౧౫౧

ఉ॥ కొప్పరపుంగవీశుఁ బురికొల్పుచుఁ "బత్రిక వ్రాయి మిప్పుడే
చప్పున, వారు రేపకడఁ జన్నపయిన్ మన మేమి చేసినం
దప్పనుబాక, మీనిసిని దక్కవియుగ్మము నాటకంబునం
దొప్పెడిఁ బత్రికక్కడనె యొప్పఁబఱించి యొసంగి వచ్చుటల్॥ ౧౫౨

క॥ వినిపించి యొసఁగనయ్యెడ, ఘను లందఱు వీరు రంత గర్వ మడఁగు నె
త్తిని దీనిఁ బెట్టికొని వార్, చనునట్లొనరింపకున్న శౌర్యము గలదే॥ ౧౫౩

క॥ "అలసాంద్యదమృతంవిష, మీలాగున వ్రాయు మంచు నేర్పఱిచి తనన్
గోలగనైన కొల్పిన మది,డోలాందోళనకు దిగి కదున్ వడఁకుటయున్॥ ౧౫౪

ఉ॥ పాపము! కొప్పరపుంగవికిఁ బద్యము వ్రాయఁగఁ జేయిరాదు లో
లోపలఁ బూత్తిగా దిగులు లోఁతగిలింపఁగ సాఁగె పారె దా

---

* ఉ॥ దోసమటంచెఱింగియును దుందుడు కొప్పఁగఁ బెంచినార మీ,మీసము "రెండు భాషలకు మేమె కవీంద్రుల" మంచుఁ దెల్పఁగా, రోసముకల్గినన్ గవివరుల్ మము గెల్వుఁడు గెల్చి రేని యీ, మీసము దీసి మీపదసమీపములన్ దలలుంచి మ్రొక్కెదే
(నానారాజసందర్శనము 43 వపుటచూ

‡ "బుద్ధిజాడ్యజనితోన్నాదల్ గదా శ్రోత్రియుల్" (మనుచరిత్ర)

దాపున నుండి బంధుగులు ధార్ష్ట్యము నేర్పఁగ డంగి రేదియుం
దోఁపదు పాప! మాతనికి "నూయియు గోయియుఁగాఁ,, గనంబడున్॥ ౧౫౫

ఉ॥ కాలెటు త్రిప్పువాఁడ' సభ గాఫుటయే ధ్రువమైనచో, నెటుల్
చాలుదు గచ్చు విచ్చుమెయిఁ జర్చర గొంటెడి యాశు ఘోషచేఁ
దూలుదురే శఘానులు బుధుల్ కవులాశుకవిత్వ తత్త్వవి
త్ప్రాలవిలోచనుల్! చెడుఁగదా! మును పుండిన కీర్తి దీనితో॥ ౧౫౬

ఆ॥వె॥ క్రొత్తనీరువచ్చి కూలమ్ముఁ బెకలింపఁ, బాఁతనీరు కూడఁ బైకిఁ బోవు
నేమిసేయువాఁడ నిది వీ రెఱింగియు, దిగుమటందు రనుచు వగచుటయును.

ఉ॥ ఆముఖ వైఖరిన్ దెలిసి యాప్తులు బంధులు పల్కిరంట! "నీ
కేమి భయంబు వైదికుల కియ్యెడ నాటలు సాగ వెందు నీ
సీమ నియోగిసీమ, సభ చేయనె చేయము చేయుచో నెటో
నీమహిమంబె మెత్తుము మనీషులు జంకుదు రొండు వల్కఁగన్॥ ౧౫౭

తే॥గీ॥ తెల్లవాఱిన దాది యేదేని పనికి, వచ్చి లౌకికులను జూడ వలయునట్టి
పండితులు మాకు వ్యతిరేకఫణితిఁ బోరు, ఎల్లబుధులు తిర్పతివెంకటేశులట్లు.

చ॥ ఇదియిటులుండఁగాక సభనొట్లగు, సూక్తులనఁ "దెల్గుటీచ" రన్
పదమున నుండె నందొకఁడు, వాదము కోసము సూక్తులువారు "పా
పద,,మని యిత్తురే సెలవు, పల్కులు వేయును నేల! చేవ వో
యెదరలవారు నీకు జయ మేర్పడు, నోర్పడి యుండు వైదికుల్ ౧౬౦

ఉ॥ పంతము పుట్టి వాఁడొకట వాదము కోసము నిచ్చెలేని యు
ల్లంతన జీవనార్థ మగు నాపని యూడెడి, మీఁద దానితోఁ
గొంతయడంగు గర్వమది "కుంచెఁడు పోయెను సోలకేగ,,నం
చెంతురు లోకు, లెట్లయిన నేమి పరాభవమైన యట్లగున్॥ ౧౬౧

ఉ॥ వ్రాయుము "మీరుమీసమును వాదములో, గొఱిగించు నంచు' వా
ర్చేయఁగలట్టి దెట్టిదిను చేటురు, చూతముగాక నీకు మా
సాయము గల్గ నిట్టి దొక సందియమేటికిఁ "గేను" దెచ్చుచో
మాయదిమే సమస్తము ప్రమాదము లేశము లేదు దీనిలో॥ ౧౬౨

శా॥ మేమే వాత్రికులము గాని మాకుఁ గవితో స్నేహంబు ముఖ్యంబు గా
దేమో కొంచెము వ్రాయ నేర్చినను మే మీవృత్తిలో లేము మ
మ్మామోదింపదు లోక మట్లగుట నిన్నర్థించుచున్నాము నూ!
మామా వ్రాతల్లిటు సున్నయట్టులుగ సంభావింపు నిశ్శంకగన్ ౧౬౩

చ॥ అని పలుమాఱు చెప్పినను నాత్మకు నన్యుల కున్నయంతరం
బు నెఱుఁగు కొన్నరంపుఁగవి పూర్తిగ సందియమున్ విడండు, యా
తనిగతి గాంచి యంతట సతంత్రుఁ డొకానొకవృద్ధు పల్కె "ని
న్ననఁ బని లేదు నీకు బిరుదావళి నొసంగిన తప్పు మాదియే!! ౧౬౪

ఉ॥ ఐనది యయ్యె నీ కిడిన యా బిరుదమ్ములు నూఱుబాఱులన్
మానుగఁ జెట్టిపొమ్ము మఱుమాట వచింపక యట్లుగాని చో
దీనత మాని పత్రికను దేఁకువ నై లిఖియింపు మొందుచం
చానకు సొప్పుకో,, మన నతం డిది యెట్లును దప్పదం చొగిన్॥ ౧౬౫

చ॥ మనమునఁ జింత నొందుచు నమాత్యులు చెప్పినయట్టి యంశమున్
గొని తన నేర్చు చందమునఁ గొండొక కైత రచించి వ్రాసి యా
ప్రిన నది కేలఁ బూని దయచేసిరి మా కడ కొక్క యిర్వరిం
తని వచింప రాని *వినయం బనయంబు మొగమ్ము గ్రమ్మఁగన్ ౧౬౬

క॥ వీ రిరువురు మఱికొందఱు, కాఱులు ప్రకటించి పత్రికలఁ నింపిరి దు
ర్వాదుల నిర్వారల నా, చేరువవా రెఱుఁగుదురు ప్రసిద్ధులె వీరల్ ౧౬౭

చ॥ ఒకఁడు "యథార్థవాది" యగు నొక్కఁడు దా నగు "సత్యవాది" వే
ఱొకయెడ రెండు వేసములు నొక్కఁడె దాల్చి పరాక్రమించు ము
న్నొక మహిషాసురుండె కద! యొక్క త్రుటిన్ శతశస్సహస్రశః
ప్రకటితరూపుఁ డయ్యె నని భాగవతంబు వచించు నంబరో! ౧౬౮

ఆ॥వె॥ పలుకు వేల! "సత్యవాది" యథార్థవా,ది "యనుపదము" గమ్ము లిట్లు గాఁగ
మార్చినట్టి వీరి మహిమను నుతియింప, శేషఫణికి నైనఁ జెల్లదంబ ౧౬౯

క॥ పనిలోఁ బనియి ద్వారల, పెనుదుండగముల నొకింత వినిచి విపవఁ ద
క్కిన కథ నుడివెద మింతటి, ఘనవృత్తాంతులఁ జూచి ఘొల్లుఁగ నంబరో తొంగున్

* "అతివినయం ధూర్తలక్షణం"

చ॥ ఇదివఱకే మొనర్చినటులే యవధానము నాఁడునుం* సభా
సదు లలరం బొనర్చితి, మసంగతమైనను వాగుపట్టు ప
ట్టుదిమద నెగ్గనిచ్చు నెడ నౌదుము వీరికి మంచివార మ
య్యది బుధగర్హితం బగుట నందుల కొప్పక పోతి మంబికా! ౧౬౧

---

*......19వ తేదీ పగలు 2 గంటలకు హిందూనాటక సమాజము వారి నాటకశాలయందు సభ సమకూర్పఁబడెను. గుంటూరునందలి పౌరులే కాక చుట్టుపట్లనున్న పల్లెలవారును నవధానసభాదర్శనకుతూహలులై వచ్చుటచే నిసుమ వేసినను రాలనుండునట్లు నాటకభవన మంతయు నసంఖ్యాకములగు జనములచే నిండి సిబ్బిడీకృతంబై యుండెను. 2½ గంటలకు నవధానము ప్రారంభింపఁబడెను. ఒకటియుఁ బూర్వమే తమకుఁ దెలియదు కాని పృచ్ఛకులు నూర్గురు కూరుచుండిరి. వారును నూర్గురికి చెప్పుటకు సంసిద్ధులై యుండిరి. కాని అవధానులొక్కొక్కరి కొక్కొక్క పాదము చొప్పున నలుబదిమందికి పద్యములు చెప్పునప్పటికి మ॥ రా॥ రా॥ ఏకా రామయ్య పంతులుగారును, కొండా వెంకటప్పయ్య పంతులుగారును బ్రహ్మశ్రీ రంగావఝ్ఝుల హనుమయ్యగారును మొదలగు పెద్దలు, నలువదిమంది చాలరా! ఏలయనగా సమకాలము చాలపట్టు,నని వక్కాణించుటచే నాఁడు 7 గంటలగువఱకు, నప్పుడప్పుడడిగిన ప్రశ్నలతో మిదివఱకు నాగరాజులపై రచించిన పద్యముల సభ్యకర్ణపేయముగాఁ జదువుచు నలువదిమందిలో నిరువదిమందికి పూర్తిగా నాలుగు చరణములు చెప్పి, చదివి వేసి మిగిలిన యిరువదిమందికి రెండు రెండు చరణములు చొప్పునఁ జెప్పి వేసిరి......బ్రహ్మశ్రీ వెంకటశాస్త్రిగారప్పటికి జ్వరపీడితులై యున్నను వారు తమ యుద్యమమును నెఱవేర్చి సభ్యులకుఁ గలుగఁజేసిన బ్రహ్మానంద మనితరసాధ్యమని వక్కాణించుటతక్క విశేషించి వర్ణించుట నాబోంట్లకు శక్యము కాదు. ఇంక నారోగ్యస్థితిలో వారొనరించు నవధానమెంతయానందకరమై యుండునో యెవరు చెప్పఁగలరు, నాఁటిరోజున మిగిలిన రెండుపాదములు చెప్పి మరలఁ జదువుటకుఁ గొంచెము కాలమే పట్టినను రాత్రి 8 గంటలవఱకు వారియసమానకవితాసుధాధారలచే సభయంతయు నిస్తరంగంబైన సముద్రమువలె నుండెను. పిదప "జయజ" యేతిధ్వానములతో సభ ముగింపఁబడెను, నాఁటిరాత్రి హిందూనాటకసమాజము వారి పాండవవిజయప్రదర్శనమునకుఁ గొంత రాయితీ కలుగునని కాని లేనిచో సభ యెప్పటికి ముగిసియుండునో తెలియదు. అవధానాంతమున నాయూయుపగీతులు సమయానందమును వెల్లడించుచు చంపకోత్పలాది మాలికలచే నవధానుల నలంకరించిరి ...... ... ... ... ఇట్లు

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, చంద్రికాప్రసన్న, గుంటూరు 29-8-11

§ఉ॥ అప్పుడు "సత్యవాది"యు "యథార్థపు వాది"యు నన్న పేళ్లతోఁ
దప్పులు వ్రాయువారలని దగ్ధత మాపెడునట్టియూహచే
యుప్పతిలెన్ గ్రమమ్ముగ రుషోదయ మయ్యది తగ్గి వారిపై
నిప్పుడు ప్రేమ పుట్టెడి నదేమిటికన్న! వచింతు మంబరో! ౧౮౩

చ॥ అనృతము వ్రాయఁగాక యది యాత్మకునుంబలె నొడ్డకున్ సుఖం
బున ననృతంబుగాఁ దెలియుపోలిక్రని వ్రాసెను "సత్యవాది" వీ
నిని బరమోపకారి యని నిక్కము చెప్పఁ దగున్ "యథార్థ వా
దిని" మఱి యట్లె చెప్పవలెఁ దిట్టిర నేకులు వీరి నెందుకో ౧౮౪

చ॥ తనలిఖియించు వ్రాఁతలకుఁ దద్దయు మోసము చెంది పత్రికా
జను లపరాధిగా మఱి యసత్యవదస్కుని గాఁగఁ దన్నుఁ దె
ల్పిన నొకమూలఁ గిమ్మనక పేర్చిన భీతిని డాఁగినట్టి వాఁ
డనృతము వ్రాసియు న్నిజము నావలఁ దెల్పినవాఁడె యౌఁగదా! ౧౮౫

---

§ J. GURUNADHAM, B. A.,
*Editor, Andhrakesari.*

*RAJAHMUNDRY.*
*Dated 13th October 1911.*

Sir,

Re—Your registered card dated 11th October 1911 you are requested to refer to the 'Andhrakesari' dated 29th September 1911, page 6 column 3, when a 'correction' was published regarding the matter you have written to me about.

I am advised to add that nothing more can be done.

I am,
Yours faithfully
J. GURUNADHAM,
*Editor.*

M. R. Ry.
R. HANUMAYYA PANTULU GARU, B. A.,
*First Grade Pleader,*
Guntur.

తే॥గీ॥ *దిద్దుబాటును బత్రికాధిపతి వ్రాసి, "సత్యవాది"యపరాధమ్ము నైంచి డాంచి
నట్టిసంగతి నెఱింగియు నదియె పట్టి వేలం బడు మాకృతజ్ఞుండు వెఱ్ఱివాండు
ఆ॥ వెం॥ "ఇంటివాండు గొడ్డు నిదియనంబోరు గున, వాండుపాడి"యంచుం బలుకు రీతి,
మెలంగుమాకృతజ్ఞు మెచ్చ నాలుక కాద, యెవని నేని మెచ్చ నిచ్చగించు"

(*29 సెప్టెంబరు 1911 సం॥ ఆంధ్రకేసరి నుండి)

# A Correction.

## దిద్దుబాటు.

### గుంటూరు అవధానము.

"గుంటూరు అవధానములు" అను పేరట "సత్యవాది,, యను ఉపవిలేఖరి మాకు వ్రాసిన లేఖను వెనుకటి పత్రికలో ప్రచురించియున్నారము అందు వేలూరి శివరామశాస్త్రిగారిచే చేయబడిన శతావధానము సరిగా చేయబడ లేదని సత్యవాదిగారు వ్రాసెను. ఇది అసత్యమగు లేఖగా మాకు తరువాత తెలియవచ్చినది. మరియు శివరామశాస్త్రిగారిని శివరాముడనియు సత్యవాదిగారు వ్రాసిరి. మేము ఈ పేరు కవిత్వము చెప్పుటయందు తమనమ్రత (Modesty) ను జూపుటకు వహించిన నామమని దలంచి దిద్దుబాటు చేయకుండ ప్రకటించినారము. వీరినిగూర్చి మేము ఎప్పుడును వినియుండక పోవుటచే ఇట్టిపొరబాటు తటస్థించినది. మరియు సత్యవాదిగారు విద్యాధికులనియు లేఖల వ్రాయుటయందు తమజవాబుదారిత్వ గ్రహించిన వారనియు మేము భావించుటవలన వారలేఖను ప్రచురము జేసినారము. ఇట్టి పొరబాటు గల్గినందుకు చింతిల్లుచున్నారము,

---

☞ పరా—ఈదిద్దుబాటునకు మఱియొకలాగున దాత్పర్యమును కల్పించుచున్న కవితాపత్రికలో నీవ్రాంత నీక్రింద నుదాహరించుచున్నారము, ఆవ్రాంతలో నిదురాశయును, దెల్వితక్కువయును, అకృతార్థతయు లోనగు సుగుణములు చదువరులే నిర్ణయించుకొందురుగాక,

"కృష్ణ—కేసరీ! ఈ సంగతి పొరపాటని చెప్పితి వంటగాదా?, ఆంధ్రకేసరి—(నవ్వుచు) అది గాదమ్మా! ఆయన పేరు శివరామశాస్త్రియనుటకు శివరాముడనుట పొరపాటని చెప్పితిని గాని తక్కిన విషయమును గుఱించి నేనేమియు నసత్యమాడ లేదు. ... ... (1912 సం॥ కవితాపత్రిక 2 వసంచిక చూ.)

ఉ॥ చెప్పిన వ్రాఁతఁ బట్టికొని సోఁకుచు ముద్దిడుకొంచు నచ్చునన్,
గుచ్చుచు నక్కునందు నిడి కుల్కుచుఁ గన్నుల నద్దికొంచు ని
ష్పచ్చరమైన సామెతకుఁ బొల్పడు మాకుహనావధాని కే
మిచ్చిన నీయవచ్చు నిటులేపము దానెడిగట్టి నందుకున్". ౧౮౮

చ॥ ఇది యిటులుండుఁ గాక "నది సేఁద శ్వవుచ్ఛము నూఁత గొన్న"కో
విదులఁ గృతజ్ఞులన్ గడువివేకుల గీరతముండుఁ జూచుకో
కది యిచటేల! వారిబులువయ్యెడుఁ దీర్ఘము గాక, అంబరో!
పదపటిగాథకున్ హృదయపద్మ మొకించుక త్రిప్పు మొప్పగన్" ౧౮౯

---

రాజమండ్రి 13-10-11

* చిలకమర్తి లక్ష్మీనరసింహము నమస్కారములు, అయ్యా! దేశమాత కార్యదర్శిగారి పేరమీరు వ్రాసిన జాబు జూచితిని పత్రికానిర్వాహపు భారమును నేను యితరులపైఁ బెట్టితిని వచ్చినయుపవిలేఖకుల జాబులను నేను చూచుటలేదు పత్రికానిర్వాహముఁ జేయువారు గూడపొరబాటున వానినిఁ బ్రకటించియుందురు కానియుద్దేశపూర్వకముగా మిమ్ముగాని తిరుపతిశాస్త్రులుగారినిగాని తిరస్కరింపరు. కావున మన్నింపవలయునని కోరుచున్నాను.

---

(1-11-1911 తేదీ ఆంధ్రపత్రికనుండి)

* ఈశతావధానములను గురించి వ్రాయువారికముందు దమపేరులను వ్యాసాంతమున ముద్రించుట కంగీకరింతురేని వారివ్యాసములను స్థలమున్నయెడల ముద్రించుట కంగీకరించెదము. సత్యవాది, హితవాది, పృచ్ఛకుడు, అనివ్రాసినయెడల ముద్రించుటకు వీలుపడదు. (ఆ. ప॥ సం॥)

---

(ఈక్రిందియుత్తరముకృష్ణాఫీసునుండివచ్చినది.)

*......మీయవధానము బాగుగ జరిగినదని పత్రికలో వ్రాయుటకంటెయథార్థవాదినొక్క వ్యాసమే మీప్రఖ్యాతినిమతింతస్థిరముగ స్థాపించినదనియు, ప్రజలయభిమానము గూడ మీపట్లచూపుటకు కారణమైనదనియు నమ్ముచున్నాను. ... ...

ఆవటపల్లి నారాయణరావు.

సీ॥ (1)వినయార్థముగ మేము వినుచుపల్కులనెల్ల ననపర్థతకు గుర్తు లనిలిఖించె,
(2)ఘనుఁడైన కాశికృష్ణుని బట్టికొని మాకునై యేదొ సూచించెననిలిఖించె,

---

(గుంటూరి యవధానారంభమునందలిమాపద్యములు)

(1)చ॥ కలరుగదా! గస్రగహణకాముకులీసభ నెందఱెందఱో,కలరుగదా! మహాకవులకారణకారుణికుల్ మఱెందఱో, కలరుగదా! యథార్థగుణకౌతుకులంచును బూనికొంటి మిం,దులకు వయఃప్రియుక్తమగుదోసము చేసెడిచేష్ట నైఁపుడీ॥ ఉ॥ చేసితిమో! యెవండెఱుఁగుఁ! జేయనెలేదొ శతావధానముం,బా! సకలేశ్వరీ! గతము లందఱునమ్మరు నేఁడెటో రసా,భాసముగాకయుండఁగఁ గృపన్ గను "మెప్పటి కప్పుడే యిటుల్. దోసిలినుగ్గునీతఁడని తోఁచిత్యజించెద వేమొశాంకరీ॥ ఉ॥ ధారణ సేయుపట్టున నె తావశమౌదయగాని కావ్యపున్,ధోరణియందు లేశమును దోడితరంబన పేక్ష్యమొకఁ చూ,పూరకమాపయిన్ గొలుపుమోజగదంబ! యిదెంత! సర్వమున్, ధారణిదాల్చునీదుబిరుదంబు నెఱింగియె దేవురించితిన్ (వెం॥ శా॥)
చ॥ తలనరయందొడంగెఁ గవితావనితామణియున్ బతివ్రతా,తిలకము నీదుజోడయిన దేయగుటన్ భయభక్తియుక్తకాఁ,గల దిఁకధారణాతరుణి కారుణికత్వపుఁ బ్రేమఁజూపఁగాఁ గలఁచునొ లేదొ! యంచు మదిఁదత్తఱమిత్తఱిఁ గ్రొత్తగాల్పడిన్
ఉ॥ తిప్పితి వెల్లదేశములు తిప్పినచోటుల నెల్ల భంగపా,టెప్పుడు రాకయుండ జయమే సమకూర్చితివన్న యూహతో,నిప్పుడు చేయఁబూనిన నొకించుకగర్తపు రావధానమం, దెప్పటియట్ల నీదయయే మదిఁగోరితినమ్మ యీశ్వరీ (తి॥ శా॥)

(1911 సం॥ సెప్టెంబరు 1 వ తేదీ కృష్ణాపత్రికనుండి.)

(2)...వీరవధానముచేయునపుడగ్రాసనాధిపతి యేదియో వ్రాయుచుండిరి, ఈ వ్రాఁతపైకవీశ్వరులు తమవీక్షణములు ప్రసరింపచేయుచువచ్చిరి,...... (యథార్థవాది)

(అక్టోబరు 6 వ తేది 1911 సం॥ కృష్ణాపత్రికనుండి.)

(2)......అయ్యా, తాము తమపత్రికలో మాగుంటూరు శతావధానము (తిరుపతి వేంకటీయము) నుగూర్చి యథార్థవాదిగారి వ్రాతఁ బ్రకటించియున్నారు, అందనేక విరుద్ధాంశములును నసత్యాంశములును గలవు. అవియన్నియు నాకు సంబంధించినవి కావు. కావున వానినవదలి "కాశీకృష్ణమాచార్యులు (అగ్రాసనాధిపతి) తనచేతిలో వ్రాసి,స్రగ్ధరావృత్తమనియవధానులకు సూచించె"నను నంశము, నేనవధానపద్యములు వ్రాయుచు గూర్చుండుటయు వారవిచూచుచుండుటయు, కేవలమసత్యమని దెల్పుచు నా "యథార్థవాది" యెవరో దయచేసి తాను తెల్పునెడల మీయెడ మిగులఁ గృతజ్ఞుఁడనై యుందు నని వాక్రుచ్చుచున్నాఁడను.

గుంటూరు
25-9-11.

ఇట్లు, కాశీకృష్ణమాచార్యులు,
బాలసరస్వతి, శతావధాని.

(3)మున్ను మన్నన నేయునమ్మహాత్ములె నెల్లఁ బక్షపాతులటంచుఁ బడ లిఖించె
నది యిది యననేల! యఖిలమ్ము వ్యతిరేక మెటులౌను యెంచి తానటులిఖించె
గీ॥ ఆ! యనఁగనపశబ్దమా "ఊ" యననుప,శబ్దమాను "నారాయణస్మరణ నేయ
బూతగు"నటన్న సామెతపూర్తిగాఁగ, తార్థమగునట్లు నడిచె యథార్థవాది"

* తే॥గీ॥ చేసికొనా చేయకో మేము చిన్ననాఁట, "శతవధాను,,లటన్న మచ్చనొక దాని
గొంటి మది నేఁడు పోఁగొట్టికొందమన్న, "బాలబాపరోగము,, మచ్చ వగిదిఁబోదు

క॥ అని వినయంబున మాకుఁ, మనమున నవనధామందు మనలిన విను భుక్
ఘనమతులు మెచ్చ నుడివిన, ననయుండు "యథార్థవాది"కది విషమయ్యెఁ

¶క॥ "మందఃకవి" యనుశ్లోకము, నందుఁ శ్రీకాళిదాసునంతటివాఁడే
నిందించుకొనియెఁ దనన్రవ, జ్ఞం దానికి నేవవడిన జడు లుం గలరే

క॥ అతఁడే మందుఁడ ననికొనె, మతిహీనుఁడు కాళిదాసు మతి యీతనిఁ బం
డితులు నుతించుట వితయను, వితము గద! యథార్థవాది వేఁడుట ప్రాఁతల్

ఆ॥వె॥ దీని క్షేమి తెల్వితేటలు లేనిజా, ల్మ్రలకుఁ దగిన యూహ పొడమ కెట్లు
అదియుఁగాక కేవలానృతమ్ములు వ్రాయువారి వ్రాఁత కొకవరుస గలదె

---

(3) (సెప్టెంబరు 1వ తేదీ 1911సం కృష్ణాపత్రికనుండి)

......పూర్వపుసంగతి యెట్లున్నను ప్రస్తుతము మాయూరి యందు వారు చేసిన యవధానమునకు సన్మానించుట కభిమానమే కారణమని నిశ్చయముగా జెప్పగలము......(యథార్థవాది)

---

*(సెప్టెంబరు 1వ తేదీ 1911 సం॥ కృష్ణాపత్రికనుండి)

...మొన్నను వారు (తిరుపతివెంకటేశ్వరులు) స్వవిషయమై చెప్పికొను సందర్భములో పసితనంబున చిన్నబిడ్డ చేష్టవచ్చినప్పుడు కాల్చిన రక్షయొక్క మచ్చ ఆజన్మాంతముండునట్లు వారు చిన్నప్పుడార్జించిన "శతావధాను,,లను మచ్చయిప్పటివఱకు నిల్చియుండినదని వచించిరి, ఆహా! ఏమి వీరియుపహాసము! కింకవీంద్రిఘుటాపంచాననుల నోటనుండి రావలసిదేనా! వారికీర్తిని వారే మచ్చతోఁ బోల్చుకొనుచుండ మేము వేఱుగఁ జెప్పవలయునా!........(యథార్థవాది)

---

¶శ్లో॥ మందః కవి యశః ప్రార్థీ, గమిష్యా మ్యుపహాస్యతాం"(మందః, నిర్భాగ్యుఁడు, శ్లో॥ మూఢాల్పపటునిర్భాగ్యామందాః, అని నిఘంటువు చెప్పచున్నది

క॥ "మాదిగమంచమునకుఁ దల; యేదెస, కాళ్లకడ,, యనఁగ నేదెస" యక్టే
పో! దుర్విదగ్ధు లెదియో, సోదెన్ వ్రాయుదురు దానిఁ జూతురె ప్రాజ్ఞుల్.

చ॥ ఇతఁ డిటు వ్రాసినన్ సుజనుఁడే యనుకొందము దేవి! యింత కు
త్సితులు గలారు సూ! జగమునన్ మఱి కొందఱు; వారు సుప్రసి
ద్ధత గలవారిపైఁ బలుచు దప్పుడు వార్తలు వేయుచుండ్రు "స్వ
ర్గతు లయి,, రంచుఁ గూడ వృథగాఁ బ్రకటింతురు దుర్విదగ్ధులై'. ౧౯-౭

* చ॥ (1)"తిరుపతి వేంకటేశ్వరులు తీఱి" రనన్ మఱి క్రిఱ లేద(2) వేఁ
దుఱు గొని రన్న వేఁడుఱునఁ దూఁగఁగ లే"(3)దవధానమందుఁ ద

---

*వరా:— ఈపద్యమున నున్న(1)మొదటియంశమిదివఱకనేకులు విని యున్నదియే, దీనికి సంబంధించినలేఖలు ప్రకృత మిట తేమింజేసి యుదాహరింపఁ బడవయ్యె ఇఁక (2) రెండవయంశమునకు సంబంధించినలేఖలో, గీరతము, 3 వ పుటలోఁ గొన్నియు, 69 వ పుటలోఁ గొన్నియు నుదాహరింపఁ బడి యుంటచే నిందు మరల నుదాహరింపలేదు, సెప్టెంబరు 16 వ తేదీ 1912 సం॥ దర్బారులోని చట్టి నరసింహారావుగారి వ్రాఁతకూడ నీయుపవాదమునకుఁ దోడ్పడుచున్నది. ("ఎవరో యొక వెఱ్ఱి వెంకటాయవలనఁ బ్రేరేపింపఁ బడి (వ్రాసినతలంపు) ఇది శ్రీకవిరాజు శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రులవారు నీరసా శుకవనమును గూర్చివారికిఁ దోఁచినయభిప్రాయము నాంధ్రభారతిలోఁ బ్రకటింపఁగా నది కూడ మా ప్రేరణవలననే జరిగిన దని యీ చట్టి నరసింహారావుగారు వారిని, మమ్మును, దూషించుపుట్టములోని వాక్యరత్నములోనిది! ఈయన సత్యవాదిత్వ మీ క్రిందనుదాహరింపబడుదర్బారులోని శ్రీకవిరాజుగారివాక్యములవలనఁ దేలఁగలదు

(అక్టోబరు 1వ తేదీ 19 2సం॥ దర్బారునుండి)

......"ఆనావ్యాస మొకరినుద్దేశించి వ్రాయఁబడినదికాదు. ఏ వెఱ్ఱివెంకటాయ,, ప్రేరేణయు నటలేదు. నేనెరుల దాక్షిణ్యమునకుఁ గట్టుపడి యుండువాఁడఁగాను. ప్రస్తుతమింటింటికింబదుగుకవధానులు వాసుకవులునుబయలుదేరుటచేతను, వాఁవలన లోకమున నుపకారము, లాభము, లేదని నామదికిందోఁచుట చేతను ని

ప్పి" రనినఁ దప్పలేద రిపుభీకరులై తమపేరుమీఁదఁ జీవ
ల్వురు బ్రతుకఁగా భవత్కరుణ బొందిరివో సుఖముండి రంభికా. ౯౯

---

డబవోలుసభలో నించుక చదివిన విషయమునే విపులముగ వ్రాసియుంటిని. దా నివలనఁ దమకింతకెనుక వచ్చుటకుఁ గారణము లేదు..... ..... ..... .....

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి,

ఇది యిటులుండి యీరావుగారి "వెఱ్ఱి వెంకటాయ ప్రయోగసారస్యమును బట్టి మన కొప్పరపు సోదరులపక్షమును నిర్వహింపఁ బూనిన గుంటూరిసీమలోని సనామకు లెట్టివారో లోకుల గ్రహించి వీరింబట్టియే యనామకుల వ్రాఁతలయందలి గౌరవములను గూడఁ దెలిసికొని "యింత విద్దెచూపిన" యీరావుగారిని మిగుల గౌరవింతురుగాక. ఇదేతీరుగా మమ్ము దూషించు బుద్ధిమంతులు మఱికొందఱుగలరు, చదువరులకుఁ దెలియుటకై వారిపేళ్లుమాత్ర మిట నుదాహరించుచున్నారము, (1) పాటిబండ సూర్యనారాయణరావుగారు, (2) బందా సూర్యనారాయణగారు, (3) ...న్నంగి నృసింహశర్మగారు.(4) పోచిరాజు సీతారామయ్యగారు,(5) మన్నవ నరసింహముగారు,(6) తురమెళ్ల వెంకటసుబ్బశర్మగారు(7) కాళ్లకూరి నారాయణరావుగారు, ఈమొదలగువారి వ్రాఁతలు పెక్కులు, గ్రంథవిస్తరభీతిచే వానినుదాహరింపనిమమ్ము నవ్వారుమన్నింతురుగాక, అవకాశమున్నచో నింకను ముందుదాహరించుటయేకాక యుపోద్ఘాతమునందిట్టివానినుదాహరింపఁగలము, వలసినవారు దర్బారు, మనోరంజని, అనుపత్రికలలోఁ జూడఁగోరెదము.

---

‡(వేలూరి శివరామశాస్త్రి తెనాలిశతావధానమునుండి)

శ్లో॥ కేచిచ్ఛ్రీపతి వేంకటేశ్వర కవీ దృష్ట్వాఽథ తుష్టాశయాః, కేచిత్కేచి దమిత్రతాముపగతాః కేచిత్పరిత్యాఽంతికే, అథ్యస్యాఽశతావధానకలనాం కీర్తిం లభంతే ధనం, తస్మాద్దాసుశివావధానిగురుతాం హేతూ కవీ సంశ్రయే,

మాఁడుకుట్ల వెంకటకృష్ణశాస్త్రి శతావధాని,

*ఉ॥ మోసపురాసభాసురులమోస్రతలు నీకడఁ జెప్పనేల రా
కాసులచైదముల్ దెలియఁగా! భవదీయహృదంతరంబు, మా

---

*(ఫిబ్రవరి 24 వ తేదీ 1911 సం॥ కృష్ణాపత్రికనుండి.)

వేఱొకచో కైతవశతావధానులను శీర్షిక క్రింద బ్రచురించిన వ్యాసమును మాచదువరులను శ్రద్ధగా జూడగోరుచున్నారము- ఇట్టి మోసమును దెల్పు నుత్తరములు మాకును, బ్రహ్మశ్రీ, శతావధానులు వేంకటశాస్త్రిగారికిని రెండు మూడు నెలలనుండియు విశేషముగా వచ్చుచున్నవి. శతావధానులు తిరుపతివేంకటేశ్వరుల మనిభిక్షాటనమునకు బయలు దేరుచున్న కృత్రిమపురుషులను బట్టిముందుగ బుద్ధివచ్చునట్లు సత్కరించి యనంతరము పోలీసువారి స్వాధీనము చేయగోరుచున్నారము- లేనియెడల దేశమంతటను విచ్చలవిడిగా తిరుగుచు జనులను మోసముజేయుచున్న యీయపాత్రులపనులు తుదముట్టజాలవు.

## కైతవశతావధానులు.

జనవరినెల 27 వ తేది సాయంకాలము సుమారు (5 గంటల సమయమున ఎల్లుసాలెములోనివసించుచున్న మధ్యాంధ్రపుడును మిత్రుడునునగు మాడపాటి తిరుమలరావుగారి గృహమునకుబోయియుంటిని అప్పటనున్న యాస్తరణము (కురిచీలలో నొకదానిపైన నొకక్రొత్తపురుషుడు కూర్చుండియుండెను ఆయనవయస్సు 20 సంవత్సరములుండును మిగుల బొడగరిగాని పొట్టికాని కాకమధ్యస్థముగ నెత్తును, గిరదాతోగూడిన పెద్దజుట్టును, సామాన్యములుగ నుండిన మీసములును (మాఖమునకున్నట్టు నాకు జ్ఞప్తి) కలిగి కొంతవరకు సుందరపురుషుడన బరగియుండెను ఆయన ధరించియుండిన ఆకుపచ్చరంగుగల శాలువతోగూడ గులాబిరంగుగల పట్టుగుడ్డలు వల్లెవాటుగనుండె వారి వేషమునకు లౌకిక వైదికమిశ్రమగు కళనొసంగుచుండినది పెద్దల బొడగన్నవెంటనే వారికి నమస్కృతులొనగు నాకేకారణముననో వారియందట్టి భక్తిభావము కలుగలేదు అదియట్లుండె నేనును నొకకుర్చీపై నచ్చట గూర్చుండిన పిదప వారికిని నాకును ఇట్లు సంభాషణ జరగెను. (నేను) అయ్యా! తమవాసస్థలమేది? (నూతనపురుషుడు) 'మాకాపురముబందరు' (నేను) 'తమపేరు?' (నూత) (నిరసనభావము నభినయించుచు) ఏదోపుల్లయ్య (నేను) 'తమగృహనామము' (నూత) 'చెళ్లపిళ్లవారు, (నేను) (కొంచెమాలోచించి) ప్రసిద్ధపండితులగు శతావధాని వేంకటశాస్త్రిగారితో తమకేమయిన బరిచయముగాని బాంధవ్యముకాని కలదా? (నూత) (ముసిముసినగవుతో) మీరాయన—

వేసముఁ బూని పట్టువడి వెల్వెలపై నొకరుండు ముక్కారసా
భానయి పోయె నంట! యెటువంటి ప్రబుద్ధులు తేరు! శాంకరీ. ౧౭౭

---

మీరతని నెక్కుడజూచితిరి,(నేను) వారిదర్శనము ప్రత్యేకముగ జేయలేదు కాని వారివలన వ్రాయబడిన గ్రంథముల బఠించితిని (నూత) 'ఏయే గ్రంథములు (నేను) 'పలుగ్రంథములు,) అప్పుడచ్చటనుండిన గృహమేధియగు తిరుమలరావుగారును మరియు మాగ్రామస్థులగు మరికొందరును నచ్చట వాదుక ప్రకారము కూడియుండగా నాక్రొత్తపురుషుడు తన పాండిత్యమును గొప్పతనమును వెల్లడింప నుద్దేశించి పూర్వకవి కృతములగు నవికొన్నియు శతావధాన శ్రేష్ఠులగు బ్రహ్మశ్రీ తిరుపతివేంకటేశ్వరకవుల చే రచింపబడిన గ్రంథములోనివి కొన్నియును పద్యములను స్ఫుటముగా జదివి తాముగద్వాల మైసూరు మొదలగు సంస్థానములలో బిరుదముల నందితిమనియు, నానారాజసందర్శనము మొదలగు గ్రంథముల వ్రాసితిమనియు నాంధ్రపత్రికయొక్క సంవత్సరాది సంచికయందు తమ పటములు వెలువడినవనియు బలికి తుదకు నేనే యా వేంకటశాస్త్రి నని ధైర్యముగ జెప్పిరి విఖ్యాతచరిత్రులగు శతావధానులు ఛాయాపటముల ననేక గ్రంథములలో నంతకుమున్నే చూచియుండిన నాకు వారు చెప్పమాటలనుగూర్చి సందేహము కలిగినందున వారిని గురించి నాకన్న నెక్కువగా నెరింగియుండిన తిరుమలరావు గారివంకజూడ వారియొక్కయు తదితర సభికులయొక్కయు దృక్కులు నాయభిప్రాయమునే బలపరచెను ఇదియంతయు నాక్రొత్త పురుషునకు దెలియకుండునట్లే జరిగెను అంతట మాగ్రామ మందిప్పుడున్న బ్ర. శ్రీ. భాగవతుల లక్ష్మీపతిశాస్త్రులుగారును కొన్ని కారణములవలన మాయూరియందు వైద్యులుగ వచ్చియున్న బ్ర. శ్రీ. మండా సుబ్రహ్మణ్యశాస్త్రులుగారును (వీరిరువురును శతావధాని శ్రీ వేంకటశాస్త్రులవారి శుశ్రూషా గౌరవమునందిన వారు) క్రొత్తశతావధానిగారికభిముఖులైరి వారిలో లక్ష్మీపతి శాస్త్రిగారికిని క్రొత్తశతావధాని గారికిని చక్కని వివాదము జరిగి పిదప సదుత్తరము లీయజాలని యా పండితంమన్యుడు తన గుట్టు బయలపడునని కాబోలు మూర్ఖవాదమునకుదిగెను లక్ష్మీపతిగారు తుదకు వీరుబూటకులుకాని వేంకటశాస్త్రిగారు కారని ముమ్మాటికి నొక్కిచెప్పిరి. సుబ్రహ్మణ్యముశాస్త్రిగారు దానిని బలపరచిరి అంత సభ ముగిసెను క్రొత్తవేంకటశాస్త్రులుగారు నాటిరాత్రి తిరుమల రావుగారియింటనే భుజించిరి భోజనము లయినపిదప మరల మేమందరము సమావేశమై చూచువరకు కృత్రిమశతావధానిగారి ముఖము తొంటికాంతిని గోల్పోయి వెలవెలబారెను చూపులు చెదరుపాటును బొందెను ఆక్కడికి తెచ్చికోలు గాంభీర్యమును సహాయముగగొని యేదియో వ్రాయుచు సభికుల ముఖముజూడజాలక కూర్చుండియుండెను. అదిసమయము కాదని మేమందరము వెళ్లితిమి మరునాడుదయమున వారితో ప్రసంగించు నుద్దేశముతో

సీ॥ మోసము తుల్యమైనను "సమోసము" యందును చేసగాని, కే
కాసును తెచ్చుకోఁ దలఁచి గౌరవముఁ బ్రకటించె వాఁడు నీ
దాసుఁడు "సత్యవాదులు" "యథార్థపువాదులు" చేయు మోసముల్
దోసపుఁ దప్పుబ్రాఁత లివి ద్రోహపుటూహ వెలార్చు నంబికా. ౨౦౦

ఉ॥ దగ్గఱనున్నవార "లిది తప్పదు సంస్కృత" యటంచు మోరపై
బొగ్గులు వోలు రంజిటిఁగి పూర్తిగ నామము డాఁచె మారగుల్
నిగ్గది తేలునంతకు ననేక విఘమ్ముల శంకితాత్ముఁడై
బ్రమ్మరి *సంశయాంబునిధి మాయలమారి "యథార్థవాది" చే ౨౦౧

---

నేనువచ్చువరకు వారు పలాయన సూత్రమును బఠించిరని తెలిసెను పిమ్మట మరునాడు (౨ వ జనవరి) మాతాలూకా తహశ్శీలుదారు గారు మ- రా- జీవనరావుగారు మడుపల్లెయను గ్రామమునందుండగా నావేషధారి యచ్చటికిబోయి వెనుకటి దినమున సమర్పించిన పాఠమునే వారియెదుట జదివి చిల్లరగా రు 50 లు పొందుటకు వాగ్దత్తమును బడసి దానిలో గొంత పైకమును హస్తగతము జేసికొనిరి అంతతో మాడపాటి తిరుమలరావుగారు మధుగను వెళ్లుట సంభవించి యాసమయమున తహశ్శీలుదారు గారిని, నరసింహారావు పంతులుగారు, నను మరియొక న్యాయవాది గారిని, దర్శించి నప్పుడు కృత్రిమ శతావధానిగారిని గూర్చిన ప్రసంగము వచ్చినపుడు తిరుమలరావుగారు వారివృత్తాంతము నామూలాగ్రము నెరింగించిరి అంత నావిపరీత శతావధానిని రప్పించి వారిని గూర్చి శాస్త్రీయమైన చర్య యేల జరపబడగూడదని ప్రశ్నింపగా నావేషధారి తాము పొందిన రొక్కమును మరల నిచ్చివేసి పాదాక్రాంతుడై వేడగా దయదలచి వారినంతటితో వదలిరి, పాపమాని ద్వాంసమ్మన్యునకు అంతకు మునుపు దొరకిన రొక్కముతప్ప వాగ్దత్తమైన రు ౩౫ లు చెందలేదు ఈకపట వేషధారి ముందెచ్చటికి బోవునూ తెలియదు. కానియీచునకు జయముకన్న పరాభవమే యెక్కువగలుగు నేమోయని తలంపవలసియున్నది.

జమ్ములాపురపు వేంకటకిషన్ రావు.

---

*..... తమకు మొక్కుడికి వెళ్లినపుడి గ్రాజయమేకలుగు నని మిమ్ము నుజయించు వారుగాని తుదకు తమకు తుల్యులుగాని ప్రస్తుతము యొక్కడును లేరన్న సంగతి నాకు బాగా తెలిసియున్నప్పటికిని యిప్పుడు పుడు దేకశ్లోకములను బట్టితమవల్ల జరిగిన నిజస్థితి తెల్పుకొనువరకు మనస్సుకు నెమ్మది లేకయున్నదిగనుక అవధానమును గురించి సవిస్తరముగా వ్రాయకోరెదను...

K. GANGARAJU.

సీ॥ ఘనమతులు పలుకఁ బరు "నూఱుకల్లలాడి,
యొకగృహము నిల్పు" మంచుఁ దదదుక్తి నెఱిఁగి,
కొప్పరము నిల్ప యత్నించెఁ దప్పవ్రాఁత
లఘు మనక వ్రాసి వ్రాసి యథార్థవాది, ౨౦౨

తే॥ గీ॥ ఆడె నీతఁడపార్థమ్ము లాడుఁగాక, స్వార్థమును గోరి కాదు దేశార్థమంబ
ఇల్లు నిల్ప నూటికి నాజ్ఞ యిచ్చువారు, కొప్పరము నిల్ప నీరొకొఁ- కోటికాజ్ఞ

చ॥ ప్రతిసభలోన వీఁడొకఁడు వంచకుఁ డుండు టెఱింగి యెవ్వరో
నతి నొనరించి *"ప్రాయకుఁడు నాయన! తప్పదు వ్రాఁత, లార్య స

---

(*నరసారావుపేట శతావధాన పీఠికనుండి.)

......ఇట్లునిర్విఘ్నముగ నవధానముపూర్తియైనపదప నగ్రాసనాధిపతి మొదలగు పలుమంది పండితులు పలువిధముల వారి పాండిత్యాతిశయమునుంగొని యాడిరి- నాఁటిదినము డిప్యూటీకలెక్టరులగు మహారాజశ్రీ విష్ణుభట్ల రామకృష్ణయ్యగారు, తహశీలుదారులగు మహారాజశ్రీ రావులపాటి చెలపతిరావుగారు మొదలగు పలుమందియుద్యోగస్థులును ప్లీడర్లును ననేకమహాజనులును సభ నలంకరించియుండిరి అప్పట్లు బ్ర॥ రావిప్రోలుసుబ్బారావుగారు లేచి "వీరిపైన నూయచేఁ గొందఱుసత్యవాదులను పేరుతో నసత్యప్రకటనలు చేయుచుండిరి- కావున నేఁడు జరిగిన యంశములకు భిన్నమైనవ్రాఁత బయలుదేరునప్పు డీసభ్యులెల్లరును సాక్షులుగా నుండ వలసివచ్చునని చెప్పిరి... ... ...

చావలి వెంకట కృష్ణయ్య.

పరా:— ఇంతకట్టుదిట్టముగాఁ బెద్దమనుష్యులను సాక్షులుగఁ జేసి రిజష్టరుచేసినట్లు కొందఱు యోగ్యులు శ్రమచేసినను పాడువ్రాఁత వ్రాయువారు విరమింపనేలేదని నెఱుఁగునది, అందు మమ్మును, అగ్రాసనాధిపతి కాశి కృష్ణాచార్యులుగారిని, కొంతపఱకు దూఱి తుట్టతుద వ్రాసిన పంక్తులుమాత్ర మీక్రింద నుదాహరింపఁ బడుచున్నవి ఆపంక్తులవలననే ఆవ్రాయసకాని కడుపుమంట విస్పష్టమగును.

(1-11-1911 తేదీ ఆంధ్రపత్రికనుండి)

......గ్రామస్థులు కవీశ్వరులు వచ్చినప్పుడు వాయిద్యములతో నూరేగించుచు మర్యాదతోఁ దీసికొనిపోయిరి గాని తిరిగి వారువెళ్లినప్పుడట్టి మర్యాద లేమియుఁ

స్మృతిగవధానమయ్యె. నిటమాన్యులు మెచ్చిరి, శంక గల్గుచోఁ
బ్రతిఘటియించి యిష్టముగ వచ్చు,ననన్ బ్రతి చెప్పఁ డొక్కఁడున్. ౨౦౮

ఉ॥ "దొంగ యెవండొ యుండె" నని తోఁచి దయార్ద్రుఁ డెవండు గాని "యో
దొంగ! మహానుభావ! యిదె తోఁచినవస్తువు పుచ్చుకొమ్ము రా
త్రిం గలగుండు వెట్టకుము దీపము లార్చెపి" యంచు వేఁడ నా
దొంగ యటుల్ పొనర్చి తనద్రోహము మాపుట యెందుఁ గంటిమే. ౨౦౯

ఉ॥ అట్టులె యార్యులైనజను లాతని వేఁడుచొ కాని "ఖ్యాతిల్
గట్టిగ వ్రాయునాజనుఁడు గన్పడి మాట వచింపఁ డెల్లరున్
"జెట్టి లిఖించు వీఁడె,, యని చెప్పుచు వ్రేలను దన్నుఁ జూపున
ప్పట్టునఁ దన్నుఁ గానిగతి భావగభీరత నుండు నొక్కఁడున్ ౨౧౦

ఉ॥ ఎంతని వ్రాతు మీవహితు నెమ్మెలఁ గూర్చి "సత్యవాది,, య
న్నంతన నన్న నట్లనకు మంచును గుఱ్ఱలు నైత మెంతయున్,
గాంతురు కోప, మట్టులె మొగమ్ము నుదుంతుఁ "యథార్థవాది,, య
న్నంత, నిటుల్ వృథా చెడుఁ గదా! యొకకొన్ని సుశబ్దముల్ భువిన్.

సీ॥ అద్వైతశబ్ద మయ్యది తిట్టుగా మాఱె బాహ్యశబ్దం బడి పాడువాఱె
సంభావనాశబ్దసౌష్ఠవం బసుగంటె, గంధర్వశబ్దంబు ఘనత దఱిగె,
దామోదరాఖ్యకు దారిద్ర్యము ఘటించె ఛాందసశబ్దప్రశస్తి చెడియె
కరణిక మ్మనుపేరు కడకు దుర్ధ్వని నిచ్చెఁ గైంకర్యపదము పాపాంక మయ్యె

---

జేయనందులకుఁ జింతిల్లుచున్నాను. బహుశః కవీశ్వరులు తొంవరమీఁద బైలుదే రుటచే నటుల జరిగియుండునని యూహింపడమైనది. (సత్యవాది)

పరాః— పైపంక్తులుగల వ్యాసమును మాత్రమువేసి పత్రికా సంపాదకుఁడు మేలుకొని 50వ పుటలో సింకను ము న్నుదాహరించిన పంక్తులువ్రాసి సిరసించుటనుసూచించెనని యెఱుంగునది, మఱియుఁ బ్రతి స్థలమునందును, ఎవనినో 'శశ్చోటి', గానిని బాపి కలహమేర్పఱిచి' ఆకలహమును బెద్దచేసి దానిని "తిరుపతి వేంకటేశ్వరులు పెట్టి"రని పత్రికలకు వ్రాయఁ జొచ్చి"రని యెఱుఁగునది.

గీ॥ మంచిశబ్దమ్ము లెన్నియో మంటఁ గలిసి, తనకు లేనిదురర్థమ్ముఁ దాల్చె నెల్ల
వాని ధరియించు నెకకొన్ని వస్తువులను, హాస్యమే కాని వేఱుగా దరయ నంబ

ఉ॥ వీరటులుండఁగాఁ దమవివేచన కొందఱు మూల డాఁచి శా
ఖారుచిరాంగికై వలచి కాసరకూసర లొక్క పెట్టని
చ్చారతి వ్రాయఁ జొచ్చిరి ప్రసక్తికిఁ గాని ప్రసక్తిగా జమిం
దారుల యట్టివారలును దత్త్వము డాఁచిన నేమనందగున్॥ ౨౦౯

ఉ॥ వీరు వివేకవంతులుఁ బ్రవీణులు నేర్పరు లింతె కాక పూ
ర్ధీరత గుర్తెఱుంగుదురు తేఁకువకున్ నిలయంబు లయ్యు శా
ఖారుచిరాంగిపాలఁ బడి క్రన్ననఁ బ్రక్కకు వంగి తప్ప మూ
పై రహిఁ బెట్టి తప్పుగలవారిని వీడుచు వ్రాసి రంబికా॥ ౨౧౦

ఉ॥ ఊరును బేరులేని యెవరో యెదియో లిఖియింప నంతగా
భారము దోఁచదయ్యెఁ గవిబాంధవుఁడైన భుజంగరావు వి
ద్యారసికుం డుదారగుణధాముఁడు శాఖను లోఁగి వ్రాయునా
ధోరణిఁ జూచి చిత్తము కుతూహలి యయ్యె బదు ల్లిఖింపఁగన్ ౨౧౧

సీ॥ *కొప్రంపు వారలఁ గొమరులకన్న నత్యధికమ్ముగా మన్నిచట్టి పేటి
తప్పొనర్చిన వారి దండించు నధికారమునఁ బరమావధిఁ గనిన ఘనుఁడు
"అనలమందొకటి చందనమందొకటి," యన్న నుడికి దృష్టాంతమైన దచు సుజనుఁ
డవసరంబైనచో నాంగ్లేయులకుఁ గూడఁ దగవు దిద్దఁగఁ జాలు ధర్మమూర్తి,
తే॥ గీ॥ భక్తత్రాణ పరిత్రాణ పసుని హరుని, ననుకరించుచు వ్రాసిన యట్టి జాబు
కవన్న సన్యల వ్రాఁతలు మిన్నలగునె, నీకు నీభక్తులకుఁ దిగ్గ్యోకైక జనని.

---

* "...కొప్పరకవులకును మీకును వాక్కలహము కలిగినట్లు తెలిసి వ్యసనపడినాను, ఉభయపక్షముల స్నేహసంబంధమున్నవాఁడనగుటచే నట్లయ్యె, మీరవధానమొనరించునప్పుడు వారికున్న తాసన మియ్యవలెననికొందరు పట్టుపట్టుటచే నీవివాద కలిగినది, ఆపట్టుపట్టిన వారే కలహకారకులని చెప్పవలసియున్నది, ... మీరు వారు వ్రాసిన మొదటిపద్యములలో మీమిసపుపద్యము నుదాహరించుట యనుచితము, వీటినన్నిటినిబట్టి క్రమముగాఁ గలహము పెరిగినది, సుప్రసిద్ధులగు మీకిప్పుడు జయము కలుగుట యొక విశేషము కాదు, సాధ్యమైనంతవరకు నిది వారు పెరుగకుండ జేయఁగోరెదను, ... మీకీభేదము నితరులు కలుగఁజేసినారు..."

జ. రామయ్య.

క॥ వీరెల్లరు వైదికులని, వైరులు వచియింపవచ్చు వాడునకై, క
స్తూరీపరిమళమూపై. కారించుత వైరిలసున వాసన లెల్లన్.
తే॥ గీ॥ ప్రకృతము భుజంగరాయభూపాలవరుఁడు, లేనిపోనిప్రసక్తి మూపైని బోలిపి
నట్టివ్రాఁతకు మేమిడినట్టి యుత్తరంబు వినుమంబ! ప్రత్యక్షరంబు గాఁగ.

1911 సం॥ నవంబరు 1వ తేది ఆంధ్రపత్రికనుండి.
శ్రీ రాజా భుజంగరావుగారి పద్యములపై విమర్శనము.

ఈదిగువ వ్రాయఁబోవు పత్రికను బీజభూతములయిన శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావుబహద్దరు జమీందారుగారి పద్యములు. వానిపై విమర్శనము.

1. "సీ॥ తిరుపతి వేంకటేశ్వరులు గద్వాలాది దేశములకా జోరు దెచ్చికొనిరి
అదియుఁ జిరంతనంబయ్యెఁ బ్రస్తుతంబుగ నేల, యొకవంక రామకృష్ణ కవియుగము
నొకవంకఁ గొప్పవారకవియుగ్మమ్ము ను నెదిరించి బవరమ్ము వదలరైరి.
వ్యర్థఁ జేయుచుండిరీవిధి ననర్గళమైన కవిత నక్కటా! యేమిగల్గెదాన......

ఇందుఁ "దెచ్చికొనిరి" అను నక్షరజ శ్రీవారిహృదయమును బూర్తిగా వెల్లడించుచున్నది.

2. "చ॥ తిరుపతి వేంకటేశ్వరులు..................వీరువా
నరసను గూరుచుండుటకుఁ జాలరు మానరిగాఁ గవిత్వముకా
విరసపుఁ జేయుబాలిసను వీరలనొక్కెడ మంచుఁ గొందఱికా
గురువులటంచు మున్ముసరు కాదనటంచు వచింత్రుగొందఱికా

ఇందలి మొదటియంశము నాక్షేపించుటచే గురుశిష్యసంప్రదాయము నెఱుఁగమి సూచించుటయేకాక గురువననేమో, అతనికష్టపెట్టిదో, యతనిఋణమును శిష్యుఁ డెట్లుతీర్చుకొనవలయునో, యింతులకు వేదము లేమి, శాస్త్రము లేమి, భారతాదులేమి యేతీరున మొల్లవిడుచున్నవో శ్రీవారు బూర్తిగాఁ బరిశీలింపక యేదోత్రోవన నేరము మోపనెంచిరని స్ఫుటమగుచున్నది. రెండవయంశము నెత్తికొనుట యుక్తముగాఁ దోఁచినను, అందులకుఁ గలబీజమును బూర్తిగా నెఱిఁగియుండియు దాని నెత్తికొన్నచో నపరాధులు నియోగిబ్రాహ్మణులే యగుదురని సంశయించుటచేఁ గాఁబోలు మెల్లఁగా జాఱవిడుచుటచే శ్రీరెడ్లోనియోగికవులను బైకిఁదెచ్చి వైదికకవుల నసూయఁగంటఁ జేయవలయునను నుద్దేశముకలవారని విస్పష్టమగుచున్నది.

3. "గీ॥ ఒకర్డె కాలమున నందన హోబలుండు, వైదికుండని బ్రమసినసంపన్నుఁడొకఁడు

పొగడెనంతనియోగిగా నెగడెనంచు, నొక్కఁడునిదర్శనముఁజూపెఁజక్కఁగాను

ఈపద్యమును జదివినవారికెల్ల నిది శ్రీవారు వ్రాయనున్న పత్రికకు బొత్తిగా సంబంధింపనిదనియు, శ్రీవారికిఁగల స్వశాఖాభిమానమును మాత్రము వెల్లడించుననియుఁ దోఁపకమానదు! కాన నుపేక్షింపఁబడియె.

4. "సీ॥ కొప్పరపువారు గూర్తురు గంటలో ముద్దుగా నేనూఱుపద్యములను, తిరుపతి
వేంకటేశ్వరులతో నిరుబాన సాహిత్యమునఁ దూఁగఁజాలకుండ్రి......

ఇందులో శ్రీవారిరువురను సములనుగాఁ జూడవలెనన్నట్లు కొంత ప్రయత్నించిరి కాని తుదకు వారిమనోరథము నైజనియోగిక శాఖాభిమానమే వెల్లడియగుచున్నది; ఏమందురా? తిరుపతి వేంకటేశ్వరులకు సంస్కృతాంధ్ర సాహిత్యము మాత్రమే యున్నదనియుఁ గొప్పరపువారికి ముద్దైనయత్యాశుకవిత యున్నదనియుఁ దెల్పిరి. ఈముద్దు ప్రాసకోసము వాడినదని చెప్పకతప్పదు. అందులకుశ్రీవారింకుమతియొకచో "వ్రాసిన ముక్కుతిమ్మనతోడి ముద్దుపలుకులు" అను సీసపాద మొప్పించితీరును. అవియటులుంతము. తిరుపతివేంకటేశ్వరులు కొప్పరపువారితో నాశుకవనముఁ జెప్పుదురో చెప్పరో, వారియాశుకవిత యెట్టిదో; వీరియాశుకవన మెట్టిదో, యదిసభాముఖమునఁ దేలవలసియున్నది. అందులకెవరి యసామర్థ్యమువలననో గుంటూరియందీసభ యాఁగిపోవుటచే నది విస్పష్టముగాఁ దేలలేదు. తేలని యంశమును శ్రీవారిందు నిర్ధారణముచేసి వ్రాయుటయెంతవఱకు సమంజసమో చదువరులే నిర్ధారణము చేసికొందురుగాక - ఇదిగాక కొప్పరపువారు సంస్కృతాంధ్ర సాహిత్యములోఁ దిరుపతివేంకటేశ్వరులకుఁ దీసిపోవుదురను సంశయముకూడఁ బక్షపాతమునే సూచించుచున్నది. రఘువంశమేని సంస్కృతములోఁ బాఠముఁజెప్పలేనివారనియుఁ దెల్గులో విజయవిలాసాదులలో నైద్దాని నేనిఁ బాఠము చెప్పనేరని వారనియు శ్రీవారుపూర్తిగా నెఱిఁగియు నించుమించు భేదముమాత్రమె యున్నట్లు సూచించుటచేఁ గొప్పరపువారు సంస్కృతాంధ్రములలో మంచిసాహిత్యముకలవారే గాని తిరుపతి వేంకటేశ్వరులకు నించుక తీసిపోదురనియుఁ గవిత్వములోఁ బూర్ణముగా హెచ్చుదురనియుఁ దెల్పినట్లు ధ్వనివేత్తలు నిర్ణయింపక మానరు. ఇందులకుత్తరము ముందువ్రాసికొను పత్రికలో వ్రాసికొనఁదలఁచి యిచ్చట శ్రీవారి సహృదయత్వమును మాత్రము వర్ణించుటతోఁ దృప్తిఁజెందుచున్నారము.

5. "ఆ॥ వె॥ వీరికున్నవిద్య వారికిలేకున్కి, హెచ్చుతగ్గులెన్న నెవరివశము

కాన వీరివాదకలన నిరర్థము, హాసభాజనంబు నగుచునుండు. ఈపద్యములోని యుత్తరార్థము చక్కనియర్థము కలయదియే కాని కొప్పవరపువారి నెవ్వరును నవ్వరు. ఈవివాదమువలన వారికి లాభము లేకపోలేదు. తిరుపతి వేంకటేశ్వరులనే ప్రాజ్ఞులుండఱును నవ్వుదురు లేశమును వీరికీవివాదమువలన లాభములేదు. అనునంశమిప్పుడేని శ్రీవారిమదికి వచ్చినచో నిట్లువ్రాయ సాహసింపరని తలంచెదము. వలసినచో నీయంశమును సమర్థింపఁదగు నుత్తరములు కడుఁబ్రాజ్ఞులచే వ్రాయఁబడినవి శ్రీవారిసన్నిధి కంపుకొనుచున్నారము. మఱియుఁ బూర్వార్థమూలో "ఒకరికున్న విద్య మఱియొకరికి లే" దనునంశముకూడ సత్యదూరమైయున్నది. వివేకానంద సన్న్యాసికిఁగల ప్రజ్ఞతిరుపతి వేంకటేశ్వరులకును, తిరుపతి వేంకటేశ్వరులకుఁగల ప్రజ్ఞ "వివేకానందస్వామికిని" లేదనియన్వయించుకొమ్మనినచోఁ జెప్పనేరము కాని కొప్పవరపువారికున్న విద్య తిరుపతి వేంకటేశ్వరులకు లేదనుట కేవలము హాస్యాస్పదము. తిరుపతివేంకటేశ్వరులకున్న విద్యలు కొప్పవరపువారికి లేవన్నచో నేబాలుఁడైనను సమర్థింపఁగలఁడు కాని దీనిని దేవుఁడేని సమర్థింపనేరఁడని మనవిచేసికొనుచున్నారము. వలసినచో ముందు విపులముగా వ్రాసికొనఁదలఁచి యిప్పటి కీపండితరాయల శ్లోకమును జక్కఁగా నర్థముచేసికొండని శ్రీవారినిఁ బ్రార్థించుచున్నారము. (ఇందే 30వ పుటచూ.)

6. "ఆ॥ వె॥ కొప్పవరపువారి గుంటూరువారలు, బిరుదులిచ్చి చాలఁ బెద్దఁజేసి
గప్పడెల్ల నీశతావధానులుగల, రంచువారు మదులనెంచలేదా!

ఈపద్యమున కర్థమే కనుపట్టదు. ఎక్కడనో జమీందారుఁడున్న వాఁడని బీదవానికిఁ బెండిలియే కాకపోవునా! 'గిల్లికిగిల్లే పల్లికిపల్లే' "ఒకని పెండిలిలో మఱొక్కఁడా పల్లకీ నెక్కి యుంకించుటెంతేనిఁ దప్పు." అను సీసపద్యమును జదివికొనఁ బ్రార్థితులు. అదికృష్ణలో నచ్చుగుచున్నది. అంకాలమ్మకు జాతరసేయుచో శివకేశవులు లేరని కాని, శివకేశవుల కుత్సవ మొనర్చువారంకాలమ్మ లేదని కాని యూహింతురనుకొనుట యనుభవవిరుద్ధ మని మనవిచేసికొనుచున్నారము.

7. "చ॥ వరపరవస్తురంగ కృష్ణవర్యుఁడు పండితవేంకటార్యుఁడున్
దిరుపతి వేంకటేశులును ధీరతఁబూని శతావధానముల్
జరిపెడునాఁడు డీకొనఁదలంపరు, వారలపైకి శిష్యులన్
బురికొలుపం దలంప రిటు బుద్ధులులేవొకొ వైష్ణవాళికిన్॥

ఇందుచే దిరుపతి వేంకటేశ్వరులు శిష్యులను కొప్పరపువారి మీఁదికిఁ బురికొల్పి రనుట సత్యమున కుదూరము, వేలూరి శివరామశాస్త్రికి నేముత్తరమేమి వ్రాయలేదనియు, సతఁ డెవ్వరో యెవ్వరికో వ్రాసిన యుత్తరమును సభ్యాదులు వినిపింపఁగా విని దాని సత్యాసత్యములు దెలిసికొనఁదలఁచి సూటిగా వచ్చి నేనుత్తరములఁ వినిపించుచుండగా సభలో మనుష్యులఁగలసికొని నేనని యేమాగురుపాదసాక్షిగ వచించేసుకొను చున్నారము. 'యథార్థవాదులును', 'సత్యవాదులును', వ్రాసినట్లే డాఁ గగూడ వ్రాయఁబూనుట మిగుల సాహసము. శివరామశాస్త్రి కొప్పరపువారికి నన్న నేకవిషయముల మిన్నయని తమకే మెఱుగుదురు. అయినను వివరించెదము. శివరామశాస్త్రికిఁ బాణినీయశాస్త్రమునందుఁ గౌముది పూర్తిగా నైనది. పరిభాషేన్దుశేఖరము చదువుచున్నాఁడు కావ్య నాటకాలంకారములయందుఁ జక్కని సాహిత్తికలదు. చదివినంతలో శిష్యులకుఁ బాఠము చెప్పశక్తి గలదు. తనుమాత్రము సంగీతములోఁ బ్రవేశమున్నది. ఇంగ్లీషులోఁగూడఁ బరిచితి యున్నఁగా ఫోర్తుఫామువఱకుఁ జదివియున్నాఁడు మఱి కొప్పరపువారో! పైఁజెప్పిన యంశములలో లేశమును బ్రవేశము లేనివారు. వలసినచో సభాముఖమునఁ దమరే నిర్ణయింపఁలరు. శివరామశాస్త్రి సంస్కృతమున ధారాళముగాఁ గవిత్వమల్లును. కొప్పరపువారికి దానిప్రసక్తియే తెలియదు. ఇఁక సిరువురకును గలప్రజ్ఞలు:— 1. తెనుగులోఁ గవిత్వము జెప్పుట 2. శతావధాన మొనర్చుట, 3. అష్టావధాన మొనరించుట, 4. ఆశురచన. పైవిషయములలోఁ గూడ నుభయభాషలలో సంపూర్ణశతావధానము నొనర్చినవాఁడు శివరామశాస్త్రి. అసంపూర్ణ శతావధానమును ఒకభాషలో మాత్రము చేసినవారు కొప్పరపువారు ఇకను నిండువెలిఁ బుచ్చఁదగిని వనేకరహస్యములు కలవు. అవి యటులుండుగాక. వ్యస్తాక్షర్యాగలు గల యష్టావధానమును జేసినవాఁడు మొదటియతఁడు. మనిపూని నేరేడు కాయను జేసినవారు రెండవవారు, ఇఁక మనకు మిగిలినదా యాశుధారాశంసనము. వారి యిష్టవచ్చినట్లు చెప్పనిత్తురేని ఆతనినే కాక యెవ్వరినైనఁ గొప్పరపువారు ప్రశంసింపుదురని తమకుంబోలె మాకును నమ్మకము కలదు; కాని ఆయాశుధారాకవిత్వమును గూర్చియు కొన్ని సంశయములు కలవు. అష్టాదశవర్ణనలను గొనియుంచుకొని, వానిని సమయోచితములుగాఁ గల్పికొని తాతాత్కాలికముగా నేవో కొన్ని పద్యములు మాత్రము చెప్పఁగూడదా? అట్లు చేయకుండ భగవంతుఁడేని వారింపఁగలఁడా? ఇది యటులుఁ

ంగాక. భిన్నభిన్నవస్తు వర్ణనములలో వీరికిట్టియాశుధార ప్రసరించునా? అం వీ రాశుకవులని పేరుగల యెవరినేని నతిక్రమింపఁగలరా? అతిశయింపనిచో ్రివారు పైనిజెప్పిన కాపట్యమును నమ్ముదురా? ఇఁక నొకటి, అవ్యాజరచన ు యనుకొందము. అందులక్షణముతప్పకుండునా? సందర్భముండునా? ఇదియు ప నుండుఁగాక. వీరునిజముగానే సలక్షణముగానే గంట కయిదునూఱులు పద్యములను రచియింతురుగాక! అప్పుడేని శివరామశాస్త్రి నతిక్రమించినవారగుదురా? శివరామశాస్త్రికిఁగల ప్రజ్ఞలలో నేకదేశమంటు మాత్రమే యతిశయించువారుశివరామశాస్త్రికి గురువులమగు మామీఁదఁ గాలుద్రివ్వ మీసములు గొఱిగించెదమని వ్రాసినవ్రాఁతకు దేవరహృదయము సంతసించి, యద్దానికై పరితాపమందు శివరామశాస్త్రి తనకంటె ననేకవిషయములలోఁ గేవలము తెలియనివారును నేదో విషయమున నేకదేశమున నతిశయించువారును నగు కవీశ్వరులను విద్యావివాదమునకుఁ బిల్చుటకు మిగులఁ జంకిల్లుచున్నందులకు మావిచారము పట్టఁజాలకున్నారము. ఇంకను నీయాశుకవనమునుగూర్చి విశేషించి వ్రాయవలసియున్నను, అది యన్యత్ర విస్తరించియుంచుటచే నిందుపేక్షించి, శివరామశాస్త్రి కొప్పరపువారికై కేగుటగూడఁ గొప్పరపువారికే గౌరవప్రదమనియు శివరామశాస్త్రికిలేశమును గౌరవావహము కాదనియు నతఁడు మాప్రేరణచే రాకయున్నను దమవంటి సత్యసంధులు నిర్ణయించు విధానమునుబట్టి అదికూడ మానెత్తికే వచ్చుటచే నందులకు మేమువిధిలేక సమ్మతించుచున్నారమనియు, మనవిచేసికొనుచున్నారము. ఎవరుగాని యెవరితోనేనిఁగాని యుద్ధమునకో విద్యావివాదమునకో కడంగునప్పుడన్నివిషయములును నుభయులకును సమానులుగా నుండవలయునే కాని ఏదో యేకదేశముమాత్రమే యున్నవారొకరును, వేఱొకరనేక విషయము లెఱింగినవారునునైనచో నాయెదిరింపుగాని జయింపుగాని హాస్యాస్పదమనియు విన్నవించుకొనుచున్నారము. చతురంగ బలములుగలశ్రేణితో నొకపదాతివర్గము మాత్రమేయున్న ముఠాదారు తనంతదానై యెదిరింప నెంచుచు "మీరు మీకున్నగజాశ్వాది సైన్యమును దీసికొని రావలదనియుఁ బదాతివర్గమునుమాత్రమే తీసికొని రండనియుఁ" గబురంపినచో దమవంటివారయ్యది విశ్వసింపరని మానమ్మకము. తరువాతఁ దమచిత్తము.

ఇఁక వైష్ణవులు తిరుపతివేంకటేశ్వరులపై డీకొనఁదలంపరనుమాట కుత్తరము చిత్తగింతురుగాక. గద్వాలాదులలో విద్యావివాదము తటస్థించినదని శ్రీవా

రెత్తికొనియును మరల నీవిషయ మన్యథాగా వ్రాయుటచే గద్వాలలో జరిగిన యంశమును బరిశీలింపకయే వ్రాసిరనుకొనవలసివచ్చినది. గద్వాలలోనేమి, ఆత్మకూరిలోనేమి, మమ్మెదిరించినవారు శ్రీవైష్ణవులే, వారిప్పుడు సజీవులైయున్నవారు. ఆవివాదమునకు వైష్ణవత్వ స్మార్తత్వములే ముఖ్యహేతువులు. వలసినచో నాసంస్థానాధిపతుల పేరం దాము వ్రాయించినచో వారు యథార్థమును దెలుపకపోరు. ఒకభేదము మాత్రము లేకపోలేదు. మేము నియోగులము కాక అంతో యింతో ఆంధ్రకవనము గూడం జెప్పుచుండుటచేతను. ఈగుంటూరిమండలములో విశేషించి నియోగి మహాజనులుండుటచేతను, గొప్పరపువారీసీమలో నియోగిగ్రామణులగుటచేతను, వారితో సహాసనమును విద్యావిషయమున మేము సభ్యులతోపాటుగను, అగ్రాసనాధిపతితోపాటుగను నంగీకరింపని హేతువుచేతను వారికిని మాకును వాదిప్రతివాదిభావము గల్గుటయుం దమయంతి ప్రాజ్ఞు లుభయులను సరిచేయనెంచుటయు, హెచ్చించుటయుం గుంచించుటయుం దటస్థించినవి. కాని యేహేతువుచేతనో తారతమ్యవివేచనకై సభ మాత్ర మీసీమను గాలేదు. అక్కడ నట్లుగాక మామాభేదములను సభాముఖమున నాసంస్థానప్రభువులు తేల్చి సమ్మానింపంబడగు రీతిని సమ్మానించి పంపిరి అందుకుం గారణము మమ్మెదిర్చినవారు పండితులగుటచేతనని దేవరచిత్తమునకు రానివిషయము కాదు. కాన నింక విస్తరింపందలంపక యింతటితో విరమించుచు నీక్రిందివిన్నపమును జిత్తగింపం బ్రార్థించుచున్నారము. "

మ. రా. రా. శ్రీ, శ్రీరాజా మంత్రిప్రగ్గడ భుజంగరావు బహద్దరు జమీందారువారి దివ్యసముఖమునకు, తిరుపతి వేంకటేశ్వరులు వినయపూర్వకముగా వ్రాసికొను విజ్ఞాపనము.

ఆర్యవరా !

తమంతటం దామే యేదో ప్రసక్తిం గల్గించుకొని "వివాహమహోత్సవాశీర్వచన పద్యరత్నావళి యందలిపీఠిక,, యనియుచ్చాటించి ప్రకటించినపత్రికలో మాకును గొప్పరపుసోదరులకుంగల తారతమ్యమును నిర్ణయింపంబూనుటచే నేము మిగుల ధన్యులము. మాకును సోదరకవులకును విద్యావివాదమేసభలోం గల్గినదో యెందులకుం గల్గినదో ఆవివాదమునకుం గారకు లెవ్వరో ఆయాయంశములను దామాసభలోనే దయచేసియుండుటచే బూర్తిగా నెఱుంగుదురు 'యథార్థవాది' సత్యవాది, నామముల నవసరమునుబట్టి ధరించినసోదరులుగూడ నాసభలోనే వారే

యైనను వారు వ్రాసిన వ్రాఁతలయందలి విషయములకేవిధమయిన ప్రత్యుత్తరము నొసంగఁజాలక నిజమెట్లు బయటికివచ్చునురా! భగవంతుఁడా! యనినిత్యమును బరితపించుచు, మాకుఁ గలయావత్కార్యములను వదలుకొని, జీవనోపాధియగు నుపాధ్యాయపదవి, యాస్థానవిద్వత్త్వయను వానిని లక్ష్యింపక సుమారు రెండుమాసములనుండి యీగుంటూరునఁ బడియున్న మాకు దేవరవారిపత్రిక యెంతో సాయమొనర్చుచున్నది! * ఇట్టితారతమ్యము నకు నిజముగాఁ దమవంటి విద్వత్ప్రభువులే తగిన వారు. మావ్రాయు నంశము స్తుతిమాత్రము కాదనుటకు నీక్రిందిపద్యము నుదాహరించు కొనుచున్నారము.

"సీ॥ అష్టావధానము నాచరించితి నేను సంస్కృతమ్మును గొంతఁ జదివియుంటి
నాటకమ్ములు వచనములు ప్రబంధముల్ నవలలు మున్నుగా వివిధకావ్య

---

* తెరువ్యాలార! గుంటూరుపురమునం దిదివఱకు రమారమి రెండుమాసములనుండి కింకవీంద్ర ఘటాపంచానన నాది బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులకును, మ-రా-శ్రీ కుండినకవి హంసేత్యాది బిరుదాంచితులగు కొప్పరపు సోదరకవులకును, జరుగుచున్న కలహము సర్వజనవిదితము. కాని, గుంటూరు పురవాసులు విద్వత్కవిసభ నొకటేర్పరచి దానియందున శ్రీతిరుపతి వేంకటేశ్వరులను, శ్రీకొప్పరపువారిని రావించి విద్వజ్జన సమ్మతముగ వారివారి సామర్థ్యమును బరిశీలించి గౌరవించక పోవుటచే నాకవులకలహము నానాఁటికి నభివృద్ధిగాంచుచున్నది. దీనితోపాటు హిత, సత్య, యథార్థ, వాదులసంఖ్యయు హెచ్చుచున్నది. మఱియు నిప్పుడిప్పుడసంబద్ధప్రసంగములుగూడఁ బెరుఁగుచున్నవి. ఈపైవిషయము లాంధ్రపత్రికా చదువరులకెల్లరకు విశదమైయుండవచ్చును. ఈకవుల కలహమును మాన్పవారొకరును గన్పడరైరి. గాని, బొంబాయియందుఁ బ్రచురింపఁబడు నాంధ్రపత్రికామూలమున బ్ర॥ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరులు శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దర్ జమీందారుగారిని కవిపండితసభ నొకదానిని గావించి, యాసభకు మమ్మును, కొప్పరపుసోదరకవులను రావించి, మామావిద్యాసామర్థ్యముల విద్వత్కవి సమ్మతముగఁ బరీక్షించుటకుఁ దగినవారని 1-11-1911 తారీఖున కోరిరి. ఇది సమంజసమని ముమ్మాటికిఁ జెప్పతీరవలయును. శ్రీరాజాగారును విద్వత్కవికుంజరులగు తిరుపతి వేంకటేశ్వరుల విజ్ఞాపన నాలకించి యొకపండితసభ గావించి శ్రీకవిద్వయము గలయును రావించి, వారిచే వీరిచే శతావధానముల జరిపించి, విద్వత్తల్లజాభిప్రాయానుసారముగ నెవరు జయమొందుదురో ఆజయము నాంధ్రపత్రికలద్వారా తెలియఁబఱచిన యెడల నీకవుల కలహవిషయమై యనవృతప్రవాహులై కవులకంటె రెండుపాళ్లెక్కువగాఁ బ్రయాసపడుచున్న యీహిత, సత్య, యథార్థ, వాదులకొకింత విశ్రాంతినిచ్చినవారగుదురు శ్రీతిరు

విరచనఁ జేసితి నిరుపమానంబగు కవితారసాస్వాదకలనఁ గంటి
గ్రంథమ్ములను బెక్కుఁ గాంచితిఁ బండితకవులతోఁ జెలువాఱఁ గలియుచుంటి.

పైపద్యమువలనఁ దాము మాయుభయుల తారతమ్యమును సభాముఖమున నిర్ణయింపఁ బూర్ణముగా నధికారము గలవారని మానమ్మకము మేము వైదికులమయినను దాము నియోగులైనను బక్షపాతముండదు సూచనలు తమపత్రికలో నియశములు చెప్పుచున్నను మేము తమసన్నిధి నీయంశమును సభాముఖమునఁ దేల్చుకొనఁ బ్రయత్నించుచున్నారము. కాని యీగీతము కొంత సందియము నాపాదించుచున్నది.

గీ॥ "కానియీగతివాదముల్ గాననైతి, విబుధవరులార! నాదొక్కవిన్నపంబు
ఇచ్చదీరంగఁ బోరులఁ గ్రచ్చుకొనుఁడు, దానిఫలమెద్దియో దయఁబూనిచెప్పుఁడు

ఈరీతివివాదములు తాము కాంచలేదనుటయొప్పిదమే గాని "పగులఁగొట్టించి తుద్భటవివాదపాళి గౌడడిండిమభట్టు కంచుఢక్క" ఇత్యాదులు పూర్వపండితులకును నిట్టివాదములు కలవని ఘోషించుచున్నవి. ఒకవేళఁ దాము "ఈరీతివాదములనఁగా, ఇట్టియసమానకక్షలని వ్యాఖ్యానము చేసినచో మేమొసఁగు నుత్తరము లేదని నిశ్చయించుకొనుచున్నారము. ఈవిద్యావివాదమునకు ఫలమేమని సెలవిచ్చియున్నారు. పూర్ణమైనఫలము కలదు. ఎట్లందురా? కవిత్వమన నెట్టిది? ఆశుకవనమన నెట్టిది? ప్రబంధకవనమన నెట్టిది? కవికిఁ గావలసినసామగ్రియెట్టిది? సామగ్రిలేక కవిత్వము చెప్పఁబూనుటయెట్టిది? అతనిని గవియనవలయునా? వేఱుపేరఁ బిలువవలయునా? అందులకుఁ బూర్వలాక్షణికు లెట్టిపరిష్కారములను జేసియున్నారు? ఎవరెవరి నెదిరించుటయుక్తము? ఎవరివాగ్ధాటి శుద్ధము? ఎవరిది కాదు? ఎవరిని బండితులొప్పుదురు? ఎవరి నొప్పరు? న్యాయమేది? అన్యాయమేది? అనునంశములు వీనివలనఁ దేలును దానిపై నింక నెవ్వరును నిట్టికాలుద్రవ్వుటలును, ఇట్టియనవసరపు టాసనచర్చలును సలుపకుందురు. ఇట్టిఫలమున్నది గాన నివియెం

---

పతి వేంకటేశ్వరుల మనవి నాలకించి యటులఁ జేయుటవలన వారికి నుతిపాత్రులగుదురు; మఱియు లోకమునకంతకును నిజము దెల్పినవారగుదురు. కావున శ్రీరాజాగారు త్వరితముగా నొకవిద్వత్సభ గావించి వారివారిసామర్థ్యములను లోకమునకుఁ దెలియఁబఱచి సంస్తవనీయులు కాఁగలరని కోరుచున్నాను. (చిపుకుల-అప్పయ్యశాస్త్రి, సికందరాబాదు)(1911సం॥ 11నవంబరు ఆంధ్రప్రకాశికనుండి)

దులకని విద్వత్ప్రభువులు నిరసించుట కపులకుర దృష్టమనుకోవలెనని వచ్చుచున్నది. కేవల ముపనిషత్తులనుబట్టి తామెవివాహములకును ఐక్యమును గల్పింపఁదలఁచనిచో ననవసరముగా నీయంశము నెత్తికొని, మాలోమేమేట్లో సరిపెట్టుకొని మిన్నకయెవరియూరికైనను పోవలఁచుచు నేవో కొన్ని గంటిభాగవతము లావల్లైన ఆవల్లైనజరుపుకొనుచు వారిచ్చిన ద్రవ్యమును సంపాదించుకొనుచున్నయెడ నిందఁబేకొని తారతమ్యనిర్ణయము వలఁగడంగుటయే యుక్తముకాదు. కలుగఁ జేసికొనుటకొప్పితిరేని యనుగ్రహించినప్రాముఖ్యమున మా తారతమ్యములను బండితసమస్తమునఁదేల్చి యీకాలమునకు విక్రమార్కులో భోజులో యను నద్యశమును వహింపఁబ్రార్థితులు. ఇది వైదిక నియోగికప్రాముఖ్యమునకు గాఁ గల్గినట్లు తాముతమ పత్రికలో సూచించియున్నారు. అదిసత్యమేయైనను (మేము నియోగులమొదల ద్వేషభావము లేనివారక మనునంశము నావల్లీన్యాయవాదులవలన దేవర వారి మంజూవాణీ పత్రికయే ప్రకటించియున్నది. గాన సందేహమునకు తెలుపు. కనుక నిందుమేము దిదర్శింపక వదలుకొంటిమి) ఎట్లో దేవరయనుగ్రహించి మాతారతమ్యములను సభాముఖమునఁ దేల్పఁ బ్రార్థించుచు నిందలితప్పులను మన్నింప వేఁడుకొనుచున్నారము.

గుంటూరు
18-10-1911

ఇట్లు విధేయులు,
తిరుపతి వేంకటేశ్వరులు.

---

చ॥ అతని నుతింపఁగా వలదె యక్కట! శాఖను నిట్లు రెండుగా
నితగఁ బ్రయత్నముల్ సలుపువేళ యథార్థము పత్రికన్ వను
చితగతి వ్రాసి యుందఱను సిగ్గు ఘటిల్లఁగఁ జేసి సర్వస
మ్మత మగుతీర్పు దొర్కి బుధమాన్యత గన్న సుదర్శనీశ్వరుల్॥ ౨౧౫

ఉ॥ సాహస మెంత చేసెను ససాధ్యుఁ డతండు స్వశాఖవారు ని
ర్వాహకులై మహామహులు బ్రిమ్మని దిమ్మగ దిమ్మ బ్రమ్మగా
ద్రోహప మాచరించునెడ "ద్రోహము గూడదు తే" ల్పటంచు సం
దేహము వీడి వ్రాసెఁదన తెంపు బుధుల్ వినుతింపుచుండఁగన్॥ ౨౧౬

ఉ॥ పక్షముఁ బూని వ్రాయుతమ బంధులు వ్రాఁతలనెల్లఁ బూర్తిగా
శిక్షయొనర్పఁ బాలెడివిశేషములం బ్రకటించి పత్రికా

ధన్యత సార్థకంబుగ యథార్థముఁ బట్టి చరించినట్టి యా
ఁపక్షయసూనృతాత్మునకు నంజలిసేసిన నబ్బుఁ బుణ్యముల్॥ ౨౧౮

ఉ॥ సత్యము వ్రాయఁ జొకరుఁడు శాఖకు లోఁగుటఁజేసి పత్రికన్
దౌత్యము సేయఁగాఁ దొడఁగె దారిని దప్పి యిదేమి! యెంత దౌ
ర్గత్యము దాపరించెఁ గలికాలమహత్త్వముఁబట్టి యంచు నా
నిత్యము చింత సేయు నెడ నీతికి నీతఁడు నిల్చె నొక్కరుఁడున్॥ ౨౧౯

కం॥ కల రెందఱోని లోలో,పల "నది యన్యాయ" మనుచుఁ బలుకుని యోగుల్
ఫలమేమి పయికి రాకొగిఁ, జెలఁగి పలుకి వచ్చె నొక్కఁ శివశంకరుఁడే॥

సీ॥ "కస్తూరి" యనుసమాఖ్య వహించినట్టి యాతనియింటికిఁ బ్రశస్తి తనరఁగాక
"శివశంక" రాభిఖ్యచే నెసంగెడి యాతఁ డనుపమప్రఖ్యాతి నందుఁ గాక
తన పేరు సార్థకత్వము దాల్ప నితనిపత్రిక "సుదర్శని" పేరు దెచ్చుఁ గాక
త్రికరణశుద్ధిగా దేవుఁ డుండుట యెఱింగిన యాతనిమనంబు మనెడుఁగాక॥

తే॥గీ॥ ఇతనిఁ బ్రాఁత యాచంద్రార్క మెల్లబుధుల
మెచ్చునకుఁ బాత్రమై పొరపొచ్చెములను
బెట్టి వ్రాయువారిఁ దలచెంపపెట్టుగా ను
దాహరించెద మంబ! ప్రత్యక్షరంబు ౨౨౦

(సుదర్శనీ పత్రికనుండి.)

## తిరుపతి వేంకటేశ్వర కవులు.

ఆహా! కష్టించి గురుకులవాస మొనర్చి పాణినీయ వ్యాకృతిపవిత్ర మయిన యున్నతవిద్య నభ్యసించి యుభయభాషా నిరాఘాటసాహిత్యముతోపాటు బహువిధ విచిత్రావధానసహితానవద్య హృద్య సద్య శ్శతఘంట కవన గదనాధురంధరులై యనేక సలక్షణ ప్రబంధనాటకాది సద్గ్రంథ నిర్మాతృశిరోమణులయి వివిధవిద్వత్సభారంగాభంగవిజయశుభంగభావుకులయి యాంధ్రదేశంబున నేకవీరులై విరాజిల్లుచున్న శ్రీ తిరుపతి వేంకటేశ్వరులకును గొందఱిచే గర్వోపసంహరనీతిబోధలు! వేదాంతోపదేశములు!! ఔరా!! ఏమి కాలకర్మము!

దైవమిచ్చిన మాత్రపుజ్ఞానముతోఁ గొప్పవరపువారు శతావధానులమని బ

యలుదేరి వారిత్రోవను వారు పోవుచుండఁగా మధ్యఁ గొందఱు గలహాశీలురు వారినిని తిరుపతి వేంకటేశ్వరులను నొక్కచోఁ జేర్చి యందు "పక్షపాత గౌరవసూచనమునకో" యనునట్లు వారిసన్నిధిని వీరికాసన మిచ్చుటయు "న్యాయమును బట్టి విద్యావిషయమున మాత్రము మాతో సమానముగా వారికాసనము (సీటు) నీయఁగూడ"దని తిరుపతివెంకటేశ్వరులన్నందుపయిని వారును వీరును గలసి యా తిరుపతి వెంకటేశ్వరులను నానావిధముల ధర్షించుచుండుటయు దానికిఁ దాళములు వేయుచుఁ గొందఱు ప్రముఖుల మనిపించుకొనువారే తమ విద్యాతారతమ్య వివేకిత్వము నొకమూలఁద్రోసి కేవలగతానుగతిక సేవ్యము లయిన పక్షపాతాదులనే పురస్కరించుకొని "తిరుపతి వెంకటేశ్వరులు సభారంగమున వారినట్లు తృణీకరింపరా"దనియు "నెవరియంతటివారు వారనియు" నిత్యాదినీతివాక్యములు వ్రాయుచుండుటయు నందున కాకవికుంజరు "లట్టిసబబులు చెప్పుటయన్యాయమో" యని వారికి వారికి వంగివంగి సలాములు చేయుచు విన్నపము లంపుకొనుచుండుటయుఁ జూడ నీప్రాంతముల సత్పాండిత్య ప్రాభవమునకు దిక్కులేకుండఁ బోయినదనుట కావంతయు సందేహము లేదు.

ఏపత్రికలోఁ జూచినను యథార్థవాదులే! న్యాయవాదులే! గర్వము కూడదనువారే! స్వాతిశయము వలదనువారే! నీతులవ్వారిగఁ గురిసిపోవుచున్నవి గదా! అబ్బ! ఈనీతులెవ్వరికి రావు? యివియొకరి కుపదేశించుపట్టుల లోకసామాన్యములే యయిపోయినవి! అయినను ఇంతటి మహాపరాధము వీరేమి చేసిరి చెప్పుమా? కొప్పరపువారు విద్యాసభారంగమునఁ దమతో సమానగౌరవమును బొందుటకర్హులు గారనుటయా? మేలు!

ఇదియొక తప్పుగా విద్యాస్వాతంత్ర్యాభిమానులెవ్వరును ఎంచఁజాలరు. ఏమనఁగా? మల్లురెట్లు పరమల్లుల బలాధిక్యమున కంగీకరింపరో యట్లే విద్యావల్లులుగూడ వివాదవిషయము వచ్చినప్పుడు మాత్రము పరుల నిర్వ్యాఖ్యప్రజ్ఞలనే యంగీకరింపరు. అట్టియెడ సామాన్యప్రజ్ఞ నంగీకరింతురా? మధ్యస్థులగువారే వారివారి తారతమ్యములను గనిపెట్టియర్హ గౌరవములీయవలసియుండెను. అట్లు జరుగనప్పుడు వారే కలుగఁ జేసికొని తమ తారతమ్యములను దెల్పుకొనవలెను. అట్లుగాక, వారునూరకొని వీరునూరకున్నచో నిఁక సద్విద్యాపరిశ్రమ మొక్కతారతమ్యము లెట్లు గమనింపఁ బడును?

ఈసాత్త్వికనీతు లుపదేశించు సాధువులు, యిట్టిసంగతులలో నాత్మదృష్టాంతముల నిచ్చికొన్నచో లెస్సగఁ దెలియఁగలరు.

కష్టపడి గురుకులవాసము చేసి, యథాశ్రయన బ్రహ్మచర్యము నాచరించి యఫ్ యే, బి, యే, పరీక్షలనిచ్చి యనేకములయిన లా గ్రంథములు చదివి యర్థాధాటితో ధర్మశాస్త్రచర్చానిబద్ధమయిన న్యాయవాదము చేయు నొకప్లీడరుగారు, పొట్టచింపిన ను ఇంగ్లీషుముక్క లేక తెలుఁగైనను బూర్తిగా నెఱుఁగక లాయన నేమియో తెలియక కాలకర్మవశమునఁ బట్టువడిన శ్రుతపాండిత్యమునుబట్టి గంటునపందలకొలఁది యర్థములేని బండయుక్తులను బ్రయోగించి వాదించు నొక వెట్టిక్రిందివకీలుతో కోర్టులో సమముగా గౌరవింపఁబడునప్పుడాతనిఁ జూచి యెట్లు సహింపఁగలరో యూహింత్రుగాక.

ఎంతో చాతుర్యముగ, యుక్తియుక్తముగ రసపోషణముగ సలక్షణముగ ధ్వంస్యార్థముగ సర్వోద్వేగముతో గద్యపద్యసంహారాది వ్యాసములు వ్రాయు నొక పత్రికాధిలేఖకుఁ డగుగారు, ఇవేవియును చేతగాక ఊరకయేవో పాడిపాటలను అపశబ్దకాపభ్రంశములతో గంటకు దస్తాలకొలఁది బరుకఁ గలఁడనునంతమాత్రమున నొకనిం దెచ్చి తనతో సముని జేసి కూరుచుండఁ బెట్టినప్పు డెట్లుకొలుకొలుపాడునో యోజింతురుగాక.

ఒక భాగ్యశాలిగారు, వివాహాదులయందుఁ గాని యన్యత్రగాని సామాన్యజనుల పంక్తియందుఁదాము గూరుచుండక రాజబంధుపంక్తియని "కేటాయింపు,, గా వేరొకపంక్తి తీర్పించుకొని తముతో సమానులయిన రాజబంధువులతోడనే కూరుచున్నప్పుడు సామాన్యజనులనాపంక్తిలోఁ గూరుచుండఁ బెట్టిన నెంతయాగ్రహము వచ్చునో పరిశీలింతురుగాక.

ఇట్టిప్రతివారును ఆత్మదృష్టాంతముల నిచ్చుకొందురేని సుశిక్షితవిద్యాబలధౌరేయులయిన తిరుపతివేంకటేశ్వరులకు శ్రుతపాండిత్యముచే సేవలమునుగా పామరజనమాత్రరంజకంబయిన యాశుకవిత్వశపదం బొందుదారిడిగి కొనివచ్చినవాని కొనుతమతో సమగౌరవము నొందునప్పుడు వారితల యెంత వంటగించుకొనునో తెలియఁగలరు.

అనేకులు తమకుఁ దెలిసినది స్వల్పమయినను దమకన్న ననేకగుణముల మిన్నలయినవారినే గడ్డిపరకలవలెఁ దిరస్కరించుచుందురు, అట్టిసంగతిలో సం

పూర్వవిద్యాబలపట్టితులయి రెండువైపులను వాఁడిగల్గి చికిలిచేసిన కత్తులనఁజెల్లు తిరుపతివెంకటేశ్వరులు తమకున్న యనేకగుణములఁజిన్నలయిన కొప్పరపువారిని విద్యాసభారంగమునఁ దమతో సమానగౌరవమునఁ జూడఁదగదనుట తప్పయినదా? వారుకల్పించి చేసినవిద్యాపరిశ్రమ యంతమాత్రపుటుపకారమునకైన నెంచుకొనలేదా?

ఎవ్వరినేని తిరస్కరింపఁగూడదనుట సామాన్యధర్మమే. కాని యొకరికొక్క స్వడు విశేషధర్మముగా నట్లు తటస్థించకమానునా?

ఉద్యోగస్థులసుజాముఁడు. ఎవరికైనను ఉన్నతోద్యోగమిచ్చినప్పుడు, అంతకుఁదగిననైపుణ్య (క్వాలిఫికేషన్సు) గుణములుగలవారు "ఆయుద్యోగమాతనికీయఁగూడదనియు నతనికన్నఁ దన కెక్కువగుణములున్నవిగనుక, ఆగౌరవము తనకేయిప్పింపవలె" ననియుఁ దగవులాడుదురు. అప్పుడీయుపనిషన్మతమవలంబింతురా? వేదాంతమవలంబించుటయే ప్రధానమగునెడల సభలును విద్వత్పరీక్షణములును గౌరవములును ఆశింపక తమమానరించుకొనుచుఁ గూరుచుండుట లెస్స. అవి కావలెనివచ్చినప్పుడు తారతమ్యగౌరవములును వెంబడినే కావలసియుండెను. ఇప్పటిజమీందారులు కొందఱు విద్వత్సంభావనలిచ్చుపట్టుల నీయుపనిషన్మతమవలంబించి సమముగా సంభావనలిప్పించరాదా! ఒక్కరికి రు111లు మఱియొకరికి పట్టి రు11లు నీయనేల? కావునఁ దారతమ్యముగమనించితీరవలెను. తిరుపతివేంకటేశ్వరులు సత్యముపలికిరి. "మాకున్నవిద్వజ్జ్ఞలు వారికిలేవు గనుక వారిప్పట్టున మాతో సమముగాఁ బండితాసనమును స్వీకరింపఁదగ" దనిరి- ఆసంగతి సత్యమో కాదో విజ్ఞులు తామ ప్రత్యేకముగ సభఁజేయించి నిర్ధారణము సేయలేకపోయినారా? అట్టితారతమ్యవిచారణసభ కెవ్వరు రారో, వచ్చియెవ్వరుడీల్పడుదురో, వారి నప్పుడే నిరసింపవచ్చునుగా! పత్రికలలో నీసడించి వ్రాయవచ్చునుగా!

గుంటూరుపురవాసులెవ్వరిదౌర్బల్యమునకు రహస్యముగ వెటుచిన్నాయీ సభఁజేయింపరైరి. అట్లుజరిగినచో, ఇంతమంది కీర్తాంతలశ్రమలేకుండ నప్పుడే తేలిపోవును. అట్టిభాగ్యమెప్పటికైనఁగలుగునా? అదిగాక మనవారుకొందఱు చెప్పినట్లు గౌరవాభిమాననిర్వహణమే యక్కఱలేనియెడలఁ గొప్పరపుశర్మగారు సభవారందఱితోపాటు నేపక్కనో కూరుచుండక ప్రస్తుతాసధానులతోపాటు సమానముగఁ గూరుచుండ నుంకించిన దెందుకొఱకుని స్వగౌరవప్రకటనకొఱకు-

తరువాత తిరుపతివెంకటేశ్వరులట్లు వారిని జూచుచుండరాదనుట యెందుకొఱకు? తమ నిరుపమాన విద్వత్కవిపట్టగౌరవము నిల్పుకొనుటకొఱకు. తరువాత వీరినివారు "మీసములు దీయించెద"మని రణోన్ముఖులగుట యెందుకొఱకు? స్వగౌరవము నిల్పుకొనుటకొఱకు. కొందఱప్పుడు కొప్పరపుశర్మగారిని ముందుగూరుచుండఁబెట్టుటయును, ఇప్పటికిని ముందునకుఁ దేఁజాలుచుండుటయు నెందుకొఱకు? స్వజాతిగౌరవముకొఱకు. వేయునేల? యుక్తిప్రయుక్తులను బ్రయోగించుచు నిట్లు గంభీరవ్యాసములు వ్రాయుచుండుట యెందుకొఱకు? ఒకరికన్న నొకరు మిన్నలన్న గౌరవముకొఱకే. కావున నట్టి గౌరవము కుంఠితమగుచున్నప్పుడు మన శాంతిమంత్రములు! పాఱవు.

కొప్పరపువారు స్వశాఖవారని గౌరవము మనకున్నప్పుడు మన యిండ్లకు వచ్చినప్పు డెగువపీఁటలును దిగువపీఁటలును వేయుదుముగాక. సంబంధబాంధవ్యములు నెఱపుకొందుముగాక. అంతియకాని యీ మమకారమును బురస్కరించుకొని విద్వత్ప్రకాండుల నీసడించవచ్చునా?

ఇంతవఱకు వ్రాసినంతలోఁ గొప్పరపువారి నెంతయు గణించుట లేనట్టుల కనఁబడుచున్నయది. కాని, సత్యముగా మాయభిప్రాయమది కాదు. విద్వత్కవిప్రకాండులగు తిరుపతివెంకటేశ్వరుల ద్వారమున వీరి నిటు తగ్గించవలసివచ్చినది గాని లేనిచో, దేనియందలి యసాధ్యతచే యతి కుదిరినఁ బ్రాసకుదురకయుఁ బ్రాసకుదిరిన గణముకుదురకయు, తొంబదితొమ్మిది నిఘంటువులు ముందువేసికొని పెద్దపెద్దకవులమనిపించుకొనువారే యొక్కపద్యము వ్రాయునప్పటికి మూడుముంతలనీళ్ళు ద్రాగి, గ్రుడ్లు మిణుకరించుచుందురో యట్టి పద్యకవిత్వము గంగాప్రవాహమట్లు అశ్రమముగా, నానుధారను వర్షించునట్టి శ్రీకొప్పరపుకవి సోదరులు దేవతాసమానులనుట కావంతయు సందేహము లేదు, మనకందఱకును వారు పూజ్యాతిపూజ్యులే కాని, తిరుపతివెంకటేశ్వరులకొక్కయడుగు వెనుకనే యుండకతప్పదు. ఏమనఁగా? వీరికున్న యాంధ్రభాషాకవిత వారికిని అర్గళధాటితోఁ గలిగియుండుటగాక విశేషించి విద్వత్ప్రజ్ఞ లెక్కువైయున్నందున వారికి వీరిలక్ష్యము లేదు. అదిగాక సత్కావ్యరచనము చేసినప్పుడే కవియనఁదగినది. కొప్పరపువారొక్క గ్రంథమునైనఁ బ్రకటించలేదు. తిరుపతి వెంకటేశ్వరులు పంచమవేదమును దృశ్యప్రబంధ మొనరించి యాంధ్రదేశమునకు మహోపకారము నర్చిరి, మఱి

యునైన్నే నిసత్ప్రబంధములను రచించిరి వారొకవేళ నొక్కొక్క శాస్త్రమునం బరమావధిప్రజ్ఞులుగల మహాపండితకుంజరముల కొక్కింతజంకిన జంకుదురేమోకాని తక్కినవారికి దుర్నిరీక్ష్యులు. మనము నాలుగు ముక్కలు వ్రాయఁగల్గుదుముగదాయని యేమేమో వ్రాసినంతమాత్రమున వారి తేజము కొఱంత పడునదికాదు. ఎంత వ్రాసినను ఇంతే, పరమార్థమొక్కటి వినుండు.

చ॥ పనిగొని వంతగించి ఘనవాతపరంపర లొక్క పెట్టు నే।
దిని వడివీవఁ శైలమయదీపిక లాఱిన నాఱుఁగాక శో
భనఘనకాంతి విస్ఫురదభంగదగద్ధగధాళధళ్యస।
న్మణిమయనిత్యనిర్వికృతి మంగళదీపిక లాఱిపోవునే॥

పత్రికాధిపతులందఱును దయయుంచియీవ్యాసమును దమతమ పత్రికలలోఁ బ్రకటింపఁ గోరుచున్నాఁడను. వ॥ అ

---

(1912 సం॥ అక్టోబరు 1 వ తేదీ సుదర్శిని పత్రికనుండి.)

కవుల కయ్యములు,

మనోరంజనీ పత్రికాధిపతిగారికి విన్నపములు:—

మిత్రమా! లోకమందఱకును ఎవ్వరును హితులుగాఁగ కొందఱికి కిష్టులును గొందఱికి కనిష్టులు నగుట విధాయకము. లోకానంద సంధాయకుఁడైన కళానాథుఁడే కొందఱిచే బ్రువ్వఁదిట్టఁబడుచున్నాఁడు. చూడలేదే? ఇది విహితంబు. కాని, మనమందఱమును భాషాసేవ సేయుచున్నవారము. సరస్వతీ కటాక్షవీక్షణములకై సర్వదా ప్రతీక్షించుచున్నవారము- కావున సారస్వతద్రోహచింత మనకు స్వప్నమందును లేకుండునుగాక! చంపవచ్చిన వాఁడయ్యును నిక్కముగు విద్వాంసుఁడయ్యె నేనియాతఁడు విద్వాంసుఁడు గాఁడని యనకుందుముగాక. విద్వాంసులపాదరజస్సును శిరముల ధరింతుముగాక! ఎందువలననీ" విద్వాన్ సేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం, నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనాం" అనునట్లు పండితుని పరిశ్రమము, తజ్జ్ఞాలసులకుఁగాక యితరుల కెట్లు తెలియును? దుర్భరమైన ప్రసవవేదనము, వంధ్య(పిల్లలుకలుగనియామె) కెట్లు తెలియును? తిరుపతి వేంకటేశ్వరులకును కొప్పరపు వారికిని జరుగుచుండెడు ఘర్షణములో నంద

అయినను గొలఁదియో గొప్పదియో వ్రాసియున్నాము అనవసరము లామమనొకంజని లో, తిరుపతి వెంకటేశ్వరులకు, స్వ్యానత్వసూచకముగా, కొప్పరపువారినిఁగూర్చి విశేషించి కొనియాడుటయు నందుపైని మీపురసుందరి కాళ్ళిగ్ల శ్రీవాసరావుగారుగాని లేక మీరు వ్రాయించినట్లు మఱియెవ్వరో బ్రహ్మరక్షస్సుకాని వెట్టకథనొందు ప్రకటించుటయు సంశయు నెఱిఁగినదే కదా. మీరేమో యంతోకలహములను పెంచుచున్నారని వాదు వ్రాసినంతన కాక్షేపించుచు నట్టి కలహబీజములు వారి వ్యాసములోనే పూర్తిగా నున్నవిగాని మీవ్యాసములో లేవని మీరు వ్రాసియున్నారు కాని, కలహబీజములు మన వ్యాసములోను స్ఫురించుచున్నవి! కొప్పరపువారినిఁ బొగిడినవారు కవిపండిత చక్రవర్తులనియుఁ దిరుపతి వెంకటేశ్వరులను బొగడినవారు సామాన్యులనియు, మీరు స్పష్టముగా వాక్రుచ్చియున్నారు. సాపురపక్షమునఁ జూచితిమేని నదియు నిది యొక కలహబీజముకాదా? అది యట్టుండుఁడు మీరు వ్రాసినట్లు వారు కవిపండితచక్రవర్తులే, వీరు సామాన్యులే. ఇందుఁ దగవుపెట్టిన ప్రయోజనము లేదు. కాని, యింతమాత్రములో మీవాదమునకొక్క యణుమాత్రమును నుపయోగము కన్పించుటలేదు. ఉభయకవుల తారతమ్యములను గూర్చి వ్రాసినవారొకరిద్దఱు సామాన్యులే కావున వారి వ్రాఁతలు విశ్వాసపాత్రములు గావని మేము స్పష్టముగాఁ జెప్పచున్నారము. ఏమనఁగా లోకములో ఘనులైనవారు తమయొద్దకు ఏదో యొకింత చదువుకొని పండిత సంపాదనమునకై ముందుగావచ్చి యాశ్రయించిన వారిని జేరదీసి తమమంచిగుణముచే నుండె లేక వారి విద్వత్తునుబట్టి యుండె వారిని గౌరవించి కొనియాడుట ధర్మమై యున్నది. అందునను మహాదాశ్చర్యకరమైన యాశుకవితాప్రవాహము వెల్లివిరియఁజేసిన కొప్పరపువారినిఁ గూర్చి పెద్దపొగడుట యొకవింతలోనిది కాదు. కాని, వారిచే వారట్లుపొగడఁబడినమాత్రమున లోకములో నొకసంపదయును గొలఁది వారయినారని మన మనుకొనరాదు. వారప్పుడా కవులను సహాయానుకూలముగా గొప్పవారని పొగడియున్నారే కాని యా సందర్భమునఁ దిరుపతివెంకటేశ్వరులు వారికంటె తక్కువవారని వారేమియు స్థిరపఱచినట్లు మన మెవ్వరమును వినియుండలేదు ఆ కవిపండిత చక్రవర్తులు ఉభయులఁగూర్చియుఁ జర్చించి యందు తారతమ్య నిర్ధారణము జేసియున్నచో వారాంధ్రదేశమునఁ బెద్దలైయున్నారుగనుక "అపరితోషాద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం" అను న్యాయమును బట్టి వారి సిద్ధాంతమును మనము శిరసావహించుటకు సందియము లేదు. ఇదియిటు

జరిగిన దా? ఏకదేశ ప్రశంసవలన ఫలమేమి? మఱియొకప్పుడు తిరుపతి వేంకటేశ్వరులు వెళ్లి వారి నిరాఘాటోభయభాషాకూలంకషపాండిత్య ప్రవాహమును వెల్లివిరియించినచో నప్పుడు వారిని ప్రశంసింతురు. ఇది పెద్దలధర్మము కావున సామాన్యవిధిచే వారు చేసిన ప్రశంసలు తారతమ్యదర్శులకుఁ బనికిరావు, విశేషవిధిచే వారు ఉభయులనుగూర్చి చర్చించి తీర్పు చెప్పినచో నట్టితీర్పు అంగీకార్యమగును. ఏదీ? అట్టిభాగ్యము ఆంధ్రదేశమునలేదయ్యెను "సభ సభో"యని ప్రాశ్నికపులంగలార్చిరి. వినువారు లేకపోయిరి! తూష్ణీంభావమును వహించిరి. కారణ మూహింప లేము.

కవులందఱును గోడకట్టెడువారితోఁ బోల్పఁబడుదురు. కొప్పరపువారు అతిలాఘవముగా గోడ పెట్టఁగలరు. కాని, అది యిసుకపోదుపు పెట్టి కట్టెడుగోడ, వారికి యుక్తమైన రాళ్లు దొరకవు. పుట్టకేటు తక్కువ. తిరుపతి వేంకటేశ్వరులకుఁ దగిన సాధనసంపత్తి కలదు. వారియొద్ద శతఘ్నులకును బగులని గట్టిరాళ్లగని యున్నది ఆగనియందుఁ గోరిన రాళ్లును రత్నములును సకృత్స్నముగ దొరుకను. వారి కూర్పుగూడ నీరంధ్రమయినది. ఆగోడ ప్రళయమువఱకును స్థిరముగానిది., లాఘవమునందుఁగూడ వారు అసాధారణులు. పిల్లలవినోదార్థమై యిసుకతోఁ బిచ్చుకగూండ్లను గట్టువారిని మహాసౌధ నిర్మాతలతోఁ బోల్పఁ జూచుటది యేమి పాపము! వారుగూడ మహాసౌధములు నిర్మింపసందు. అప్పుడు చూతము.

మనము భాషాభిమానులము గావున! సరస్వతిమనలను దనభక్తులనుగా ననుగ్రహింపవలదా? యెద్దియేని యనిష్టకారణమున నిట్లు సరస్వతీసంపూర్ణావతారపదులయిన వారినెల్లఁద్రోసి వేయుచుందుమేని యింక సరస్వతి మనలను బరమనిరోధిగణములోని వారినిఁగాఁ జూడదా? తిరుపతివేంకటేశ్వరుల తక్కిన విషయములు మాకుఁదెలియవు. వారెట్టివారో కనులనైనఁ జూచి యుండలేదు. వారిగ్రంథరత్నములఁ బఠించినపక్షపాతము మమ్ము దోషులను జేసినఁ జేయవచ్చును.

తాము మనోరంజనిలో సుకరు చెప్పిన కత్తెరపద్యమనుచు నొకపద్యమును ఆకత్తెరమీఁదనే కొప్పరపువారు చెప్పినారనుచు మఱియొక పద్యమును ప్రకటించినది చూచినాము. నిజముగా కొప్పరపువారు చెప్పినదన్న పద్యమున కెంతవిలువ యిచ్చినను ఈయవచ్చును. రెండవపద్యముఁజూడనిక్రమముగానిగ్గే వేయుచున్నది.

అప్పటికప్పుడు ఆశుధారగా రచించిన పద్యమే యంతమనోహరముగాను

న్నప్పుడు స్థిరచిత్తులై యూహాసహాయమున వీరేది రచించినను అది యలౌకికసామాన్యమయి యుండుననుటలో నతిశయోక్తి లేదు. కాని. *అదిమేనిజమయ్యెనేని తమశక్తియంతయుఁ గన్పఱపఁదగిన శ్రీజార్జిచక్రవర్తి-వర్ణన పద్యములు సరస్వతిలోఁ గొప్పరపువారు వ్రాసినవి అంతనీరసముగా నున్నవేమి చెప్పుమా! ఏది స్థిరపఱచు

---

*మరా:—సుదర్శినీపత్రికాధిపతిచే మిక్కిలి మృదువుగా మందలింపఁబడుచున్న యీమనోరంజనీ పత్రికాధిపతి యనఁగా! నింతకుమున్ను 54వ పుటలో 16వ పంక్తిలోఁ బరిగణింపఁ బడినసంఖ్యలలో 7వ సంఖ్యకధిదేవతయగు వృథాశాఖాభిమాని, ఇతఁడు కొంతకొక యతిప్రాసములకూర్పనెఱిఁగిన వాఁడును "శతావధాని" యనునొకవిధపుజండెపుఁ బోఁచ తొడుగుకొనినవాఁడును ననియెఱుఁగునది, తననాటకముపైఁదా ననుకొన్న తెఱఁగున నభిప్రాయమొసఁగనిది మొదలుమమ్మునితఁడు ద్వేషించుచుండును, నేఁటికిఁ గొప్పరపువారివంక దొరకి యిందులో మాకేదియో విష్ణుచక్రముచేయఁదలఁచి శరపరంపరగాఁ గొన్ని వ్రాతలు "కొమ్ములు తిరిగిన యవధానపుంగవులజత,, లోనగుప్రగల్భపుఁబ్రల్లదములతో నింపఁజొచ్చెను, అవి యసత్యబహుళములగుటచే నార్యమతబోధినియీ క్రిందితీరున దుమ్ముదూళి చేసెను.

(1) "మనోరంజనిలోని వ్రాఁతలను చూచితిమి. అందసత్యములుచాలకానిపించుచున్నవి. మనోరంజనీసంపాదకుఁడుగారు గంజామువారియింట మున్నగుతావుల కొప్పరకవులు అవధానము చెప్పుచున్నసమయమున పద్యములను తాము వ్రాసికొనినట్లుగా ప్రకటించిరి. గంజామువారింట జరిగినసభలో వీరిప్రక్కనే మేముహాజరై యుంటిమి. వీరప్పుడు వ్రాసికొనలేదు. మఱియును అప్పుడు వారుచెప్పినపద్యములకును మనోరంజనిలో ఇప్పుడు ప్రకటింపఁ బడినపద్యములకును చాలభేదముకానిపించుచున్నది. కొన్ని క్రొత్తపద్యములు కూడ కానిపించుచున్నవి. ఉదాహరణము:—సభలో 'తిమ్మనిబమ్మిగా' అని అన్నగారును 'నందినినందిగా నందినివందిగా' అని తమ్ముఁడును సీసపద్యము పెద్దపాదములుచెప్పగా మనోరంజనియందుగీతములో 'బమ్మదిమ్మనిదిమ్మబమ్మ గాఁగ' అనివ్రాసిరి. నందనివందిని మొదలగునవి లేవు. 'చకనుఁగవ శోణకాంతులెసఁగన్'-అనుపద్యము క్రొత్తదిగానున్నది.,, (1 క్రొత్తపల్లి సూర్యరావు. 2 నేత్రకంటి శేషగిరిరావు. 3 మాచర్ల హనుమంతరావు. 4 కోగంటి లక్ష్మీనరసింహాచార్యులు, 5 శ్రీసముద్రాల వెంకటఅప్పలాచార్యులు.)

టకును జేయాడదు. ఇంతకును గొప్పరపువారేవయినఁ గొన్ని ప్రబంధములు రచించుచుండుటకును వారిని తిరుపతి వెంకటేశ్వరుల ప్రచారముతోఁ గలిపి ముద్రింపవలదని పండితపక్షపాతులయిన మిమ్ము వేఁడుకొనుచున్నారము. ఈ వ్రాయుటవల

---

(2) "కొప్పరకవులను స్తుతించువారలలో నేనునొకఁడనైయున్నను, వారినిగురించి ప్రచురించిన వ్రాఁతలు చాలవఱకు సత్యేతరంబులుగా మనోరంజనిలోఁ గాన్పించుటచేత నిట్లు వ్రాయవలసివచ్చినది. ఆశుధార వారికి సహజముగానున్నదని యంగీకరించియు, నందుప్రచురించిన ప్రకారమున్నట్లు నాకుఁ గాన్పించుటలేదు. వారాశువుగాఁ జెప్పిన పద్యములకును నిందలిపద్యములకును చాల వ్యత్యాసమున్నది. తిమ్మిని, బ్రహ్మిని యనివిశ్వామిత్రుని వర్ణించునప్పుడు సీసపద్యపాదముగా వర్ణించినారు. ఇందది గీతపద్యపాదమైపోయినది. ఇది విశ్వామిత్రుని సృష్టినిగూడ మీఱియున్నది. ఇదిగాక, వారియాశువునందలి పద్యములవ్రాయుటకుఁగూడ వీలులేనట్లు చెప్పఁబడియుండఁగా వీరువ్రాసి యెట్లుజాగ్రత్త పెట్టిరో తెలియకున్నది. వారట్లుకఁడకఁడనే కొన్నికొన్నిపద్యములు వ్రాసినట్లిప్పటివఱ కెవ్వరు నెఱుంగరు. ఇది కడు శోచనీయము. ఇందలిపద్యములకును వారుచెప్పిన పద్యములకును శైలిభేదముగూడఁ గాన్పించుచున్నది."

కిడాంబి వేంకటవేదాంతాచార్యులు.

---

(3) "మనోరంజనపత్రికయందు కొప్పరపుగవులనుతించుచు గంజాము వారియింట నల్లఁబడిన పద్యములని కొన్ని మచ్చుచూపఁబడినవి. గంజాము వారియింట రచింపఁబడినపద్యములకును నిందలి పద్యములకును జాలభేదముకలదు. శైలి భేదము మాత్రమే కాక యప్పటప్పటికిఁ జెప్పఁబడినయూహలు నేర్చి యొకఁడుపద్యముగా వ్రాయుటయు, నందుఁజెప్పఁబడని పద్యములు నూతనముగా నిందుఁజేర్చుటయు జరుగుటచే స్తోత్రముచేయుటయే ప్రధానముగాఁ జేసికొనిన యీలేఖకులు సత్యేతరములను వ్రాతలు వ్రాసిరి,,

Ch. L. Narasimhacharyulu,
Math Asst.
Mc. Laurin High School.

---

(4) "నేను మనోరంజనీ పత్రికలోఁ గొప్పరపుసోదరకవుల కవిత్వముగాఁ బ్రచురింపఁబడిన పద్యములను జూచితిని. వారొనర్చిన సభలకన్నింటికి నేనుబోయియుంటిని. వారాయా సభలలోఁ జెప్పిన వానికిని నేఁడిందుఁ బ్రకటింపఁబడిన వానికిని నందంద చాలభేదములున్నవి".

ఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రి.

నఁ గొప్పరపువారిని సామాన్యులనుగా గణించుచున్నామని కొందఱు భ్రమపడుచున్నారు. తిరుపతివేంకటేశ్వరులతోఁబోల్చుట యనునొక వెఱ్ఱిభ్రమను విడనాడితిరేని యనంతరము మీచిత్తము. వారి నెంతమెచ్చినను దనివిపొందనక్కఱలేదు. అట్లుకాదేని,

చ. పనిగొని సంతగించి ఘన* వాత పరంపర నొక్కఁబెట్టు మే
దిని పడివీవఁ దైలమయ* దీపికలాఱిన నాఱుఁగాక శో

---

(5) "కాకినాడ కళాశాలం జరిగిన కొప్పరకవుల కవితాగోష్ఠికిం జనితి. నారి యనర్గళధోరణి వింటి. కాని యిటీవల ప్రకటింపఁబడిన మనోరంజనిలోఁగొప్పరకవులకవిత్వమని ప్రకటించినపద్యములు మాత్రమవి కావు. ఆపద్యములు వేలవముగానున్నవి. ఇందు గొన్నికొన్ని పాదము లిటీవల కల్పింపఁబడి యుండవచ్చును. ఏమన వారి ధోరణి వ్రాయుట కవకాశములేనిది.,,

జయంతి భావనారాయణ.

---

(6) "మీరువ్రాసిన లేఖను చూచితిని, కాలేజీలో కొప్పరపుకవులు ఆశుధారగా కవిత్వమును జెప్పినపుడు కొంతసేపుంటిని. అప్పుడుఎవరును పద్యములను వ్రాయలేదు. వ్రాయుటకుఁదగినంత సావకాశము వారు కవిత్వముచెప్పునపుడుండదు. జ్ఞాపకముంచుకొనుటకైననుఏమేకసంథగ్రాహికిని వీలుపడదని నా తాత్పర్యము. మీరు పంపినపద్దెములు వారేచెప్పిరని నేను వ్రాయలేను, ఇటీవల వారుచెప్పిననెవరైన వ్రాసియుందురు. ఆసమయములో వారు చెప్పినవి యెవరును వ్రాయలేదు. ఆభావముగల పద్దెములుగా కన్పడుచున్నవి.,,

పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యం.

---

(7) "కొప్పరపుకవులు గంజాంవారియింటియొద్ద చెప్పిన పద్యములకును మనోరంజనిలో ప్రచురపరచినపద్యములకును భేదమున్నట్లుతోఁచుచున్నది. గంజాంవారి లోగిటియందుఁ జదివిన పద్యములనుమాత్రమే నేనువినియుంటిని.,,

తా॥ నారాయణమూర్తి

---

వీనినిబట్టి సభలోఁ గొప్పరకవులు చెప్పిన కవిత్వమునకును మనోరంజనిలోఁ బ్రకటింపఁబడిన పద్దెములకును భేదమున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈ భేదమునకుఁ గారణమేమి? సభలో నాశువుగాఁ జెప్పిన పద్దెములు నిస్సారముగా నుండుటచే నింటికడ సావకాశముగా నున్నప్పుడు వానిని దిద్దివేసి మనోరంజనిలోఁ బ్రచురించిరిగాన నీభేదమువచ్చినది, ఈదిద్దినవారెవరని? మనము కొప్పర

ఘనఘనకాంతి విస్ఫురద* భంగ ధగద్ధగ ధాళధళ్య స
న్మణిమయ నిత్యనిర్వికృతి* సంగ ప్రదీపములాఱిపోవునే'',

---

తే॥ గీ॥ వైదికులుసునియోగులుబ్రాహ్మణులు, నవుడుభయపక్షములకు నన్యోన్యలేఖ
లుపకరించెడి నవియునటుండనిమ్ము, జనని! బ్రాహ్మణేతరులవాక్సరణివినుము

---

కవులేదిద్దిరందము......(31జూలై 1912 ఆర్యమతబోధినుండి)

---

పిదప, మ॥ రా॥ రా॥ కార్యెర్లశ్రీనివాసరావుగారు కూడసత్య నివేదకులై తనవ్రాతకును తన పట్టిన పట్టునకును నొకింత బాధకులని తలఁచి యీయనను గూడఁ దూరుపాఱఁ బట్టుచుఁ గొంతవ్రాఁత వెళ్లఁబెట్టెను, కాని పూర్తిగాఁ దనగుట్టుబైటఁ బెట్టినబోధినిని ఖండింప నాధారము చిక్కనందున నిట్టూర్పులు పుచ్చి రోఁజుటతప్పనితనికిగత్యంతరములేకపోయెను, ఇంకను తనతోపాటు మఱికొందఱను గూడ వెఱ్ఱితోవకు దింపుట కమశోచనీయము, పాపము! పాశివెంకటస్వామిగారితనికి గురువులో శిష్యులో కాఁదగుదురు, ఈయన నెనకొల్పి కొవ్వపువారినతిమాత్రస్తుతి చేయించుటలోఁ దప్పులేదుగాని ఆ స్తుతిమధ్యమున యావత్పండితమండలినిగాకులనుగా నపలాపించుట పూర్తిగా మండలింపఁ దగుదోసము, "పండితకాకాయితవృత్తిలాపములు" (15 జూలై 1912 సం॥ మనోరంజనిచూ) ఈ వెంకటస్వామిగారమాయికులు ఏదొంగజందెపుశతావధానియో వ్రాసియీయనచే వ్రాలుచేయించినట్లు పద్యములశైలి చెప్పుచున్నది, నిజముభగవంతునికే యెఱుక, దీనింబట్టి యీశాఖాభిమాని "తాఁజెడ్డ కోఁతివనమెల్లఁ జెఱిచెననుసామెత కుదాహరణమగునేమో విజ్ఞులు పరికింతురుగాక ఇతరవిషయములలోఁ గేవలము భిన్నాభిప్రాయములతోఁ గొండాడు బోధినీ సుదర్శనులీయన "యసత్యవాది" యనుటలో నేకీభవించుటయిందులకుఁ బ్రబలాధారము ఇయ్యాదిసర్వవిధములగురుశుక్రసమాగమమువంటిదె, దీనివలననే యితనివ్రాఁత సర్వాసహ్యముగానున్నది యనిజగమెఱుఁగునని యెంచి గ్రంథవిస్తర మొనర్పక విరమించితిమి,

---

క॥ కార్చెర్లశ్రీనివాసుఁడ, మచ్చిన్నప్పాత్తమ్మటుండ మహోల్లాసకరుఁడుక
వ్యర్థుఁడ తితరవృషుఁడో, నర్పిన చర్చయునుగొంత నాటింతుమిటన్. శ్రీ.

(1911 సం॥ నవంబరునెల 10 వ తేదీ శశిలేఖనుండి)

"చ॥ తిరుపతి వేంకటేశ్వరను ధీమణు లాదినిశబ్దశాస్త్రసా। గరమును దాఁటి తర్కమును గల్పను ఛందము యోగమాగమో। తర్కరముఁ దప్పియిఁక గ్రహించి కవితార్థుని భూరిశతావధానముల్, ధరణిపు లెన్నఁ జేసిరి యథావిధి, వీరిని నే నెఱుంగుదున్ ॥చ॥ తిరుపతి వేంకటేశ్వరను, ధీయుగ శాంచిత సాహితీమ హా। గరిమ నుతింప నాతరము, గాదని చెప్పిన నొప్ప కప్పణీ। శ్వరుఁబురికొల్ప నాతఁడును, వాకొనఁజాలఁడ దేమనన్ నిజరా। భరము నఁదూలుటన్ శ్రుతివి, ధానుఁడెన్నఁడు గాకయుండుటన్ ॥చ॥ తిరుపతి వేంకటేశ్వరను, ధీమణియుగ్మము గూడి విస్మయా। కరముగ రాజరాజులును, గావ్యరసజ్ఞులు మెచ్చ రచ్చలన్। నిరవధికావధానముల, నేకము లాశుపుగాఁ బ్రబంధముల్। నెరపిరి శిష్యసంతతికి నేర్పిరి వీరిని నే నెఱుంగుదున్॥ చ॥ తిరుపతి వేంకటేశ్వరను, ధీమణు లించుకజంకులేక భూ। వర లరుదంద గొప్పగల, వాదుల వైరుల విగ్రహించియే। బిరుదులఁ జంద్రహారములఁ, జేటిక లాటనిహాటకోజ్జ్వలాం। బరములఁ దెచ్చి రెన్నిటిను, బాగుగ వీరిని నే నెఱుంగుదున్॥ చ॥ వెఱపుగలట్టి గుండెయును, విక్రమమూరని పల్కుకండునన్। బిఱికితనంపుఁగండయును వి, వేకవిహీనులఁ గోరునండయున్। సరసము లాడకుండమియు, సాహితిచాలనిగం డెఱుంగరీ। తిరుపతి వేంకటేశ్వరను, ధీమణు లిన్నియు నే నెఱుంగుదున్॥ ఉ॥ ఏనుఁగు నెక్కినారు కృతు, లెన్నియొ లీలగఁ జెప్పినారు దు। ర్మానవ వారమున్ గడిమి, మాటికిమాటికి మాటినారు స। న్మానము లందినారు ముని, మార్గములారసినారు వీరటం। చేను దలంచి పద్యతతి, నే మణిమాలగ నిచ్చి తీర్చియన్॥ ఉ॥ శ్రీరమణీమణీవిమల, చిత్తశరన్నళినాళిహేళిదే। వారివిదారిశౌరికరు, ణాకలితేక్షణవర్ధితార్థశ్రే। గారకవిత్వసత్త్వగుణు, కార్యుఁడు కార్యము పూడి రాజమ। న్నారు శతావధానకవి, న్యాయము నారసి వ్రాసె నీకృతిన్॥

వివేకులకు, విద్వాంసులకు. విద్వత్కవులకు నేనొక విన్నపము చేయుచున్నాను. అదియెద్దియన, వియ్యమునకు, నెయ్యమునకు, కయ్యమునకు, సమత వలయుననికదా సదా విబుధులు వక్కాణించెదరు...తిరుపతి వేంకటేశ్వరకవుల

వివాహమునకుం బయనించెదమని వెనుకొని గుంటూరిలోఁ బారసించి వ్రాసినపద్యము లాదిగఁ బరస్పర ప్రేషితోత్తర ప్రత్యుత్తరములుగల చిన్నపుస్తక మొకటి చిరంజీవులు వినిపింపఁగా వింటిని, తద్విషయములం దెలిసికొంటినిగాని, ఇదమిత్థమని నిర్ణయించుటకు తగిన విద్యావివేకములు పరమకారుణికుఁడగు భగవంతుఁడొసఁగియుండినను, దేశకాలముల ననుసరించి యూరకుండవలసినవాఁడనైతిని. అదియేమందురా. మొదటినుండియు నియోగి బ్రాహ్మణులయందు గుణాగుణ నిరూపణ విచక్షణులు మెండుగనుండియే యున్నారు. ఇప్పటికాలమందంటిసోని లెక్కింపనక్కఱముగాక అంతట వండిగనిండియున్నారు. ఇట్టివివేకనిధులై మక్కువపడి తగవును మిగుల తెగువతోఁ జెంపు సేయుచుండ బ్రాహ్మణేతరుఁడనగు నేనేమిసేయఁగలను.... మాదిరాల పేరాల గ్రామములలో సోదరకవుల సభలు జరిగినవి. సభ్యులు గౌరవించిరి. నేనును నావారును గొండాడితిమి. వెండియు, తిరుపతి వెంకటేశ్వరకవులను ఆమటునాఁడే దయచేసి మాగ్రామములం బావనము చేయుమని నేనీపద్యముల వ్రాసియుంచితిని. అట్లు దటస్థింపమిచేఁ బత్రికలందుంచఁ బ్రకటింప వలసివచ్చినది. మాగ్రామములలోఁ దగుపాటి ద్రవ్యవంతులును, చదువరులు, యోగ్యులు, శాస్త్రజ్ఞులు నగు వైదిక బ్రాహ్మణులు కలరు. తగుప్రయత్నములు జరుగుచున్నవి. సభ కాఁగలదు. అప్పుడు మహామహు లగువారిదర్శనమువలన అస్మదాదులము ధన్యులము కాఁగలము".

కార్యమపూడి రాజమన్నారుకవి.
శతావధాని, పేరాల.

---

క॥ న్యాయమ్ము త్రోవలో తాఁ గాకవ్వ, ఘాయిఁ శ్రమపేరి వృద్ధతముఁ డీతని కే
మా రోపాయము చేసెనె, ధీయుతుల కిదెంత చింత దెచ్చెను యకటా'' ౧౨౩

గీ॥ ఇటుక్రమమున్నఁగఁ బ్రాజ్ఞుల యెఱుక కంతిమి, హాటవాదులవాక్యములు హాలఁబడఁగ
నెగడఁగాఁ జొచ్చె సత్యంబు 'నిజము నిది, మీఁద తేలునని యెడిసా మెత్త భువంబు

ఉ॥ సత్యపువిల్వ లోకమున సాఁకెడివారలు లేమిఁ జాల దౌ
ర్గత్యము చెందె నించుక యొకానొకచో నది డాఁగియున్న దు
ష్కృత్యము దాని రాఘము లబద్ధపుసాక్ష్యము లిచ్చి దానికిన్
మృత్యువులుగాఁ బొడంగి రొకమేటి యెవండో పెచంగ నేమగున్. ౧౨౪

చ॥ పొరఁబడుఁ గాక వెంబడిగఁ బొందిన మోసము తెల్పినట్టి కే
సరికిఁ బురస్కృతుల్ మొదట నల్పి వదంపడి దేశమాత నం

తరమున మెచ్చి కృష్ణునకుఁ గృతజ్ఞత చూపుచు నాంధ్రపత్రికన్
గరము బహూకరించెనను గాక మనోవిశయంబు తెల్పుటన్. ౨౨౭

ఉ॥ ఉంటరి పోకఁబోయెడి విధుంతుదులన్ విలసద్యశస్సుధా
కంటకులన్ నిగూఢతరకర్మకులన్ నివరించి వీంద్రడ నై
ప్పంటికి సత్కళానిధుల పాలిటిశత్రులు గా గణించి మి
న్నంటుయశమ్ముగొన్న యసురారి సుదర్శని సుప్రకాశ టొప్పదే. ౨౨౮

సీ॥ అలబిడాలాదుల నాజిఁ గూల్చుటకన్నఁ గొండగొర్రెల బలి గొనుటకన్న
మహిషాసురుని బరిమార్చి వైచుటకన్నఁ జండముండులఁ బట్టి చంపుకన్న
ధూమ్రలోచనుతల దూళి సేయుటకన్న రక్తబీజుని నేల రాయుకన్న
బండలలో నెల్ల బండలు శుంభనిశుంభదైత్యుల వధించుటనికన్న.

తే॥గీ॥ నీవు నీసింగమున కును నేఁడు మిగులఁ, గష్ట మగుపని పుట్టె సూకాళికాంబ
అనృతమున డంపవలయు సత్యంబుఁ బెంప, వలయుఁ గడు జాగరూకత వలయు జనని

సీ॥ అదరిపాటున మీస మంటి కుంటిన కొప్పరంపుసంరంభంబు దింపినావు
గుంటూరిపురిలోనికొంటెవారలు పన్నుపస్థతు లడఁగిపా ల్పఱచినావు
అవధానమధ్యమ్మునందు లేచినదుర్మార్గులగోల లంతలో నిలిపినావు
బ్రాహ్మణకోడూరఁ బరమోత్సవమ్ము గల్పించి మేనాల నెక్కించినావు.

తే॥గీ॥ అద్వితీయద్వితీయహస్తాభియాన, విక్రమోపక్రమము దలపింపఁ జేయు
నీకరుణ కేమినిష్కృతి నేర్తుమమ్మ, సరసతిరుపతివేంకటేశ్వరనియంత్రి ౨౨౯

సీ॥ దోమ యేనుఁగుఁ బట్టి దోరించె నొకనక్క సింగంబు నెత్తెత్తి చీరి మొదిలె
పిల్లి జోడెదిరించి పెద్దపులిని జంపె, గొర్రెపాలి కుదయించెఁ గోడుకుఁ గుర్ర
చెవులపిల్లికిఁ గొమ్ము కవ పుట్టె నాకాశ మం పెన్నియేని హర్మ్యములు వెలనె,
నంది యయ్యెను బంది పంది యయ్యెను నంది యప్పాలుకప్పలై యాడఁ బాడఁగె

గీ॥ ననుచు వ్రానెడి వ్రాఁతల నాదరించి, మంచి యిది చెట్ట యంచు నొకించు కేని
చర్చ నేయక ప్రకటించు చతురమతుల, నేమియన నేమియగు భవానీ! ముదంబ

చ॥ "అదె కనె దున్న దూడ", ననినంతన "గొట్టములోన గట్టుము
న్నది ధ్రువ మంచు నేఁటిమనయాంధ్రుల పత్రికలందుఁ దోఁచు నే
రెది లిఖియించి రేని యు నరే యని పత్రిక నింపుకొందు రో
ప్పెది యొది తప్పటంచు గణియింప రొకింత యుదేమి పాపమో. ౨౩౦

ఉ॥ పత్రికలంచు నేరికొ యవాకుచవాకులు వ్రాయ వానిసా
ఫ్త్రము నమ్మి పండితులుఁ బామరులుం గడు మోసపోదు రీ
పత్రిక లెందుకో? నిజము పాడఱుకాలము వచ్చెగాక, దు
ర్గాత్రము దిద్ది వీనినడకల్ కడు వక్రము లక్రిమార్చుటల్. ౨౩౨

ఉ॥ రాజులు చారచక్షు లయి పాలనము లెందటివేని దీసి రా,
రాజనె పత్రికాధిపతు లక్కట! విప్రతల విశ్వసించి య
వ్యాజయశస్సులక్ గొనఁగు లంటఁగఁ జేయుదు రీహిమాని సా
ఫ్రోజహితుల్ దనంతఁ బిహితుం బొనరించినఁ జూత మంబికా॥ ౨౩౩

ఉ॥ గవ్వను రత్నముల్ సలుపఁగాఁ గల రెవ్వరు! కొంగ హంసయై
నివ్వటిలంగఁ జేయుటకు నేర్పరు లెవ్వరు! కుక్క గోవుగా
నెవ్వ రొనర్ప నేర్తురు! యథేచ్ఛగ వ్రాతురుగాక యక్కటా!
అవ్వకు జవ్వనం బౌదపునా! ముసలయ్యకుఁ బండ్లు వచ్చునా॥ ౨౩౪

తే॥గీ॥ కపులనైపొందఁగానెంతగలదొ యంత, గౌరవమ్మును మనుమన్న గాంచినార
మిపుడు మానేరఁ గలయర్థ మెల్లగతుల, సార్థకంబయ్యె నీస్త్రీమయంగు జనని।
గీ॥ అక్కజంపు *గౌరవములు పిక్కటిల్ల,
నచటమేముండుతఱిఁ బత్రికాధిపతులు

---

(*1911 సం॥ అభినవసరస్వతి 9-10 సంచికలనుండి.)

గుంటూరు మాసచారము.

గుంటూరులోఁ గొందఱు పెద్దమనుష్యులు శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల నాహ్వానముచేసిరనియు అగష్టు 19-20 తేదీలలో సంపూర్ణశతావధానము జరుగఁ గలదనియు నాహొకస్నేహితుఁడువిలిఖించె-అందుపై 19వ తేదీకే పోవునట్టిసాఫ్రిప్తి తేక 20వ తేది గుంటూరు ప్రవేశించి శ్రీవకానందాద్యనేకగ్రంథపఠనముచే వారి విద్వత్కవిత్వాతిశయ మెఱింగియున్నవాఁడనగుట నట్టిమహానుభావుల దర్శన సౌఖ్యముచేయుదునా యనుతత్తఱపాటుతో వారిబసకుఁ జేరుసరికి నాయింటిముందటనై సీకలును గుఱ్ఱపుబండ్లును మూఁగియుండి యంతః ప్రవిష్టుఁడనగుటకే యతిప్రయాసపడవలసివచ్చి యెట్టకేలకుఁ బ్రవేశించియుఁ గొంతకాల మివలనే పడియుంటిని- అందుకుఁగారణము వారిదర్శనమునకువచ్చిన మహాజనుల సందష్టమే......మరలఁ దిరుపతి వెంకటకవుల శతావధానములు బ్రాహ్మణకోడూరులోను తెనాళి, నరస

పొరఁబడుచుఁ బ్రకటించునప్పు డొకకొన్ని,
వ్రాఁతలంగూర్చి యిటు కించ పడఁగవలసె, ౨౩౮

సీ॥ కలనైన సత్యంపుఁగం పెఱుంగనిపక్షపాతులెల్ల యథార్థవాదులైరి,
పూర్వపండితమార్గముల నెఱుంగనియసద్వాదులెల్ల యథార్థవాదులైరి,
పరమున్న దనెడిభావమె యెఱుంగనికూటవాదులెల్లరు సత్యవాదులైరి.
యెఱిఁగియు నిదిరించు పరమకృత్రిమసార్వభౌములెల్లరు సత్యవాదులైరి॥

గీ॥ మీకతమ్మున, మిమ్మునమిత్రమయ్యెని, ఆఱుమూడగుచూడాఱునగు ధ్రువముగ
మిమ్ము నడిపించువారిలోపమ్ము మిమ్ముఁ బ్రగమ్ము చుండెడిఁ బత్రికా కాంతలార॥

గీ॥ అప్రయోజకుఁడగుపుత్రునందుఁ బక్ష, పాత మూనుట యది స్వభావంబె జనని
తెలుఁగుదురు నీదువాత్సల్య మెల్లవారు, దేశమాతరో! నిన్ను నిందించు నెవఁడు॥

మ॥ ఘనతం బొల్చెడివారి నూరక శిఖాకారమ్ము లౌకొండ లె
త్తనిపంకమ్మునఁ బోల్చి నీదరికిఁ జేర్ప న్నీవు గుర్తింప కెం
మను వారిన్ గుటిలస్థితిన్ సరసులందున్ జేర్ప నీగుట్టు చె
ల్చునఁ దత్వంక మడఁచి తెల్పుఁజుమి కృష్ణా వారియాథార్థ్యముల్॥ ౨౩౯

ఉ॥ పత్రిక లేమి సేయు నవి వ్రాయఁగ సేరవు లోకులందు స్వా
ర్థాత్రము నుంచి వా రనుపువ్రాఁతలు సంగ్రహణం బొనర్చి స
ర్వత్ర చరించుచుండు నలవారలు మోసము చేసిరేని త
త్కృత్రిమతావిశేషము నెఱిఁగన లే వరయుఁగ గ్రిమమ్ముగన్ ౨౪౦

తే॥ గీ॥ మొదటఁ బొరఁబడి పత్రికల్ పిదపఁ గన్న
దెలిచి వచ్చినవ్రాఁతల తెఱఁ గెఱింగి
"బుట్టదాఖలు సేయుదుఁ బుట్టె నంత
లోన "దర్బారు" మనుఁ దిట్టఁబూని జనని॥ ౨౪౧

చ॥ ఇతరుల వ్రాఁతలంగుఱిచి యించుక తెల్పితి మింతవట్టుఁ ద
ద్గతమగు మంచిచెడ్డలను గాంచితి వంబరో! యింకఁ గొత్రపుం

---

రావుపేటలలోను జరిగి యీప్రాంతములఁ బలుమందని నవధాన సభలు సలిపింపఁ బూ
రికొల్పుచున్నయవి. తథాస్తు, సర్వేజనా స్సుఖినో భవంతు.

జతురులతప్పఁ *బ్రల్లదపుఁ జాతురి కొండొకచూపి నార్పఁగా
యితులగుటన్ గుణించినది యింకొకచో వివరింతు మంబికా॥ ౨౮౨

చ॥ బవరముకై లిఖించియు సభాస్థలికిన్ జనుదేరలేమి మూ
స్వవమతి కగ్గమై యది స్వయంకృత దోషముగా నెఱింగి, బం
ధువులది గప్పిపుచ్చుటకుఁ బోఁచిన సాయ మొనర్చుచుండ, నూ
రు విడువఁజూచ్చెఁ గొంగ్రము పరుల్ దనదబ్బఱ లేవ గింపఁగన్ ౨౮౩

---

# కొప్పరపువారి తప్పుప్రాఁతలు.

*శ్రీరాములు-

కొప్పరము- సంతమాగులూరిపోస్టు,
24-7-12.

సుహృద్వర్యులును సకలగుణగణాలంకారులును విద్యాభిమానులును బ్రహ్మశ్రీ ... శర్మగారిసన్నిధికి - నమస్కారపురస్సరముగా చేయువిజ్ఞాపనము

మేధానిధీ,

తమరు వ్రాయించిన యుత్తరమునుపద్యములును జూచి పరమాహ్లాదము నొందితిమి, మేము కాకినాడనుండి యే బ్రహ్మశ్రీకోన వెంకటరావుగారికి జాబువ్రాసినప్పుడే తమకు గూడయొకటి వ్రాసితిమి, అదియేకారణముననో చేరలేదని తమజాబువలన గ్రహించితిమి,-

మనకోనవెంకటరావుగారి సభానంతరము మణికొండసంస్థానాధిపతిగారు తమతమూర్తికళ్యాణమునకు సమాహ్వాన మొనర్పగా వెళ్లితిమి- అచ్చట శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి- కవిరాజుగారు అగ్రాసనాధిపత్యము వహించిరి, ఆసభలో రాజాగారు 232రూ, బహుమానముగానంపిరి, కవిరాజుగారు పద్యగౌరవ మొనరించిరి, అచ్చటినుండి నిడదవోలుకు- పండితసభకువెళ్లితిమి। అచ్చట చిలకమర్తిలక్ష్మీనరసింహముగారగ్రాసనాధిపత్యము వహించిరి, చందాప్రెడ్డిగారు రు 116 లు బహుమతియొసంగిరి, అచ్చటినుంచి - కాకినాడకు గంజాం వెంకటరత్నం పంతులుగారియింటికి వివాహకార్య(పత్రికా) హూతులమై వెళ్ళితిమి

ఆవివాహగృహంబున బ్రహ్మశ్రీ దరిసేటిశేషగిరిరావుపంతులుగారి యొక్కయు బ్రహ్మశ్రీ కస్తూరి శివశంకరశాస్త్రిగారియొక్క- (అ)గ్రాసనాధిపత్యము క్రిందసభజరిగినది—

ఆసభకు.— శ్రీపోలవరపు రాజాగారు వచ్చిరి జడ్జీలు ప్లీడలు సమస్తఉద్యోగస్థులును సభనునిండిరి-

క॥ 'రాజీ, యను చోకరాకడ, గాఁ జనుదెంచుటయు, మేముగా దనుటయు వా
రాజికి రాఁజాలమని బ, రాజితులగుటయును దబ్బఱలకుం దిరిప్పెన్ ౨౮౮

చ॥ ఇది మొదలెంత తప్పులిపికేనియుఁ గొప్రము నిచ్చ మయ్యెఁ గొ
న్నిదినములేగుమీఁదఁ దమనెయ్యపు బంధులతోడఁ బెండ్లికిన్
గదలియుఁ గాకినాడ చని ''కాళ్లకు'' రాతనిఁ గూడి వాదు ప్ర
ల్లదము లాగి రామకృష్ణకవులన్ గమురోగ్యులఁ జేసి పుచ్చెదిన్ ౨౮౯

---

ఆసభకు తిరుపతిశాస్త్రి నెందరు పిలిచినను రాలేదు- ఆతిరుపతి శాస్త్రి గుంటూరులో రంగావ(వ్య)ల హనుమయ్యగారియింటిమొద్ద ప్రాణమిత్రులు పోనైయుండగా- కొప్పరపుకవులు గోదావరి (తః) దాటివచ్చినట్లైతే- బుఱ్ఱగొరిగించెదనని- చెప్పెనట- ఆమాట వినిన వారమగుటచే- ఆసభలో జ్ఞప్తికి వచ్చి—అతడు సభకు రాకుండుటను విచారించి-

గీ॥ బుఱ్ఱగొరిగించెద నటంచు బొబ్బలిసె, యెవ్వడో పల్కెనటతాల్లిహీనుడగుచు
కంచుదివిటీని వెదకిన గానరాడు, పాణిముండెను లేదో కొక్కెషువా నరుడో,

అని చెప్పితిమి—— అప్పుడు-తిరుపతి శాస్త్రియొక్కడే కాని వెంకటశాస్త్రి లేడు- ఎండకాలపు సెలవులగుటచే బందరునుంచి ఇంజరము నతనిస్వగ్రామమును వెళ్లినాడు, వెళ్లితిరుపతిశాస్త్రికి, కొప్పరపువారు కాకినాడకువచ్చి—సలుచేయుచు- సభలలోనెట్లుప్రసంగించినను నేనులేనిది- సభకునీవువెళ్లవద్దు- అని జాబువ్రాసినాడట- అందుచేత తిరుపతిశాస్త్రి- సభకురాడయ్యెను-

2) సభ శ్రీపోలవరపు రాజాగారును అనగా తిరుపతిశాస్త్రిని యుంచుకొనినవారు, దివాన్ బహద్దరు దురిసేటి శేషగిరిరావుగారును రావు బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తిగారును కలసి ఆపిఠాపురంరాజాగారికాలేజీలో చేయించిరి. ఆసభకు——2000 వేలమందికి పైగాసభ్యులు చేరిరి, జడ్జీలు -కలెక్టర్లు - తహశీలుదార్లు - ప్లీడరులును మఱియితరులైన యుద్యోగియులును నుండిరి- ఆసభకగ్రాసనాధిపత్యము శ్రీపోలవరపు రాజాగారేపొందిరి (ఆ)గ్రాసనాధిపత్యము బ్రహ్మశ్రీ వంకావెంకటరత్న శాస్త్రిగారను పెద్దపండితుడు గారుబొందిరి - ఆసభకుముందు రాజాగారు - తిరుపతిశాస్త్రిగారును తమదివాణము లోనుండి సభకుతిరుపతిశాస్త్రి గారిని రాజాగారు రమ్మని కోరితే ఆయనప్రత్యుత్తరము.

రాజా - ఏమండీ తిరుపతి శాస్త్రిగారూ సభకుబయలుదే(రమూ?)
తిరు -సభ యెవరిదండీ,
రాజా - కొప్పరపుసోదరకవులది -
తిరు - అట్లులైతే వారిసభకు నేనురాను.

క॥ అటఁ బమబొబ్బిలి పాటకు; నఁటనేమేమిరపురము వెళ్ళమఁటని తమకున్ జం
కుటచేతనంటని యిట్లని, కటువుగ రటనంబు నింపఁగాఁదొడఁగి రొగిన్ ౨౮౬

క॥ తిరుపతినఁటని సభలోనఁటని, దురుక్తులను బెట్టిబిట్టుదూఱిరఁటని యతం
డరయఁగ నేటికిరాఁడని, తిరస్కృతిన్ జూపిరంటని తెలియుమి జెల్లన్ ౨౮౭

---

రాజా - ఎందువల్లరారు.

తిరు - నేనురాఁదలఁచుకొనలేదు.

రాజా - శాస్త్రిగారూ? మొన్నకవీశ్వరులను మాయింటికి నేను విందునకుపిలచితి నిగదా! ఎల్లప్పుడును మాయింటిలోనేభోజనముచేయుచుండేతమరు - భోజనమునకు సపంక్తికిరాక- "భోజనమునకేపూట యెందుకురాలేదండీ" యని నేనడిగితే, నిన్న జ్వరమువచ్చినది, యీదినముదయమున పత్యపుమెతుకులు తినినానని యేదోసమాధానము చెప్పితిరి - గంజాము వారింటిసభకెందరువచ్చిపిలిచినను రాకపోతిరి - ఈసభకురమ్మని నేను పిలుచుచుండగా రాదలంచుకోలేదనుచుంటిరి ఇదియేమిసరసముగాలేదే.

తిరు- సరసముగా లేకేమిలెండి,

రాజా - శాస్త్రిగారూ! తమరు గుంటూరులో కొప్పరపు కవులు గోదావరిదాటివచ్చినయెడల బుఱ్ఱగొరిగించెదనని అనినారట- నిజమేనా- మీరట్లాఅనవచ్చునా?

తిరు - సరి, సరి, బాగాపున్నది- ఆమాట గుంటూరులో ఏగాడిదన్నాడు- నేననలేదు-

రాజా- మీరన్నారో అనలేదో- గంజాంవారింట సభలో- వేయిమంది వినుచుండగా-

గీ॥ బుఱ్ఱగొరిగించెదనటంచు బొట్టుబలిసి, యెవ్వడో పలికెనట తొల్లిహీనుడగుచు
కంచుదివిటీని వెదకెన కానరాడు, ప్రాణముండెను లేకాక్రాపనుపాసపడొ!

అనిపద్యముచెప్పి కొప్పరకవులు సింహాగర్జనచేసినారు పద్యముచెప్పినట్లుమీరు విన్నారా? లేదా?

తిరుపతి- విన్నానులెండి-

రాజా- మీరు గుంటూరులో- చాటుగా- అంటేకాకినాడకు వచ్చి నిర్భయముగా- వారుసభలో- ప్రతాపమును సాటించిరి—ఆపద్యమును వింటే మావంటివారికే కఠినముగా దోచినది ఇక మీ కెట్లు యుండవలెను

తిరుప- తమరు మరల - ఆప్రసంగమేయెత్తితే- యెట్లో- అన్నవాడు- గాడిద-అని అంతపట్టుపేసికొంటినిగదా- ఇకనైనా నమ్మరా

రాజా- దానికేమి- పోనివ్వండి- ఈసభకు మీరురాకపోతే, బాగాయుండదు

తిరుప- బాగుండకేమి- యీసభకు రాకపోతే మనకేమి తక్కువ-

ఉ॥ ఇంతటి గొప్పఁ జేసితిమి యేమని చాటుగ వీరలొక్క ధీ
మంతునికిన్ లిఖించి రది మాకెటులో లభియించె నిక్క మిం
దెంతయు కల్పితంబదియు నెంతయు పోలవరప్రభుండు ధీ
మంతులు తక్కసభ్యులును మాటికిఁ జర్చ యొనర్పఁగావలెన్ అంగా

క॥ నిక్కముగ వీరియుత్తర,మక్కట! నీచాతి నీచమై యున్నది యా
వాక్కులకు నైఁచు గౌరవ, భాక్కులు సభ నుండరంచుఁ బలికెద మంబా

---

రాజా- ఈమాట చాలాసంతోషమే- ఈసభ- యెవరిది- మనదికాదా- మేముచే యించే సభలో- మాఆస్థానములో నున్నమీరు రాకపోతే- సభ్యులిదివరకే అనుకొన్నదానికి నిదర్శనముగా నున్నదని మిమ్మలను నెట్లు అంటారో మీరెఱుగుదురా?

తిరు - ఇదివర కేమనుకున్నారు?

రాజు - కొప్పవరపు కవీశ్వరులే సమర్థులు - కావున - రంకెలు వేయుచున్నట్లు సభలో నిర్భయముగా నిట్లు చెప్పచున్నారు, పెద్దవారుకనుకను, కవితా సామర్థ్యము - మేధాసామర్థ్యముతప్పిపోవుటచేత, తిరుపతి శాస్త్రిగారు అసమర్థులవలె సభకురాలేదు అనుకున్నారు - ఈమాసభకు గూడ రాకపో తప్పక అసమర్థులని అనరా?

తిరుపతి - ఎవరేమనుకుంటే మనకేమిలెండి.

రాజు - అసూయగా - మొండివేస్తే రాజుకూడు,అ(న్న)ట్లు భయగ్రస్తులైన బలహీనులింతే అనేది - ఎందుకింతభయము.

తిరుపతి - భయములేదుకాని - మావెంకటశాస్త్రి పోవద్దు - అనిజాబుబ్రాసినాడు

రాజు - జాబేది.

తిరుపతి - (జాబుతెచ్చి చదివి వినిపించును)

రాజు - వెంకట శాస్త్రిగారు - సభలో కలహమగునని వద్దనెనుకాని - వేరుకారణముకాదు - నేనున్నాను మీకుఖరవాలేదు - రాండి.

తిరు - రాను లెండీ,

రాజు - రాకపోతే - మీరుభయపడినారు - ఓడిపోయినారు.

తిరు - మీరేమన్నా అనుకోండీ,

రాజు - ఇక మేమువెళ్లవలసినదే (నా) యీదినము౫ గంటలకు సభ అనినోటీసులలో అచ్చువరిచితిమి 6 గంటలైనది.

తిరు - నేనొక కథ ఇచ్చెదను - దానిమీద గంటకు 50 పద్యముల చొప్పు॥ చెప్పితే నాజందెములు తీసివేసుకొంటాను

రాజు - ఏమికథ

క॥ శుభదమ్ము వ్రాఁత తమకే, కాపురుషత గలుగఁ జేయుఁగాని పయికి రా
నోపదనుచు లిఖియించిరి, పాపము! పాపంబు దాఁప బ్రహ్మవశంబే. ౨౫౧

మ॥ సభకుఁ దిర్పతి పోని మాటనిజమే, శతుౡత్వమున్నప్ప డా
సభకుఁ బోవఁగ నేలకో యింతకుఁ బరీక్షాసంగతింబట్టి యా
సభ యేర్పడ్డది యెట్లొకో? ముస్సువృథగా "చాలంజి" తూలించి పా
యుభయభ్రాంతులు పాడు పాటలు విన్నఁ రోఁ తౌఁగదా? శాంకరీ ౨౫౨

తిరు - భీష్మజననము
రాజు - దీనిలోనేమికష్టము
తిరు - అట్లాఅనకుడు - గంజాము వారింటిలో -సీతాకళ్యాణము - స్త్రీవ (ర్ణ) (పురవర్ణన వనవర్ణనలు - ఇదివరకు వారువర్ణించుకున్నవే - చదివిరి- భీష్మజననములో మాటరులేదు - కాబట్టి దీనిమీద 50 పద్యములు చెప్పలేరు - చెప్పితే జందెములు తీసుకుంటాను
రాజు - పందెమునకేమి - వద్దురండీ,
తిరు - నేనురానుకాని అదిఅడుగండీ,
రాజు - ఇంతమాత్రానికింత బింకమెందుకు-అని 6 గంటలకు సభకువచ్చిరి - వారే (ఆ)గ్రాసనాధిపతులు -ఉపాగ్రాసనాధిపతులు వంకా వెంకటరత్నప్ప శాస్త్రి - భీష్మజననమే కోరిరి - దానిమీద గంటకు - 3 - 4 - 5 వందల చొప్పు చెప్పితిమి - సభ్యులందరు పరమానందాశ్చర్యము నొందిరి - పలువురుపన్యసించిరి - కవులనేకులు పద్యములు చెప్పిరి - ఆకవులలో తిరుపతివెంకట కవులకు తెలుగునకు గురువుగల్గె - ఆంధ్రపాణినీ(య) ధ్వబిరుదాంకితులైన బ్రహ్మశ్రీ పాటివెంకటస్వామినాధగారును ఉత్క(న)దేశ బ్రాహ్మణుడుగూడ మిగుల స్తుతించెను - వారిపద్యములలో నొకటి ఇం దుదహరించితి

మ॥ యతియే యుండదు ప్రాసమే గదియ దేయఁశంబునం దన్వయ
స్థితియే లేదు సమాస మిల్ల యనివిద్వేషంబుతో బలుకా పం
డితకాకంబుల దుష్ప్రలాపములు శాంతింబొందెడుఁ సభ్యులై
ప్రతతాశూక్తులఁ గొప్పఫుంగవుల కావ్యంబింత యాల్కించినఁ

ఇట్లు నేకులు చదివిరి - ఇలాటి పద్యములు శత్రువుల హృదయములకు బిడుగులుగదా?

వికృ (రు) సమాసమనియు - అసూయాగ్రస్తుల మాటలు పాటింపరాదనియు మిగుల శ్లాఘించిరి - వెంకట రత్నప్పశాస్త్రిగారు సరస్వతీ స్వరూపులేయని స్తుతించిరి- తరువాత సభ్యచిత్తానుసారముగా రు 2 నూటపదులు 2 బంగారపు బ

ఉ॥ పోలవరంపు శ్రేః దరిగి పొందుట మెచ్చిన మెచ్చు విన్నచోఁ
జాలదె? యూతఁడేమనెను సత్యము నీహృదయం బెఱుంగు నా
శీలవదగ్రగణ్యు కడఁ జెన్నలరారెడువా రెఱుంగుదు
ర్గోలయుఁ గూడఁ గైత యనుకోవిదుఁ డాతఁడు గాఁడు శాంకరి. ౨౪౩

---

తకములు - యివ్వంబడెను.

సభాంతము - మేము చెప్పిన పద్యములు.

సీ॥ జంజెంపు బంజెంబు సంగ్రహించువారల జాడింపమే సభాస్థలికి జేర
తొడదట్టి కడుమిట్టి పడునట్టివారల జాడింపమే సభాస్థలికి జేర
మీసాలపంజెంబు వేసిదూకెడి వారి జాడింపమే సభాస్థలికి జేర
గోడచాటున జేరి గోర్లు గిల్లెడివారి జాడింపమే సభాస్థలికి జేర

గీ॥ అరయ పదియవనాటి ముత్తైదువలనఁ, జాటు మాటున జేరి వాచాటులగును
వాగుటదియేల సత్సభాభవనమునకు, నాడిమై చేరి (ని) [illegible] పోవలయూగాత

ఉ॥ ఆతడు మూతిమీసముగలట్టి మగన్న యె యయ్యె నేని తా
నీతరి వచ్చి సత్సభ నహీనగతిన్ జయమందవచ్చుగా
(1)కోతివిధాన నెందు సొరకో తలు కోసినలాభమేమి, యీ
ఖ్యాతియె తొల్లియున్న నిటు చెప్పక పొమ్మనెకొ యంటు గల్గునే

అనియిట్లు పలుపద్యంబులు చెప్పిద్వైపాయన(హ్ర)దము నందు (2) దుర్యోధను డు (లే)చిడాగగా ధర్మరాజాదులెట్లు పలికిరో అట్లే పలికితిమి, కాని ఆదుర్యోధనుడు మానధనుడగుటచే హ్రదమును వెడలి యుద్ధమునకు వచ్చెను తిరుపతి శాస్త్రి తద్వ్యతిరిక్తుడగుటచే సభలో నెన్నియనినను యెవరెట్లుపలికినను ఒకమాటైనను మాటాడకనింటిలో యుండెను ఆసభ ఆప్రకారముగా జయజయేతి శబ్దంబులతో ముగిసెను.

పిదప - వెంకటశాస్త్రి ఇంజరమునుండి తిరుపతి శాస్త్రిచే పిలుపనంప బడివచ్చెను అతను వచ్చినతరువాత తెనాలిపోష్టాఫీసుదగ్గర బహ్మానందరావుగారింటిలో మరియొకసభ.

ఆసభకు - తిరుపతికిని - వెంకటశాస్త్రికిని - అందరికి బంపినట్లే ఆహ్వాన పత్రికలు బంపిరి - ఆఆహ్వానపత్రికలు తీసుకొని వెళ్లినవారితో మేము రామనిచెప్పిరి.

ఆసంగతిని విని బ్రహ్మానందము గా (నే) వెళ్లిపిలిచిరి - పిలిచిన రామనిరి - అంతట శ్రీవెంకటస్వామి పాఠీగారును మరికొందరును కలిసి వెళ్లిపిలిచిరి- మేము రామనిరి - అప్పుడు వెంకట స్వామిగారికిని వారిలో వెంకటశాస్త్రికిని జరిగిన సంభాషణ.

చ॥ ఘనులగువారిలక్షణ, మొకానొకఁ డేదియొ విద్దె చూపనె
మ్మనమది రోయుచుండినను "మంచిగనున్న"దటంచుఁ బైకి మె
చ్చును గనఁ జేయుటేగద? యశోభరితుం డగు కృష్ణరాయధీ
ఖని మనవారియాశువును గాదనునే సభలోన శాంకరీ. తి॥వెం

---

వెంకటస్వామిగారు - వెంకటశాస్త్రిగారూ? మీ రెందుకు సభకు రారండి,

వెంకటశాస్త్రి - మేము రాము

స్వామిగారు - తిరుపతి శాస్త్రిగారు వెంకటశాస్త్రిగారు పోవద్దనియుత్తరము వ్రాసిరికనుక నేను రానని కాలేజీలో జరిగిన సభ నాడనినారుకదా? యీదినము మీరిరువురును ఉండిరామని యనుటకు కారణమేమి.

వెం॥ శాస్త్రి - ఎందుకో రామన్నాము, అది మీ కెందుకు.

స్వామిగారు - మీరుమాకు మిత్రులగుటచే మిమ్ములను యీ బాలకోపాలము కొప్పరకవులను చూచి తిరుపతి వెంకటకవులు భయపడినారు కనుకనే రెండు సభలలో వారు వీరిని ప్రతాపోక్తులబలికి సభకురమ్మనియు దానిలో పదియవనాటి ముత్తుయిదువలసియు నతికఠోరముగా బల్కినను రాలేదు - యింతటి అసమర్థులగు తిరుపతి వెంకటకవులు కొప్పరకవుల మీదికి కాలుద్రవ్వుట ఎందుకు, అని ఎచ్చటచూచిన మిమ్ములను దూషించుచుండుటచే నేము విని సహింపలేక మేము పిలుచుచున్నారము.

వెం॥ శాస్త్రి - ఎవరిట్లు అనుకున్న మాకేమిగాని నేను ఒకప్రశ్నయిచ్చెదను అది ఆనాటిసభలో గంటకు పదిపద్యములచొప్పున చెప్పనయెడల నేను చెవిని కోయించుకొనెదను.

వెం॥ స్వా॥ ఆహా మీతిరుపతిశాస్త్రిగారు జందెంబులపందెంబులు వేసుకొనిరే, అంతే, మీచెవులపందెము.

వెం॥ శాస్త్రి - అట్లాగా - మాతిరుపతిశాస్త్రి పిచ్చివాడుగనుక సకలవర్ణనములు గలకథ కోరెను - నేనుకోరునది అటువంటిది కాదు -

వెం॥ స్వా॥ అదియేకథ చెప్పండి॥

వెం॥ శాస్త్రి - అభిమన్యువధ.

వెం॥ స్వా॥ యిదికష్టమే, అయిన వారికొక లక్ష్యము గాదు,

తిరుపతి॥ ఏమండో వెంకటస్వామిగారు, యీకథ భీష్మజననము వంటిది కాదు, మావెంకటశాస్త్రి కోరినది, అభిమన్యుకథ అండో.

వెం॥ స్వా॥ యేది యెట్లయినను తమరు రండీ.

తి॥ వెం॥ మేమిద్దరము రాము.

వెం॥ స్వా॥ రాకపోతేమీరు వోడిపోయినట్లే

తిరుపతిశాస్త్రి - అవి లేకాని మీరుపోండి.

ఉ॥ ఆయనగూడ సభ్యుండయి యందఱతోఁ బల యూఁచెనంట! యా
రేయి మొదల్ సదా హృదయరీతి వెలార్చుచునుండు శాఖకై
సాయము సేయ నెంచుచు ససత్యపు మెప్పులు మెచ్చు వారిలో
నాయనఘుండు చేరఁడు యథార్థము పల్కఁగ వింటి మంబికా. [illegible]

---

వెం॥ స్వా॥ పోతే తప్పదు చెవులు పూసుటుందిలెండి, అనివచ్చిరి - ఆసభలో గం
టకు 500 లైన చొప్పున పద్యములు చెప్పితిమి బహుమానము జరిగినపిదప.

సీ॥ ఘోరసింహం(బు) లట్టులకొప్పరఁపు, కపులు పసు దెంచినాటి (రీ) కాకినాడ
యందుకవితో(న్న)తినివిజయ(వి)ధ్వజంబు, ము(న్న)నైదేని పీసముగ(న్న)యెవఁడొ

క॥ కట్టితిమి విజయఘంటిక, మొట్టితిమదివరకు (కు) కవిమూ(ర్ధ)ము లగలన్
బట్టితిమి కాకపురి జయ, మట్టిట్టన రానిమిద(యా) శక్తి శివా

గీ॥ కొండ వీటిమహా గుహాకూ(రుగ్ర)జెందు, సింహములు రాగ నీ గ్రామసింహములకు
బ్రతుకుఁ దెరువును వర్తన పరిధవిలునె, చాటుమాటున మొరుగుటేజటుగు గాక

ఇట్లనేక పద్యములు చెప్పితిమి యీసంగతి నెవిని మఱునటి దినమునం దెవ్వ
రితో చెప్పకనె తిరుపతియు వెంకటశాస్త్రియు ఇంజరమను గ్రామమునకు వెళ్లిరి.
ఆగ్రామము కాకినాడకు కొంచెము దూరము.

పిదప - పైడా అయ్యన్న శ్రేష్ఠిగారు తమగృహమున నొకసభ జేయింప
గా నచ్చటి కింజరమునుండి వెంకట శాస్త్రితనమిత్రులను కొందరిని పంపించెను.
ఆసభాధిపతి "తిరుపతిశాస్త్రి యిమ్మన్న మాటకు మీరుబదులు ఏమిచెప్పిరని విని
యడుగగా,

గీ॥ బుఱ్ఱగొరిగించి సున్నపు బొట్లు పెట్టి, ఖరము నెక్కించి యూరేగగా నొనర్చి
మాలదాసులు చీయని గేలిగొట్ట, తిరుపతిని వెంకటన్నను త్రిప్పినా(ము.)

పిదప - కాకినాడ పుర లక్ష్మి చేత సెలవునొంది - నిడదవోలు వచ్చుసరికి
తణుకు - నర్సాపురము - భీమవరము - కరణములు జమాబందికిరాగా అచ్చటి
డిష్ట్రిక్ కలెక్టరుగారు తమవలెనే వివిధోత్సవములతో మిగుల గౌరవించెను - పిదప
ఇంటికి వచ్చికుశలముగానుండి నారము - మేము ఇంటికి వచ్చి తమబాబును ప
ద్యసమూదయము జూచి పరమానందము జెందితిమి - తమరు కవిత్వ పరిశ్రమ
జేయుటగూడ మాకు చాలా ఆనందము కలిగించినది.

గీ॥ షట్సహస్రి నియోగి వంశజులయందు, శ్రేష్ఠపదవి వహించి ప్రసిద్ధికెక్కి
తనరు మీక్షేమలేఖ మోదంబుగూర్చె, నయదయా కర్మ శ్రీ......శర్మ.

చ॥ నరుఁడయి ధాత్రియందు జననం బయినాడని యన్నమాత్రసం
బరమగునే, నదాన్నతియు భాగ్యము సాహసముల్ వదాన్యతా
పరిణతియుల్, బ్రసంగవశ వంశము వృద్ధియొనర్ప గావలెన్-
మారుపుగ — — —యివియన్నియు గల్గెను నీకు [illegible]

ఉ॥ ఆయన యాజ్ఞ మీఁద నిటు లంబరొనె వ్రాయ మసత్యమైన చో
జీ, యనుఁ గాక మమ్ము నను నుశీలుఁ డతం; డది నిక్కమేని యూ
హీయుతుఁ డూరకుండుతఁ గుశీలురగోల లడంప సాక్షిగా
వ్రాయుమమున్ మదిన్ విపులవంశజుఁ డా యనఘుండు సైఁచుతన్ ౨౫౫

---

క॥ మెచ్చితిమి మీమకవనము, మెచ్చితి మెద నీనయంబు మెచ్చితి మెంతే
హెచ్చగు నీయభిమానము, నచ్చిన వేడుకను———————సుధీరా॥

ఈ వార్తను ప్రాజ్ఞులును బంధువులును యనవద్యులును నైన బ్రహ్మశ్రీ రామబ్రహ్మము గారికిని బ్రహ్మశ్రీ ఉలిమిపిచ్చయ్యగారికిని, బ్ర - మునిపల్లె వెంకటసుబ్బయ్య గారికిని శ్రీలింగయ్య గారికిని, శ్రీవేంకటేశ్వర్లు గారికిని స్కూలుమాష్టరులకును మన సర్వమిత్రవర్యులకును వినిపింప గోరెదను.

మీ అల్లుడు గారును నయశీలురైన శ్రీ———గారియొక్కయు పుత్రికాపుత్రికులయొక్కయు మన బంధుమిత్రులకుటుంబవృద్ధియొక్కయు కుశలము వ్రాయించ గోరెదను చిరం॥ మాతమ్ముడు వెంకటరమణశర్మ ఒక అవసరముచే చెన్నపురికి వెళ్లినాడు - ప్రస్తుతము నావశ్యమని తోచి యచ్చట నేయుంచితిని - తాను కవితావృద్ధి యొనరించి సంతోషము నంగుడు, మేమందరము కుశలము - కొన్ని యాహ్వానములు వచ్చుచున్నవి - ఇప్పుడు వెళ్లను-

చిత్తగించవలెను
కొ॥ వెంకట సుబ్బరాయశర్మ,
(అనియున్నది)

ఇట్లు కొరికూర్చుండి తమయొక్కయు సదృశులగు కొందఱు శాఖాభిమానుల యొక్కయు మనస్తుష్టికై కల్లిబొల్లి వ్రాఁతలను నింపుటయే కాక అందితరులను బూర్తిగా దూషించుచునుత్తరకుమార ప్రజ్ఞలను వెళ్లఁగ్రక్కెడి యీ మాసోదరుల వ్రాఁతలను విమర్శించుభారమును లోకమున కే వదలుచున్నారము, ఇందు "పాడి వెంకటస్వామిగారు చెప్పిన" దని వ్రాసిన పద్యములో "పండిత కాకంబుల" అను మాట మనోరంజని పాఠముకన్న భిన్నముగా గన్పట్టుచున్నది. దీనిం బట్టి మొదటి పాఠ మిదియే యనియుఁ బిదపఁ బత్రికాసంపాదకుఁడు గారు 'కాకాయితే' అని దిద్ది యుందురనియుఁ దెలియనయ్యెడిని, మఱియు వీరు రహస్యముగా వ్రాసిన యీ యుత్తరమునం గల సదుద్దేశములను వీరు దర్బారులోఁ బ్రచురించిన జ్ఞానోపదేశమునందలి ముద్దుఁబలుకుల

ఉ॥ అతఁడి వీరి కైత విని యాతఁడు చెందిన యేవగింతయుఁ
బ్రాతు మాటసన్నఁ బోలవలె బండ్లను గాగితముల్, వివేకితా
ఖ్యాతుఁ డతండు వీరి నడుగం దగుమాటలు పృచ్ఛ చేసె నీ
కాతఁడి నేమి చెప్పెరో రహస్యము తప్పిదో నీవఱుంగవే — అంగ.

నుండియు, మఱియుఁ గాకినాడసభలోఁ జెప్పినట్లు మనోరంజనిలోఁ బ్రచురింపఁబడిన పద్దెము నుండియు, మఱియుఁ గాకినాడనుండి వీరుబయలుదేరి వచ్చునప్పుడు రచించిన సీసగీతపాదమునుండియు నెత్తి చూపుచున్నారము.

(1)॥--ముష్టిచెంబుం గొని పెట్టుమంచడుగఁ బోతిరొ తిర్పతి వేంకటేశ్వరుల్॥
(2)ఉ॥... వెఱ్ఱిచేష్టలన్ । జేసితి రిద్దివానిఁ గలశేషమె తిర్పతివేంకటేశ్వరుల్॥
(3)ఉ॥...మీకొఱగాని కృత్యములు మీ చదువోకలు నెంచలేదె! మీ
కావులగూడు పాత్రములగాకు ఘటింపఁగఁ జూనలేదె, మీ
కీకులుఁ జింతలున్ బయలుజేర్పఁగనూకొనలేదె యొందఱీ
కాకరుతంబు లేటికి వగన్ గొన దిర్పతివేంకటేశ్వరుల్॥
(4)చ॥...చంకదుడ్డు శరణార్థులు తిర్పతి వేంకటేశ్వరుల్,
(5)చ॥...కాకరపర్తిని శృంగభంగమై
పరువును మాపదో నిజముఁ బలుకఁడు తిర్పతివెంకటేశ్వరుల్॥
6)చ॥...రావణ కుంభకర్ణుల, న్యులయభివృద్ధి కించుకయు నోర్వక.
యే, యెలమిని గాంచి రద్ది గ్రహియించుఁడె తిర్పతివేంకటేశ్వరుల్।
(7)చ॥...అ, జ్ఞతచెడ నిక్కుచు నెక్కి తిరిగాకట! తిర్పతివేంకటేశ్వరుల్
(8)చ॥సి, గ్గును గన కేల డంబమును గొట్టెదరు...తిర్పతివెంకటేశ్వరుల్॥
(9)చ॥ -- కౌరవు లేమిధ్యైరొకో తెలియుఁడు -- తిర్పతి వేంకటేశ్వరుల్॥
(10)ఉ॥ -- నాటిసభ నెల్లరు మిమ్ముఁ బరాభవింపమా, చేసిన సాయమున్ మఱవఁ
జెల్లునె జన్మశతాలకేనియున్.
(11)ఉ॥ -- నేఁడిటులు పేలఁగ నెవ్వరి యూఁత వెల్వఁడీ.
(12)ఉ॥ ప్రాసములున్ విరామములు పాడొనరించుచు బూతుపద్దెముల్
వ్రాసిరి నాటకంబులుఁ బ్రబంధములంచని పేరుఁ బెట్టియు
ద్వాసన మాచ ంచి రలపాపికి వి మార్గము లట్టి వీరి కి
రోసము లా యటంచు మిమురోయరె తిర్పతి వెంకటేశ్వరుల్.
(13)ఉ॥ కాఁకరపర్తి యేసలిపె గర్వము మానిపి శృంగభంగమున్
కావులయట్లు బాఱఁగఁ జికాకొనరించెను పైడివాడు పై

చ॥ అటు కడు దైన్య మయ్యెనఘుపగ్రిమునన్ బవరించి యాఁగ! పి
మ్మట దకటాంకు లాడున లమానిసులన్ సమయంబు వచ్చుచోఁ
బటుమతి కృష్ణరాయనరపాలుఁడు బైటికిఁ బెట్టఁడో కొఱ్ఱె? ఏ త
క్కొటి ధ్వజ యాతఁ డెన్నఁటికిఁ గాఁడని వ్రాసితి మంబ! యింతయున్ ౨౫౭

ఉ॥ వ్రాయక మానుటే మెఱుఁగు, వ్రాసిన లాభ మొకింత లేదు, యా
ధీయుతుఁడే వచింపవలెఁ దెల్పి జనింపవలెన్ మొగాల, నీ
వ్రాయుట యెంత? యిం కెదియు వ్రాయఁగ లేకయెపోతి మాతఁ దే
సేయవలెన్ బ్రసంగ, మటు చేసిన చో విని తీరఁగావలెన్ ౨౫౮

---

గోకుల పాటుఁ దెచ్చి బలవంతముఁ బా పెను గొప్పరం బికన్
గాకలు మాని యెందొ తలఁ గుర్కుఱ్ఱడు తిర్పతి వేంకటేశ్వరుల్

(14) మ॥ — ఎఁడుగండి కవులారా? — —

(15) మ॥ — — మీ, యసమర్థత్వము దుర్జనత్వమిఁకఁ గట్టా! నేఁగి సంధింపదే.

(16) సీ॥ — — మిమ్ము బొమ్మలఁ జేసి (1) తిమ్మాటలాడించి పోరుఁ బెంచిన — —
(ఈ ప్రల్లదమునకు, 1912 సం॥ జూను 18-19 సంచికలు దర్శాగు చూ,)

(17) చ॥ — — తిరిపపుఁ (1) దిమ్మపోతరము దింపి జయంబిడు మమ్ము శాంభవీ" (15వ
జూలై 1912 సం॥ 8 వ సంచిక మనోరంజని చూ.)

(1… — మహిమ నీ కాకినాడ నస్మద్ధ్వజయపు। (3) ధ్వజము నాటించి తీవె
…వాని" (చేగంటి బాపిరాజుగారు ప్రకటించిన పుస్తకము చూ.)

(19) "సీ॥ రోసమున్న నిజంబైన మీసమున్నఁ, బాజిపోవుట గూడదు పంద వగు
చు; ద్వైత…ముసఁ బాండవోత్తములచేత, సింధుపతి వడ్డపాట్లు గాంచెదవు రమ్ము

(20) శా॥ ఆశలడంగి నీగురులయంతటివారెదిరింపలేక యూ, వేశము దక్కియుండె రిఁ
కఁ బిన్నవు, కాఁగలవాఁడ విప్పుడే, యాశుకవీంద్ర సింహముల కాగ్రహమున్
గలిగింపఁ బోకవ, త్సా! శివరామశాస్త్రి సుగుణాఢ్యుఁడవై యశమున్ గడింపుమా

పైనుదాహరించిన 19-20, సంఖ్యలు గుర్తుగాఁగల పద్యములు శివరామశాస్త్రియెదుట లేకున్నప్పుడు గన్నవరంలోఁ గొప్పరపువారు నోరు చేసికొన్నవి; 1913 సం॥ 15 డిశంబరు, జనేవరు 12-13 సంచికలు మనోరంజని చూ. ఆయీ వాదకుల ప్రల్లదములు పిదప వారు తప్పుకొన నెంచెదివికావు వారి యుత్తరములోని యంశము లీప్రల్లదముల కించుక దాఁటినను మొత్తము సారాంశ మొకటే, ఇదిగాక ఆయుత్తరములోని పాట వీరు చెన్నపురి మొదలుకొని కొప్పరమువఱకును గనుపడినవారితో

ఉ॥ ఆయన యుత్తరం బొకటి యంపుట సత్యము, అంతె కాని మ
న్నాయన వచ్చి పిల్వఁడ యనంతర మాయన ప్రశ్న వద్దికే
పోయి వచించినార మటు; బుద్ధిమదగ్రణి యాతఁ డట్టిచో
ప్పీయకొనండ, యీ ప్రథతఁ డహీనుఁడు వేఱొకలాగు చెప్పనే ౧౬౩

ఉ॥ ''వెంకటసామిపల్కె,, నని వీరలు వ్రాసినజాబు సర్వమున్
బొంకుప్రసంగ, మాతఁడును బొంకఁడు యోగ్యుఁడు, ''బొంకు,, మంచు ని
శ్శంకుఁ డొకండు చెప్పఁగల సాహసుఁ డుండెడుఁగాక నీకుఁ దా
జంకఁడె యంబరోపి కడు నసత్యము సత్యమనంగ నేర్పునే ౧౬౪

---

సరించినవారమగుటచే ముద్రించినందులకు వారుకృతజ్ఞులై తాముప్రకటింపఁ బోవుః జల్లిసీమ, నారాయణశాస్త్రిము, లోనగు చరిత్రగ్రంథములలోఁ దత్సూచకముగాఁ బరివర్తించి సత్యము విలువ నెఱిఁగి ముందేగుదురు గాక, నకలు మాకుఁ జేరిన విధమును జూపుచున్నారము.

1...కొప్పరకవులు జాబులిఖించిసంపిరి. అందంతయు తమ్ముల నిందించుటయే తప్ప వేరేమియు లేదు, మీయుభయులను పోలవరపు జమీందారుగారైన శ్రీకృష్ణారావుగారు వారుచేయించిన కాకినాడ కాలేజిలో సభకు రమ్మనమని వ్రాలెంత వేడినను తమరు దానికియ్యకొనలేదట, ఆదిగాగల సంగతులతో ఎదుటనుండి గమనించినవానిరీతిగా సంభాషణ యంతయు వింతగా వ్రాసిరి... దాని యథార్థమంతయు మాకు దెల్పిరి, ఆజాబునందలిమాటలు చాలాకర్ణకఠోరముగానున్నవి, అందంతయువారి యౌన్నత్యమును. మీ — ప్రకటించుమాటలే కాని వేరేమియు లేవు, దానియొక్క నకలు నావద్దకలదు, తమకుపంపుమన్నచో పంపెదను, తమరు ఆగ్రహాస్తుని. పేరుమాత్రము మీయచ్చుగ్రంథములయం దెచ్చటను ప్రకటింపవద్దని నా ప్రార్థన, ... దానినుండి యీక్రిందిదానిని యెత్తి వ్రాయుచున్నాను.—ఏమియీ సాహసము, ... వీరు శాఖాభిమానమే చేయూతగా చేసికొనియున్నారు, వెంటనే జాబువ్రాయ ప్రార్థితులు (చేబ్రోలు)

2...వారు వ్రాసిన అసలుత్తరమునకు నకలు పంపుచున్నాను,...యిది దానికి సరియైననకలని తమరు నమ్మవచ్చును, యీయుత్తరమును... గారికి వ్రాసిరి,...మీకును వారికిని సరిపడక పోయినను వారి కౌన్నత్యమున్నచో దానిని స్థాపించుకొను విధము లనేకములుండగా దూషణచేత జయింప నుంకించుట నాకు చాలా కష్టముగానుండి నే మీకిది పంపుచుంటిని... చూచి తమరు దీనిని మీయిచ్ఛవచ్చినట్లు వాడుకొనవచ్చును, నాకుతమయందు గౌరవపూర్వకమైన భక్తియె యిట్లుచేయను నన్ను పురికొల్పినది. (చేబ్రోలు)

ఉ॥ వేరొకరుండు తోడగుల వెంకటనామునిగూర్చి సందియం
బీరలిం దోఁపఁజేసె నతఁ డెంతయు యోగ్యుఁడెయైన; నింక వీ
రెరిని పేరు గుర్చిచ్చిరో యికెంతయు వారలఁ గూర్చి శంక చె
న్నారద నూర్యుఁ డింకొక దిగంతరమం దుదయించెనేనియుక్ ౨౬౫
మ॥ "సహవాసమ్మున సబ్బుఁగాదె గుణదోషంబుల్, మహాపండితుల్
బహుమానించెద రీవిశేషమును సంబంధంబు తత్తాదృశం
బహముక్ చేయియు నుండు హేతువున యోగ్యత్వంబు చెన్నారుధీ
మహితుల్ వెంకటసామిఁగూర్చి మదిలో మాకబ్బె సందేహముల్ ౨౬౬

---

3. ..అప్పుడు యీజాబుచూపెను, యీజాబు నీకెట్లుదొరికెనగని .. అడుగగా అతనిట్లనెను,...అందువలన ఆఉత్తరమును వీరికి చూపమని...గారికి వ్రాసిగి. వారట్లుచేసిరి దానిని నేను చూచి ... సరియైననకలు తీసుకొంటిని" అని... చెప్పినాడు యిదియె నాకదొరకిన విధము నిన్ననే మీకుపంపుటకు ఆ...వద్దనుంచి యీసంగతులకు జవాబుతెప్పించుకొని వ్రాయువమని యనుకొని యతనికి వ్రాసితిని, అతను వెంటనే జవాబు పంపనందున నేడే మీకిట్లు వ్రాయుచున్నాను మీకతను వ్రాస్తే వ్రాయవచ్చును అది సరియైన నకలేను... (చేవ్రాలు)

1. ...శ్రీకొప్పరపుకవీశ్వరులు కాకినాడాది గ్రామములకు వచ్చినపుడు అక్కడ జరిగిన సభలలో మిమ్మును దిరుపతి శాస్త్రిగారిని ఆహ్వానము చేయగా రామని మీరు చెప్పినట్లున్న అగదుమీద కొన్ని ప్రశంసలు జరిగినట్లున్న, ఇంకా మొదలైన కొన్నిసంగతులతో శ్రీకొప్పరపుకవీశ్వరులు తమమిత్రులయిన ... వారికి వ్రాతపూర్వకముగా తెలిపినారు ... ఆఅంశములన్నియు విశదముగా...వల్ల తమకు విశదమైనట్లునాను... వద్దనుంచి ఉత్తరమువచ్చినగి, తమకు పంపిననకలు శ్రీకొప్పరపువారు వ్రాసిన లేఖకు సరియైన నకలైయున్నది... అచ్చటచ్చట అక్షరములలో కొన్ని పొరపాటులు పడియుండవచ్చును... శ్రీకొప్పరపుకవులు పంపిన దాసినకలు నావద్ద చూచి నిజము తెలిసికొవలెనని నావద్దనుంచి తీసుక వెళ్లినారు తిరిగి తనవద్దనుంచి తనకు ఉత్తరం వచ్చినట్లు యీరోజువుత్తరం వ్రాసినారు అందువల్ల దీనిని తమకు విశదం నిమిత్తం వ్రాసుకున్నాను. శ్రీకొప్పరపువారు వ్రాసిన వాటిలో యథార్థమును మాకుగూడ తెలుప ప్రార్థించుచున్నాడను. చిత్తగింపవలెను. (చేవ్రాలు)

పైయుత్తరమ్ములన్నియు వారివారి వ్రాళ్లతో నుండినను శాఖాభిమానులవలనవారికేయుపకారమేని జరుగునని యెంచి వ్రాళ్లను కొన్ని సందర్భములును విడువఁబడియె, ఈయంశము 105వ పుటలోని యథార్థవాదిగారి యుత్తరము మఱికొంత విస్పష్టపఱచఁ గలదు.

ఉ॥ వెంకటసామి కుండెనొకొ వేలకు వేలుగ గుండియల్, వృథా
కొంకక యట్టి వాదమునకుం దిగునే శివ! యెవ్వఁడో నిరా
తంకుని గూడి "కాకు", అని తజ్ఞుల మాటిన మాటుఁ గాక యీ
పంకము నీఁగుపెట్టనిన వాక్కుఁక నాతనికిన్ జయించునే ౨౬౬

ఉ॥ వెంకటశాస్త్రితో నటులు వెంకటసామి వృథా ప్రసంగముల్
శంక యొకింత లేకయును సల్పఁగఁ గారణ మేమొ? యైనచో
నింకొకమాఱు చేయుటకు నేటికి సందియ మింత మేల? యీ
బొంకుల కాతఁ డొప్పునెడఁ బోవలె నాతని మీఁది కయ్యెడన్ ౨౬౭

ఉ॥ ఊరక వ్రాయు వ్రాఁతలకు యోగ్యసి నాపసిగూర్చి వ్రాయుటల్
సారవిదుల్ గణింప, రెకసక్కెపు వ్రాఁతకుఁ బూని యెరిసో
మాఱఁగ నెంచి పండితుల దూషణ చేసినదానఁ జేసి యా
కాఱులు నైఁపరామి సిటుగా వచియించితి మింత యొప్పదే. ౨౬౮

ఉ॥ "పాడి", యనంగ నీతి యగుఁ బండితులం బడఁదిట్టఁ బూనుచోఁ
బాడికి నేమి యర్థ మగుఁ బండితు లేమి యొనర్చి రీతనిన్
వేడుక యయ్యెనే? యకట! వెంకటసామికిఁ గూడ; నేరి నో
నాడనివాఁడు పండితుల నాసనె కాకులు గాఁగ నక్కటా

ఉ॥ "కాదతఁ డట్లు వ్రాయఁ", డనఁ గన్పడుచుండెను వ్రాఁత యిట్లుగాఁ
జేదయిరోకొక్కా పండితులు, చెన్నఁటి యెవ్వఁడో వ్రాయుమన్నచోఁ
బోదల తెల్గు పాణిని స్వబుద్ధిగఁ బోవలె మున్నిటుల్ చనన్
లే దలమేటి పాణిని' బలే! బలె! పాణినిగారు పుట్టిరే. ౨౭౦

చ॥ "బిరుదిడినాఁడు నాకనుచుఁ బెద్దకు నేడిటు వ్రాయఁబోయి సం
స్కరణ మొకింత కల్గియును జక్కనిధార వినూనమౌట న
క్కరణిని జెప్పఁ గాఁ బుధ కాండము సర్వము మాఱఁ బోవఁ దె
వ్వరినొకొ మాఱియుండెను", నన వాస్తవమే యగు, దిద్దికోఁదగున్. ౨౭౧

ఉ॥ ఒక్కరి గొప్పఁ జేయుటకు నొక్కరిఁ దిట్టినఁ గాని గాదె? యే
మక్కట! పండితప్రవరులందఱు కాకులె, యెంతవాఁడు? కా

సుక్కసిఁ బోలఁగాఁ గలుగునో? యిఁక నేసియు నిట్టిత్రోవలన్
ద్రొక్కక చక్కఁగాఁ దెలిసి దూఁకుదు వాకులు గట్టిపెట్టుతన్ ౨౭౩

ఉ॥ కాకపురంబు హాస మను కారణ మీనుడి తెచ్చి పెట్టెనో
కాకవితోడు నీడ యగు కారణ మీనుడిలోన దించెనో
లేక యశమ్ము లైకొనెడి లీలయొ? పాకపుసొంపొ! కంపొ? యూ
రాకి కడు మేరమీఱఁగ దరా? నవపాణిని గాఱిఘోరణుల్ ౨౭౪

తే॥గీ॥ అరిగె భీముండు సోముండు సురిఁగొనకటని, జరిగె సర్వజ్ఞదీక్షితసార్వభౌముఁ
డేమి! పేరూరి దౌర్భాగ్య మిపుడు పప్పు, శంకరుండంటని వ్యాఖ్యాతృచక్రవర్తి.

ఉ॥ ఇంజరమేము నిర్వ్వరము నేగుటగూడ నసత్య మొక్కఁదే
గెం జనుమీఁద నయ్యెడలఁ గేవలభక్తిని జేసి *యుత్సవం
బుం జరిగింప నెల్లరును బూసిరి యప్పుడు వారు వచ్చి పి
ల్వం జను దెంచెఁ దిర్పతి సభన్ బొనరించితి మంత నయ్యెడన్ ౨౭౫

ఉ॥ పోలవరంపు కోఁడరుగఁ బోవుచు నాసభ కేగ్లు తిర్పతిన్
జాల బలాత్కరించెడి ప్రసంగముగూడ ¶నసత్య,మే మనన్?
శ్రీలలితున్ జయంతికులశేఖరు రామయ గారిఁ జూడఁగా
నొవ్వి "మొటారు" బండిపయి నూరికిఁ దిర్పతి యేగె నదెవ్వసన్. ౨౭౬

ఉ॥ రామయ్యగారు కోటిగలి రాన లవారిని దోడుకొంచు రాఁ
గా మఱి కోఁడు బండిని దగన్ బనిచెన్, జనెవాని మీఁద నా
శ్రీమహితున్ గనుంగొనఁగ శ్రీపతి; వచ్చెను వేళ వాన దా
నామొయి మార్గరోధిగఁ బ్రయాణము మందత నొందె నంబికా ౨౭౭

---

(*1912 సం॥ జూలై 10 వ తేది ఆంధ్రపత్రికనుండి.)

జూను 18వ తేదీని శ్రీతిరుపతి వేఁకటేశ్వరకవులు ఇంజరము గ్రామమునందు శతావధానంబు నొనరించిరి. ఉ॥ మా॥ అలీషా కవిగారును నూకల అమ్మన్నశాస్త్రి గారును కవిత్వమును గురించియును అవధానమును గురించియును చక్కని యుపన్యాసములనిచ్చిరి. అవధానానంతరము శ్రీవేంకటేశ్వరకవులు సత్కరింపబడి జనులచే నూరేగింపబడిరి. నందిగోళ్ళ గోపాలరావు.

☞ ¶ ఈ యంశము ముందు 106, 107వ పుటలలో శ్రీవారి యొక్కయు సదృశులగు వేఱొకరి యొక్కయు పత్రాలుగల యుత్తరములవలనఁ దేలును.

చ॥ తిరుపతి యేడుగంటి లగుచేఁచుడు రామయగారు తాను ధీ
వరుఁ డగుమల్లయార్యుఁడును వచ్చిరి యేగినదొంటిగంటు, కే
కరణిని నైదుగంటలకుఁ గాఁడగు నిట్టిప్రసంగ మంబరీ సా
కిరు లిట రామయార్యుఁడును గేవలధీరుఁడు మల్లయార్యుఁడున్ ౨౭౯

చ॥ పదపడి ప్రొద్దువోవుపయి బండిపురమ్మున కేగుదెంచె న
య్యదనను దానఁ జేసియె మహాత్ముఁడు రామయగారుగూడ "వీ
రిది సభ"యం చెఱింగియును నేగఁగ లేదఁటరీ దీనితత్త్వ మి
య్యది, సభ కేగునప్పు డెటులౌ నటువంటిప్రసంగ మంబికా ౨౮౦

చ॥ మఱియొకయప్పుడేని యొకమాట వచించుట, దాని కుత్తరం
బరసి వచింపు, టాపయిని "నా" ననుకొంటయుఁ, గాక యట్లుగా
జరుగునె యంబరీవాద;మది సత్యమె యానెడ నిప్పు "డింతయున్
జరిగె," నటంచు మాన్యుఁడు సాక్ష్యమొసంగుట కేమిశంకయా ౨౮౧

ఉ॥ పోలవరప్రభుండు తనపొంతను దిర్పతి యుంటఁ జేసె యా
గోలకుఁ బూనుకొన్న నది కొందఱు వేఱుగ నెంతు రంచు స
చ్ఛీలుఁడు జంపనేమొ? యనిసాక్షుల నన్యులఁ జూపినార మా
శ్రీలలితుండె చాలు నిది చెచ్చెరఁ దీర్పఁగ నింద కేటికిన్ ౨౮౨

ఉ॥ వీరలు, కాకినాడయును, వీరు లిఖించిన పేళ్లు, నిక్కమే
యారయఁ దక్కసంగతుల యందొక లేశము సత్యముండినన్,
వీరు లిఖించుపోకడలు వీనము సత్యము గా, వసత్యపుం
ఘోరణి కేమి? ప్రల్లదపుదూఁకుడు కేమి వచింతు వంబికా. ౨౮౩

చ॥ "తిరుపతి వెంకటేశ్వరులు ధీరుల మేము జయించినార," మం
చౌరులకుఁ జెల్పి సంతసము నొందుట కింతయు సర్వి, రట్లు సం
బరపడరాదె? తిట్టులను వ్రాయఁగ నేటికి? చేతిచేటె? యం
బరో? యిది దాఁగ నేర్చునెటు, "వ్రాఁత బలింగొను" నం డెఱుంగవే. ౨౮౪

క॥ ఇదిగాక పెద్దలేమనిరి? రది నీ వెఱుఁగ నిదెటి యజ్ఞాలాకర్మంబున్
మది నెఱుఁగ రక్కటా! "శతం" వద, ఏకం మాలిఖ యనువా రలఁ దులాకో,

చ॥ ఎవరికి వ్రాయనేమియగు? నేగతి నయ్యది పైకిఁ బోవునో
శివ! శివ! చేయునట్టిపని చెడ్డది యైనను డించుకంత జం
కవలదె? యంతదాఁక మది గట్టిగఁ బట్టుక యేగి సన్నిధిన్
బవరపుగెల్పు దెల్పికొన వచ్చుఁగదా? తమయిచ్చ చొప్పునన్. ౧౮౫

చ॥ అదియును *బైకివచ్చుఁ జుమి యంబరో! సాజపుబొంకుపాడితిన్
బదపడఁగవచ్చు "లే"దనుచు; వ్రాఁతను నయ్యది వీలుగాదు కొ
ట్టదిదియుఁ గొంతమందిని, గడంగుదు రియ్యెడఁగూడఁ బొంకఁగా
నద నగుచోటఁ గొందఱు మహాత్ములు; చెప్పఁగనేల యిక్కలిన్ ౧౮౬

---

*శ్రీహయగ్రీవాయ నమః

హాల్ముకాం, పొన్నూరు.

(బ్రహ్మశ్రీ) చెళ్లపిళ్ల వెంకటశాస్త్రివారికి. నమస్కారములు,

ఇదివఱలో మాదేశవాస్తులగు కొప్పరపుసోదరులు కాకినాడలో నాశుకవిత్వము చెప్పినపిదప గుంటూరులో కొందరు పెద్దమనుష్యుల ముందు 'మిమ్ముసభలోనికిఁ బిలిపించిన రారైతిరనియు రాజావారిద్వార పిలిపింప నిదె వచ్చెద మని పరాఙ్ముఖులైతిరనియు పిదప మీరు వెరచిరానందులకు సభ్యులయెదుట, సీ॥ గీ॥ అకటా! పదియవనాఁటి ముత్తైదు బోలె, దాఁగియున్నారె,,అనియు, చ॥ గురుతలధించి దంచు నక్షుకున్ బెత్తుకున్ బలుగాకి కూసి సో, దరులగురా మకృష్ణులను దద్దయుదూషణచేసి నంతనే, జరిగెను శృంగభంగము,, అనికంసభ సందర్భమున శ్లేషగ చెప్పితిమనియు, మఱియొక కర్ణకఠోర మగుపద్యమును బ్రచురించి విజయముగొంటిమని చెప్పిరి, ఇందలి సత్యాసత్యముల విచక్షణసేయ పెద్దలిక్కాలంబున గానరారు, గాన తామైన సత్యమును బత్రికాముఖాలమునఁ బ్రచురించి చదువరుల సందేహనివృత్తి యొనర్పుఁడు, బలవద్విరోధమునకు జంకి యథార్థవాదినామమున నిటువ్రాసితి, వలయుచో నేను చిరునామ తెలుపుటయే కాక సాక్షిని గూడ కాగలను (యథార్థవాది)

యేర్పూరు,
24-2-12.

......సోదరకవుల యొక్క మాతామహస్థానము మాగ్రామమే అవుటవల్లనున్ను, శాఖాభిమానమును జూపక న్యాయపక్షముగా తత్కవులతో మాట్లాడుటవల్ల నున్ను, యీగ్రంథము విశేష అవసరమైయున్నది. తరుచు యీగ్రామములో నేయుంటూ దగ్గరలేనివాని యెసమూ దున్నను యీనిన చంపముగా యీగ్రా

ఉ. "వ్రాయనె లేదు మే"మనుచు వచ్చెడి వాదము దక్కె దీనిపై
నోయఖిలాంబ! వాద మికఁ నుండదు, సాహసు లెందుకేనియున్
రోయరు వ్రోయకుండుతఁ బరోక్షము నీ కొకఁ డున్నె నీదుకం
దోయిని గప్పనేర్పరులు తొల్లి వినంబడ రిప్పు డుండరే. తిరా

---

మము వచ్చినప్పుడెల్ల మాట్లాడుచుండగా మేము తద్విరోధనుగా మాట్లాడుచుంద మని మాయందసూయులై యుందురు

(చేవ్రాలు)

---

కాకినాడనుండి మ॥ రా॥ రా॥ ఆనరబిల్ కె, ఆర్ వి.కృష్ణారావు బహదరు బి. ఎ. గారును, రాయబహద్దర్ కె. సూర్యనారాయణమూర్తి నాయఁడుగారును, పంపించిన యుత్తరముల నీక్రిందపొందు పఱచుచున్నారము.

కాకినాడ
27-11-12

శ్రీకొప్పరపు కవులు కాకినాడ పురమునకువచ్చి సభయొనర్చి నపుడు తిరుపతి వేంకటేశ్వరు లాసభలో వారిచేఁ బరాభూతులైరని శ్రీకొప్పరపుకవులు అక్కడక్కడ ప్రసంగించుకొనుచున్నట్లు మా మిత్రుల కొకరు వ్రాసినయుత్తరము వలన దెలియవచ్చినందున నిజముగ నీపురమున జరిగిన సభావిశేషము లీక్రింద వివరించుచున్నారము.

శ్రీగంజాము వారియింట వివాహమున కాహూతులై శ్రీకొప్పరపు కవు లీపురమునకు వచ్చిరి వివాహసందర్భమున కేర్పడినసభ ముగియంబడిన తరువాత పురవాస్తవ్యులు శ్రీకొప్పరపు కవులచే గోరబడి యొకసభగావించిరి ఆసభ కాలేజిలో జరుపఁబడినది అందునకు శ్రీతిరుపతి శాస్త్రిగా రాహూతులయ్యును కారణాంతరమున రావైరి వారందులకు రాకపోవుట శ్రీకొప్పరపుకవుల క్షేమము కొరకేయని తలచి వారిని బలవంత పఱచమైతిమి పై సభ జరిగిననాడు శ్రీతిరుపతి శాస్త్రిగారు మాగ్రామములోనె యున్నవారు వారుభీతిజెందిపలాయనులైరని కొప్పరపువారు చెప్పుకొనుమాట లసత్యములును నిరాకరింపదగినవియును అగును శ్రీకొప్పరపుకవులకొరకీయూరజరిగిన సభలలో నెందునువారికిని వీరికిని సమావేశ ప్రసంగము జరుగనే లేదు కాలేజిలోజరిగిన సభవిషయమై శ్రీతిరుపతి శాస్త్రిగారిప్రోత్సాహనిరుత్సాహము లేమియును లేవు శ్రీకొప్పరపుకవులకును తిరుపతి శాస్త్రిగారికిని సమావేశ మీయూర నెచ్చటను గలుగలేదు మాయొద్దనుగలుగలేదు శ్రీకొప్పర కవుల మూలమున శ్రీతిరుపతి వేంకట కవులయం దుండుగౌర

ఉ॥ తప్పికొనంగఁ జూచినను దప్పద వెంటఁ బడుగా గవిత్వపుం
జొప్పు వెలార్చు పద్దెములు చొప్పశలాకలఁ బోలునట్టి వీ,
తప్పదు వ్రాఁత లోఁ గలవు తక్కిన వానిని వీనిఁ బోల్చు కొ
న్నప్పుడె "గుప్పు గుప్పు" మని యజ్ఞులకేనియుఁ గొట్టు వాసనల్ ౨౮౯

---

వ ప్రపత్తు లెవ్వరికిదగ్గిపోగలవి కావని మానమ్మకము ఇచ్చట శ్రీకొప్పరకవుల నిమిత్తమేర్పడిన సభలోని విశేషము లింతకన్న నిటవ్రాయననవసరము ఇచ్చటజరుపబడిన వనుకొనుగజారోహణాదులీసభతోసంబంధించినవికావు హానిగాధవేరు

K. R. V. Kristna Rao.

---

కాకినాడ
27-11-12

శ్రీ కొప్పరపుకవులీ కాకినాడ పురమునకు వచ్చి సభనొనర్చినపుడు శ్రీతిరుపతి వేంకటేశ్వరులాసభలోవారిచే పరాభూతులయిరని శ్రీకొప్పరపుకవులు అక్కడక్కడ ప్రసంగించినట్లు తెలియ వచ్చినందున నిజముగ నీపురమున మేము జరిగించిన సభావిశేషము లీక్రింద వివరించుచున్నాము.

శ్రీగంజాము వారియింట వివాహమున కాహూతులయి శ్రీకొప్పరపు కవులీపురమునకు వచ్చిరి. వివాహ సందర్భమున కేర్పరుప బడిన సభ ముగియబడిన తరువాత మేము నొక సభగావించితిమి. ఆసభ కాలేజీలో జరుపబడినది. అందునకు శ్రీతిరుపతి శాస్త్రిగా రాహూతులయ్యును కారణాంతరమున రారైరి. వారందులకు రాకపోవుట వారికి వీరికినిగల వివాదలను తలచి వారిని బలవంత పరచనైతిమి. పైనభజరిగిన నాడు శ్రీతిరుపతి శాస్త్రిగారు మాగ్రామమందునే యున్నవారు. వారుభీతిచెంది పలాయనులైరని చెప్పుకొనుమాట లసత్యమును నిరాకరింపఁదగినవియును. శ్రీకొప్పరపు కవులకొరకీయూరజరిగిన సభలలో నెందును వీరికిని వారికిని సమావేశప్రసంగములు జరగనేలేదు. కాలేజీలో జరిగిన సభవిషయమై శ్రీతిరుపతి శాస్త్రిగారి ప్రోత్సాహ నిరుత్సాహము లేవియును లేవు. శ్రీకొప్పరపు కవులకును శ్రీతిరుపతిశాస్త్రిగారికిని సమావేశ మీయూర నెచ్చటను గలుగలేదు. మాయెద్దను గలుగలేదు. శ్రీకొప్పరపు కవులమూలమున శ్రీతిరుపతి వెంకటకవులందుండు గౌరవప్రపత్తు లెవ్వరికి తగ్గిపోగలవి కావని మానమ్మకము. ఇచ్చట శ్రీకొప్పరపు కవులనిమిత్తము జరుప బడిన సభలోని విశేషము లింతకన్న వ్రాయనవసరము. ఇచ్చట జరుపబడిన గజారోహణాదు లీసభతో సంబంధించినవి కావు.

ఇట్లు
K. Suryanarayanamurti.

ఉ॥ గుంటపురమ్ము నందు ననుఁగుల్ లమచుట్టును జేరి "యుట్టులో
గెంటుఁడు నల్వదింటికిఁ దెగింపుఁడు ధారణతోఁ బనేమి? మే
ముంటి" మటంచుఁ బోలవది యౌని *బడల్పడు నప్పదేము తో
కుంటిమొ చుట్టువట్లఁ, జనియుంటిమొ యాసభకో మహేశ్వరీ. ౨౯౦

శ్రీ పోలవరపు జమీందారుగారిచేవ్రాలు గల పైయుత్తరము 95పుటలోని ౨౫౫వ పద్యమునకు విరోధకమగుచున్నది, ఏతత్పరిహారము, మాలో నొకరిది బందరులో నచ్చువేయించుటచే శ్రీవారికిఁ జెప్పకయే వారి నిందసాక్షులుగాఁ గైకొనిరనియు, రెండవవారు శ్రీవారితో మనవిచేసి వారియభిప్రాయమును గైకొనిపంపిరనియు, ఈయుత్తరమువచ్చువఱకే ఆపేజీ గలఫారమచ్చయియుండుటచే దిద్దపిలిచ్చినది కాదనియుఁ దెలిసికొన్నచో సంపన్నమగును, మఱియు ౨౨౭మొదలు ౨౮౦వఱకును గల పద్యములలోనియంశము శ్రీవారలయుత్తరములకించుక విరోధించునట్లు, తోఁచినను ప్రయాణము మోటారుమీఁదఁ గనుకను1 గంట వఱకుసుగ్రామములోనేయుంటచేతను, ఇంతకును చేసిన ప్రయాణమేని కారణాంతరమునఁగానివీరికి భయపడిచేసినది కాదనుతత్త్వము వారేకాక జగమెల్ల నెఱిఁగియుండుటచేతను నట్లువ్రాసిం దురని తెలియఁదగు, తక్కినయంశములు సోదరులయుత్తరమును జక్కఁగాఁజదివి మనస్సునకుఁ దెచ్చికొని శ్రీవారియొక్కయు శ్రీకొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి గారియొక్కయు నుత్తరములలోని యంశములతోఁజర్చించి యథార్థములను నిర్ణయించి కొందురుగాక.

---

(*1911 వ సం॥ నవంబరు 10 తేది దేశమాతనుండి.)

## గుంటూరుజాబు

......క్రిందటినెల 1వ తేదీ మధ్యాహ్నంబు రెండుగంటలకు అవధానమహోత్సవము జరుగ బోవు గుంటూరు నందలి ద్వితీయనాటకశాల సర్వసుహృత్ప్రదంబై యన్నిట నద్వితీయంబయి వెలింగె, నాఁడు విచ్చేసినవారిలో సర్కారుద్యోగస్థులు ప్లీడర్లు మొదలగువారుండిరి. సర్కారుద్యోగస్థులలో మ. రా. శ్రీ. పెమ్మరాజు కామరాజు పంతులుగారు (డిప్యూటి కలెక్టరు గుంటూరు) మ. రా. శ్రీ మండపాటి లక్ష్మీనారాయణ పంతులుగారు (తహశీలుదారు) మ. రా. గిరిరా

ఉ॥ శివరాముం డొనరించెఁ గాదె విబుధుల్ సెబాసనన్ బూర్ణమా
నవధానం బపు డప్పురిం గలదుగాదా! కొప్పరం; బేల తా
నవలోకింపఁగ రాదొ! నీవెఱుఁగవా? యప్పట్ల నీతీరుగా
శివరాముండు ప్రగల్భముల్ పలికెనే "సీసీ, ఒకుం బాత్రమై. ౨౯౧

॥ తగుఁదుమటంచుఁ గాలెటులొ త్రశ్వి ప్రపంచకమెల్ల "దోవ యే
సుఁగులకుఁ బోరు సాఁగె"నని నూటికి నొక్కఁడు తప్పఁ జెప్పికో
నగడున కాస్పదం బయి పలాయనమంత్రము స్వస్తిచెప్పి యే
మొగమున మానవోత్తరులు ముచ్చట లచ్చగ నిట్లు వ్రాతురో. ౨౯౨

క॥ మానతి త్రయం బటు మా, మీసము తలపెట్టుతమకు మేము వృథా గాఁ
జేసితిమి గర్తపురమున, వాస మ్మొదిరింతు మన్న వాసి యడంపన్. ౨౯౩

---

పు పంతులుగారు. (టవును మేజస్ట్రీటు) మ॥ రా॥ చిలుమామిళ్ల లక్ష్మీనారాయణ ప్రసాదనాయుడుగారు (ప్రొ. డి త.) పోలీసు యినస్పెక్టరు (ముసల్మానులు) సబ్ ఇనస్పెక్టరు కానిస్టేబిలును ప్లీడర్లలో మ. రా. ఏకా రామయ్య పంతులుగారు పు. రంగారావు పంతులుగారు మొదలగువారును విచ్చేసియుండిరి. డిప్యూటీకలెక్టరు గారును మ. రా. వింజమూరి భావనాచార్యులువారు దయచేసియుండిరి..... అంతట పృచ్ఛకులలో నొకరగు మ॥ పు. రంగారావుపంతులుగారు సరిగ నూరుమందికి అవధానము సేయజూడ కుతూహలము కలదని యగ్రాసనాధిపతికి విన్నవించిరి, అట్లు చేయుటకు... వీలులేదని చెప్పిరి. ...తరువాత నవధాన మొకప్పు రొకప్పుడుగ విశదలలో బాపట్లలో జేసిరిగాన నిచ్చటసోదరు లిర్వురును గలసి యవధానము చేసిన బాగుండునని పు. రంగారావు పంతులుగారు తమయభిమతంబును దెలిపిరి అదియు నగ్రాసనాధిపుఁడు వారించెను. కానిస హేతుకంబుగ గాదు.... ఇద్దఱు పిల్లకాయలు ...పిల్లజగడము బెట్టికొని కర్ణాశ్వత్థామలకథ జక్కగ జ్ఞప్తికి దెచ్చిరి. ...సబ్ ఇనస్పెక్టరుగారు రంగంబులోనికి వచ్చి యాపిల్లకాయల విడదీసి యొక సభికుని నెట్టుచుండ "అయ్యో అతను మనవాడండీ" యని యొక నియోగి, సబ్ మేజస్ట్రీటుగారితో ననిరి. యీయవసరంబున రంగంబునలంకరించిన పృచ్ఛకులు లేచినిలిచిరి-... నాడు నలువదియొక్క మంది పృచ్ఛకులు గూర్చుండిరి. ...పృచ్ఛకుడు నేను వృత్తమడిగితిగాని గీతము కోరలేదనియె, కవీశ్వరులలో ననుజుండు గీతమును వృత్తమే యనిరి. పృచ్ఛకులలో నొకరగు మ॥ పు- రంగా, రావుపంతులుగారు గీతము వృత్తము కాదనియు వృత్తజాత్యుపజాతులలో వృత్తములు వేఱని యావారికి నుడివిరి. అగ్రాసనాధిపతిగా రుపజాతులలో వృత్తములు లేవాయనియు మఱియు బృచ్ఛకులు సమవృత్తమో విషమవృత్తమో చెప్పరైరనిరి. అంతట రంగారావు

ఉ॥ అప్పుడు పాఱిపోయి పయి నాప్తులుఁ దామును జేయుచున్న యీ
చప్పుడులుꣳ బడాయినుడి చాయలు దబ్బఱ లెల్లవారికిం
జెప్పక చెప్ప గర్త పురిసీమయు, గర్తపురమ్మునందు మ
హెప్పుడుఁ దిట్టిపోయ జనియించినపత్రికయుꣳ మహేశ్వరీ ౨౯౪

ఉ॥ చెడెఁగదా! మూడుమాసములు చెన్నఁటిపోరు ఘటిల్లుటꣳ వృథా
గడబిడతోడ గర్తపురిఁ గాలము; కాక స్వశాఖ తోడు గా
నడరెడునప్పు డెందు కని యక్కట! వారలవంకఁ బోక యే
బెడఁదయు లేక యుండనెటు వేఁదుఱు వ్రాఁతలు వ్రాసిరో కదే. ౨౯౫

చ॥ కడియమునుండి వెంకన యొకానొక నాఁ డలయిందరంబుఁ బోఁ
గడఁగి స్వమార్గమాటఁగదా! కాకపురమ్మున కేగె, నాఁడె య
క్కడ సభ యయ్యె నిక్క మగుఁగా కెవరో స్వయ మేగుదెంచి పి
ల్చుడుఁ జనఁ డేమి! యిట్టులనుచుꣳ లిఖియించునె యంబ! తిట్టుచుꣳ ౨౯౬

---

పంతులు గారు గీతములకు నుపజాతివృత్తములకు సంబంధము లేదనిరి. సరియేయని యొప్పుకొని యవధానియంతట వృత్తము జెప్పిరి.... ఈపద్యములకన్నింటికి బ్రథమపాదమగువఱకు సాయంకాలము 4 గంటలు ఆయె... అవధానపద్యముల బూర్ణముగ వ్రాయువారిలో మ॥ ఏ. లక్ష్మీనరసింహంపంతులుగా రవధానిగారిప్రక్క నెఱ్ఱపెన్సలుతో దాళఫల ప్రమాణంబులగు నక్కరములతో, మ॥ పాటిబండ సూర్యనారాయణరావుపంతులుగారు నల్ల పెన్సలుతో నవధానిగారి తమ్ములచెంగను గూర్చుండిరి.... పద్యంబుల రెండవపాదంబులు జెప్పసమయమాసన్నమాయె ఈ యెడ ధాగణాపటిమ యంత యెక్కుడై కనపడలేదు. 3 వపద్యముయొక్క 2వ పాదము చెప్పుచు అవధానిగారు దాహముకొరకు, కాదుక్షీరమునకని తరువాత దెలిసినది. యవనిక మఱుగున కరిగినతోడనె వారియనుజులును మ॥ పా. సూర్యనారాయణరావుగారును లోనికరిగిరి కొంచెము సేపటికి సోదరులిర్వురును సభలోనికి దిరిగివచ్చిరి అంతట నవధానిగారు 11 పద్యములవరకు జక్కగ జెప్పిరి....12వ పద్యము రెండవ పాదము రమారమి 3 పంతులు చెప్పుతఱికి నవధానిగారికి దైవవశంబున సభ్యులకానందము మందముగా శిరోవేదన సంభవించెను....కొంతతడవల్లె బాధపడుచున్నైన బూర్తిగావింప నెంచిరి....మఱల శ్రీసుబ్బారాయావధానిగారును సూర్యనారాయణరావుగారును ధూళిపాటి లక్ష్మీనారాయణగారును (లేఖకులలో నొకరు) మఱలలోనికివెళ్ళిరి, పిమ్మట గవీశ్వరులు మఱికొందరుం దక్షిణపు బంచాదిలోనికి వెళ్ళిరి అచట గొంచెము గాలి గొట్టుచున్నందున నచ్చట గుర్చీ వేయించుకొని కవిగారు కొంచెము విశ్రమించిరి.... అంతదిరిగి యవధానిగారురం

ఉ॥ ఇంతటి పాఱుఁబోతు లని యెల్ల నెఱింగియుఁ గాలుద్రవ్వి ధీ
మంతులు నవ్వ గర్తపురి మాయెదుటన్ బడ కేల మానిరో!
హంత! సమస్తమున్ గడచునాపయి నెవ్వరు నన్ను వార లం
చింత బడాయి వ్రాఁతలకు నేమని వ్రానిరొ మాసహోదరుల్ అ౯ ౭

ఉ॥ ఎందుకు వీరితోఁ గలహ? మేదియొ పూర్వము వచ్చెఁ బోయె, వీ
రెందు సమర్థు? లీకవులయెమ్మెలతో మన కేమి, వీరు తా
మెందుల కేగ నచ్చటికి నేమును సిద్ధము గావు టొప్ప దం
చుం దలపోసి మాను టది శూరులఁ జేసెనె పాఱుఁబోతులన్ అ౯ ౮

---

గమునకువచ్చి కూర్చుండిరి.... ఇంతలో నవధానిగారికి శిరోభారంబు తగ్గదయ్యె సభికులందఱకు వారిశ్రమ జూచి నాటిరేయి మఱింతశ్రమపెట్ట జనదనియు మెదడుతోఁగూడిన పనిగనుక నింకను శ్రమ జేయునెడల ముప్పుసంభవింపవచ్చునని తలంచి యెట్టులనైన నాటిరాతిరే యవధానము బూర్తిజేయవలయునని సర్వథా జతనము నేయుచున్న వారిని వారించి సభ చాలించి తమతమని వేశనంబులకరిగిరి ... ఇంక రెండవనాటి చరితము క్లుప్తముగ వ్రాసెదను నేటిదినము మ॥ శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులుగా రాధిపత్యము వహించిరి నాడును (2-10-11) సభయొంటిగంటకు బ్రారంభమాయె నాడుమొదటినాటికంటె బదిమంది నెక్కుడవగ నేర్పరచి వారికియు నవధానము నేయబూనిరి... మ॥ ఏకా రామయ్య పంతులుగారు "సరే యికనిన్నటి 12వ పద్యము నెత్తికొం" డనిరి.... అంతగొందరు పృచ్ఛకులు "వరుసగాగాక యెక్కడనడిగిన నక్కడ చెప్పదురా' యన నట్టినీమము తాము పెట్టుకొనమనియు వరుసగానే చెప్పెదమనియు నవధాని గారనిరి ప్రెసిడెంటుగారు "మీరట్టి నేమము పెట్టికొననిచో బృచ్ఛకు లిష్టానుసారము నడుగవీలుండ" దనిరి లేఖకులగు మ॥ ఏ. లక్ష్మీనరసింహంపంతులుగారు పా. సూర్యనారాయణరావుపంతులును నిన్నటివలెనే కూర్చుండిరి.... అన్నిటికిని రెండుపాదములు చెప్పిన తరువాత మ॥ విం. భావనాచార్యులుగారు మిగిలిన రెండుపాదములనొక్కసారిగ జెప్పిన చాలబాగుండుననని యన్న నవధానిగారందుల కిష్టపడరైరి. నాల్గవపాదము చెప్పువేళ నాల్గవపాదము వరుసగ జెప్పుటయు వెంటనే యాపద్యమెల్ల చదువుటయు పటిష్ఠించినది. ఇట్లు 12 పద్యములగునఱకుజాలప్రొద్దుపోయె. అందువలన మిగిలినపద్యముల జదువబనిలేదని సభవారనిరి. ఎట్లయిన రాత్రి 11-40 గంటలకవధానము ముగిసెను. పిమ్మట స్తుతిపద్యములు నగ్రాసనాధిపతిగారియుపన్యాసమగునఱకు రాత్రి 12 గంటలాయె. అంతట సభికులిండ్లకేగిరి. కాన పంచాశదవధానమునకు $16\frac{1}{2}$ గంటలుపట్టినది. ఈసంగతినొకటి గమనింపవలయు

ఉ॥ "వచ్చినవాఁడె చాలు, బలవంతులు బందుగులున్నవారితో
బిచ్చపు వైదికుల్ సరిగఁ బెన్గఁగలారె? స్వశాఖవారలే
పొచ్చెము చేయుచుందు రది పోకడపన్ గడుఁ గష్ట" మంచు మే
మిచ్చఁ దలంచి వారిఁ ద్యజియించుట యొండొక రోస మయ్యెఁగా. ౪౯౯

క॥ రాజీకి నెప్ప వలవదు, యోజించుకొనుండు మదిఁ గుయుక్తులివి మహా
రాజశ్రీ కొప్పరమువ్వు, ఖా జయములు సెప్పికొనఁగఁ దలఁచెను జూండీ ౫౦౦

క॥ అని *కొంతమంది మ్రాసిరె; పనిగొని వ్రాసిరవు, డేము పరికింపక సం

---

ప్రతిపద్యముయొక్క ౨వ పాదము చెప్పకముందే యాపద్య ప్రథమపాదము రెండుమూడుమారులును ౩వ పాదము చెప్పనెడ మొదటిరెండుపాదములు రెండుమూడుమారులును నాల్గవపాదము చెప్పతఱి మొదటి మూడుపాదములు రెండుమూడుమారులును నవధానిగారు చదువుచువచ్చి కావలసినపాదముల వేయుచుండిరి ఇట్లుండ మ,కొం. వెంకటప్పయ్యగారవధానిగారితో పదేపదే మీరు మొదటినుండిపద్యము చదువుటయేల యేపాదము చెప్పవలయునో దానినేమాత్రము చెప్పుడు కాలము చాలయగుచున్నదనిరి. అంతట నవధానిగారు వెలుపలికి జదువక తమలో దాము చదువుకొనుచువచ్చిరి. వెంకటప్పయ్యపంతులుగారద్దానిజూచి లోపల జదివిన వెలుపలికిజదివిన నొకటే వెలుపలికే చదువుడనిరి.... అవధానసమయమున నేవేసియుగొన్నిపద్యములు చదువుండంచు రంగారావుపంతులుగారన నగ్రాసనాధిపతి వారి వారించిరి. శతావధానులనుట కొకసారియైన సంపూర్ణ శతావధానము జేసినగాని యొప్పరు. సభానిర్ణేతలట్టి యవధానము చేయించుటకీయకొనక యెప్పుడో ముందు చేయింతుమనిరి కానింక ముందైన నీకవీశ్వరులవలన నిర్ణయమైనట్టి దానిఁ జేయించి వారిబిరుదములకు సార్థక్యము గల్పింతురుగాక.

☞ నాళ్ళచెఱ్వు రంగారావు

---

## 12-9-11 (Marutur) పురవాసుల యుత్తరము నుండి)

*...తాము వారితో రాజీకి వప్పితిరేని మీరు వారికి ఓడినట్లు ముద్రిణ యంత్రములలో ముద్రించుటకు సిద్ధముగానున్నారు. మహాగజాః పలాయంతే మశకానాంతు కా కథా యన్నట్లు వీరామహ్మ్ములను గెల్చినది, వారియాచజ్జీవము సాధించినను మిమ్ముల గెల్వజాలరు జాలను జాలనేజాలరు కింకవీంద్ర ఘటాపంచానన మను బిరుదు వీరియందే సార్థకము కావలెను. ... గ్రంథవిస్తరభీతిచే నింతటతో ముగించితిమి. లేకున్న నొకరీము కాగితములు పట్టును.

ఇట్లు పురవాసులు

...ని విశ్వసించుచో వీరిని బట్టిఁగఁ బద్యములు ధరిత్రిం గలవే ౩౦౧

తమసభ కేగకున్న నిటు తప్పనలన్ లిఖియించి, రేగి య

క్రమములఁ దప్పులన్ వెదకి కంఠము నొక్కఁ యతించు మేని లో

కము మము నేమనన్ "మునుపు గాక మఱికఁడఁగూడ నేల యు

ద్ధము; వెనుకంజ వేసినను దా ర్వెడ రీ రని మమ్ము దూఱదే. ౩౦౨

"నాగన్నా! పడకయ్య వాయెనట నెన్నంచున్ మఱెన్నండు నే

మేగంబోము భవద్గృగంతికము, నీ వింకేగు" మన్నట్లు మే

మీగోష్ఠిన్ విడనాడ తిట్టినను మా జీకుండ నున్నప్పు డీ

లాగున్ వ్రాతురె? భానుమూర్తి కృతి యేలా దీని లో నెంచునో? ౩౦౩

మ॥ అతియోగ్యుం డగుభానుమూర్తి విబుధారాధ్యుండు లోకైకస

న్మతుఁ డీవ్రాఁతకు నేమిగాఁ దలఁచునో? మామానసం బస్మహో

మతి దివ్యాశయమున్ వినన్ దలఁచెడిన్ మాన్యాత్ముఁ డాతండు మున్

వితగా మమ్ము *మరల్పనెంచుకతనన్ వేడ్కయ్యెడున్ దెల్పఁగన్. ౩౦౪

శా॥ ఎవ్వారు యోగ్యులో? కలహ మెవ్వరు గోరెడివారో? యెట్లుగాఁ

జీవ్వ జనించెనో? యెవరు చెన్నఁటివ్రాఁతలు వ్రాయువారో? యీ

యవ్వియు నట్లు సర్వమును రాఁ గత మేమొ? సమస్త మిప్పు డే

నవ్విషయంబు స్పష్ట మగునట్లు లిఖించెదఁ గాక శాంకరీ. ౩౦౫

---

*బ్రహ్మశ్రీ శతావధాని తిరుపతి వెంకటేశ్వరకవివరుల సముఖమునకు.

సే॥ చెన్నాప్రగడ భానుమూర్తియనేక నమస్కారములు చేసి చేసికొను విన్నపము.

తమయను కొన్నగపు కవిత్వయమునకు పొసగిన వివాదలను పత్రికాముఖమున వినివిచారించు చుంటినేకాని కొంతవరకు కింకర్తవ్యతామూఢతను. మరికొంత కాలము మీయునికి నిశ్చయముగాఁ దెలిసి వ్రాయుకోరికను ఇంతవరకు విలంబమైనది. .................కవిలోకమునకు రసజ్ఞులగు ప్రభువుల సమ్మానమరుదగుటంజేసి ప్రాయికముగా భిన్నరుచులును, సాహిత్యశూన్యులును దుర్విదగ్ధులు నగుపామరుల మెప్పుగాంచి యశము నొందవలసిన యవస్థ పట్టినది. గావున కవితా గౌరవము గ్రహించి రక్షించుకొనవలసిన భారము ముందు మీమూపునను పిమ్మట పరప్రత్యయనేయబుద్ధు లగునితరులపైని నిలిచియున్నది. మరియును మీరు పెట్టినదారిననుసరించునట్టి వారియెడ నొకవేళ లోపమున్నను సైరించి గౌరవించు భారమును మీదియేకదా? ..........................మీర

చ॥ తిరుపతి వేంకటేశ్వరులు తీరిక నూరక కూరుచుండి సం
గరములు పెట్టికొందు రని గాసిమును వ్రాసిరి కొంతమంది; వా
రరసి లిఖింతు రిగాక తమయాశయమున్, "పరికించి యిప్డు వ్రా
సిరి" యని లోక మొప్పుకొని చెప్పికొనన్ గమకించుఁ గాపుతన్ ౩౦౬

శా॥ తల్లాప్రగ్గడ వంశవారినిధి శీతజ్యోతి శాఖాభిమా
నోల్లాసం బొకకొంత కల్గియును నెంతో యుక్తియుక్తమ్ముగాఁ
దెల్లం బొగతి *శాంతి కూర్చుకవితాధీరుండు మాసోదరుల్
కల్లల్ నించుచుఁ దిట్టుచుండుటకు నేకామణ్యమున్ జూపునో॥ ౩౦౭

---

లు కలతపడి కలహమునకు దిగుట లోకానర్థహేతువగుటయేకాక యుభయ పక్షములకు ప్రియమును హితమును గోరు మావంటి సుహృదులకు వ్యాకుల కారణము, మిత్రుల చిత్తశాంతికైనను మీరు పొందుపొసగి యుండుట మీ కవశ్యకర్తవ్యము, గజానాం పంకమగ్నానాం గజావివధురంధరాః, అన్నట్లు సంధానోపాయమును మీర చింతింపదక్షులు, మాబోట్లు చేయదగినదింతియకా నెంచియింతటితో విరమించెదను........ చిత్తగింపవలెను,

---

వీరిదే మఱియొక యుత్తరము,

......మాకేల? వారికిని నేనెరిఁగి నంతవరకు నేటికిని మీపట్టున ననేక కారములచే గౌరవభావమేయని నానమ్మిక, నడుమ కలహప్రియుల కుతంత్రములవలన నిది పొసగినదని నాయూహ, ఏదియెట్లున్నను కొంతకాలమైనను మిత్రకోటిలోనున్నవారితో కలహము పొసంగినను కొంతసైరించుట ధర్మమని నాతాత్పర్యము, మీరుసైరించిన సర్వమును సమంజసమగును, మీయుదారతయు ప్రకటీకృతమగునే కాని పర్యవసానము వేరొండుగానేరదు మీరుశాంతించుట మావంటి వారల ప్రార్థన నంగీకరించి చేసినను చేయుదురుగాక మీయందు భక్తితాత్పర్య పరిపూర్ణులగు దూరము విచారింపని కొందఱ నాప మాతరముగాదు కాన నాభారముకూడ మీపైనే నిలిపెదము;...... చిత్తగింపవలెను,

నే, చెన్నాప్రగ్గడ భానుమూర్తి,

(నిండుకుండ తొణకరాదు.)

....- తిరుపతి వేంకటేశ్వరులు నాకు పూర్వ పరిచితులు. ఆంధ్రలోకమున వారి పేరు దిగంత విశ్రాంతముగ వెలసినది. వారివిద్యా ప్రాగల్భ్యమును, కవిత్వవై

శా॥ ఒగిఁ దల్లాప్రగడాన్వవాయుఁ డిపుడే నొక్కింత శ్రీకొప్రపుం
జగడంపుం దెఱఁగూహ సేయుత వృథా సందేహముల్ మాని వీ
రు గడుల్ సాహసులం చెఱుంగుత మదిన్ రూఢిన్ విచారింప కే
మిగ ముల్ వ్రాసెను ‘‘పీర్వథానులని’’ పేర్మిన్ దాని దా దిద్దుతన్॥ ౩౦౮

---

దుష్యమును, నిరుపమానములని పేరఁవచ్చినది. వారు బయలుదేరు నాటి కిట్టి మాది
రి ఆశుధారా కవిత్వమును, అవధానకవిత్వమును, నరుదుగా నుండెను. అట్టికా
లమున వీరు దీని నుజ్జీవింపఁ జేసి దానియందే మహాయశస్సును సంపాదించినారు
వారికిప్పుడు వయస్సు తిరిగినది. భాషాసతి వారిస్థానమునఁ దగినవారిని మఱికొం
దఱిని నిలుపం బెట్టి పురోవృద్ధికరులగు మఱికొందఱు పుత్రులం గాంచినది. ఇప్పు
డు కవిద్వితయములును, అవధానకవీశ్వరులును, చాలమంది బయలు దేరుచు
న్నారు. వారందఱును వీరిమీఁదికి కాలు ద్రొవ్వుచున్నారు. త్రవ్వనిండు. త్రవ్విన
నీరికేమి కొఱవ. అట్టిసమయమునఁ దిరుపతి వేంకటేశ్వరు లేమి చేయవలయు?
వారు తక్కిన వారితోడ సములుకారె. వారు విద్వత్కవీశ్వరులు దిగంత ప్రతీ
తిఁ బడసినవారు. వారిక్రింద బయలు దేరిన శిష్యగణమె విశేషముగ నున్నది. వీ
రందఱునువచ్చి మేము మీకంటె గొప్పవారమని డీకొనిన ‘‘నీవెంతరా యని వారి
తోడ వీరుఁదలపడుట దగవగునా?’’ శిష్యుఁడు గురువునకంటె యెక్కువవాఁడ
యిన గురునకు గాక గౌరవము మఱియెవ్వరికి? ఈ అవధానకవిత్వమును బయ
లు దేరఁ దీసినది వీరుగాక మఱియెవ్వరు? ఒక్కవేళ వయస్సు దిరిగిన వారిప్పు
డు నూతనముగ బయలుదేరు పిన్నవయస్సు వాండ్రతో వడినిఁ దీసిపోయినఁ దీసి
పోవచ్చును. ధారణాశక్తి యొక్కింత తగ్గవచ్చును. అంతమాత్రమున వారికొకలో
టువచ్చునా? కొప్పరకవులకును నాకును పత్రికాముఖపరిచయము దక్క మఱేమియుం
డులేదు......తిరుపతివేంకటేశ్వరులారా! మీవిద్యావివేకములువీరియెడనేమియుఁ
బనికివచ్చినవి కావు. విద్య వినయమునకుమూలముమీరు తలపకుట పిన్నవాండ్ర
తోడనా? వారి వయసెక్కడ? మీవయ సెక్కడ? ఆంధ్రలోకంబునకెల్ల భా
షాపరిజ్ఞానమున గురువులుగాఁ బరిగణింపఁ బడుచున్న మీకిట్టివాద ప్రతివాద
ములు తగవు. మిమ్మెవ్వ రేమనిన మీకీర్తి కేమికొదువ? ఈ మీకయ్యములు భాషా
చారిత్రమున శాశ్వతముఁగ నిలిచిపోవును. ఈయపయశస్సు రాకుండఁగా పాడు
టకైయినను, మీమీ వివాదములను వదలుకొనుడు.

ఓ కొప్పరపుకవులారా! మీ కీర్తి యచిర కాలమున దిగంత విశ్రాంత మయి
నది ఈవచ్చినకీర్తి స్పర్థచే వచ్చినదా? మీకేల? అనవసరపు గలహము. అవస
రమే కలిగిన దనుకొనుఁడు. ఎవరివలన లోటున్నదో ప్రపంచము గనిపెట్టలేదా?
ప్రాజ్ఞులెఱింగిన చాలదా? మీ రెదుకొక్కసినంత మాత్రమున మీ కెక్కువ కీర్తివ
చ్చునా? మీరిప్పుడు వయస్సునఁ జిన్నవాండ్రు. ‘‘ప్రమాదో ధీమతామపి’’ అనున

ఉ॥ చూడని యప్డు మావలెనె చొప్పడియుండును భ్రాంతి; యాశువుం
బాడుట తక్క వీరలకుఁ బట్టదుధారణయంచుఁ బూర్తిగా
నేఁడెటు మేమెఱింగితిమొ నిక్కము వీరటులే యెఱింగి యీ
యీడునఁగూడ వారిధృతి కేమొతలంక మటంచెఱుంగతన్" ౩౦౯

ఉ॥ వారిని జూడకున్నపుడు, వ్రాసిన వ్రాఁతలకేమి యెట్టులో
దూరపుఁ గొండలన్నగతి దోఁపఁగవచ్చు "వధాను,, లంచు మే
మారక వ్రాసి మీఁద భ్రమనొందితిమం చనుకోమె? సోదరుల్
కాఱులు వ్రాసి *తిట్టుటకుఁ గాఁ గమకింపరె మమ్ము దాసికై॥ ౩౧౦

చ॥ ఎఱుఁగనియప్డు వ్రాసియు నిటీవల దిద్దికొనంగవచ్చు నిం
దరయఁగ శంకయేమి? యిటులాంధ్రపుఁబాణినిగారి శిష్యుఁడొ
క్కరుఁ§డొకచోట వ్రాసె, నదిగా మఱివేదము నేఁటికాలమం
దఱికిని; దానిఁబట్టి యయినన్ బొరపాటును దిద్దికోఁదగున్,, ౩౧౧

---

ట్లు పెద్దలొకవేళ మదిఁదప్పి వర్తించినను మీరు తొందరపడరాదు...... మీ, ఆశుధాటి పెద్దనాదుల ధాటినికూడ మించిన దని చెప్పుకొనుచున్నారు. అంతమాత్రము చేత మిమ్ము పెద్దనాదులకంటె ఘనులని యందురా? అట్టి తలఁపు మీమనస్సునకైన జనింపవచ్చునా? ......పెద్దలయెడ నెట్టి కొదువ లున్నను వారుమీకు, వందనీయులు. (1911వ సం॥ సెప్టెంబరు 27వ తేది దేశమాతనుండి.)

తల్లాప్రగ్గడ సూర్యనారాయణరావు.

*(దర్బారులోని కొప్పరపువారి జ్ఞానోపదేశము నుండి.)

"మ॥ అనుమోదంబున వేలనియ్యఁదగమన్నా? పద్యముల్ గొండటం
చును మున్మున్నపచించి యీర్ష్య నిపుడిచ్చో సామ్యమున్ గూర్ప రా
దనుచున్ రెండువిధాలఁ ద్రిప్పనిది నాలౌక్యాని? తాటిపట్టాని,,

§(మనోరంజని 1వ జూన్ 1912 సం॥)

......తాను స్వయముగఁ జూడనివిషయమును బహులమాటలనుబట్టి నిర్ణయింపఁ బూనుట యంతకంటెను బొరపాటు. ఏవిషయమందైననిజము తెలియకముందేమనుకొనినను, తెలిసిన వెనుకఁ దనయభిప్రాయము మార్చుకొనకుండుట యన్నిటికంటెను బొరపాటు..........

మ॥ తల్లాప్రగ్గడరావుగారు మము వార్ధక్యమ్మునన్ ధారణా
చిల్లిలన్ గవిసోదరుల్ వృథగఁ గించిత్తేని యోజింతు రం
చెల్లన్ మున్ను లిఖించు వ్రాఁత విత, నా రీకర్మమే నేర; రే
కల్లల్ నేరని రావుగారికి వృథా గా భ్రాంతి కల్గెన్ గదా?॥ ౩౧౨

క॥ ఉభయాయనుఁడగు సూర్యుని, యభిఖ్యధరియించు మిత్రుఁ డఖిల మెఱిఁగి తా
నుభయ హిత మభినయించుచు, నభిమానము వెల్లడించు టది యొప్పుఁగదా?

ఉ॥ వీరలు వారినాశువునఁ "బెద్దనకన్నను మిన్న" లన్నయా
ధోరణి, మమ్ము "సర్వకవిపూర్వహు" లంచని కొండ నుంచునా
ధోరణి, రెండుఁగూడ దయతోఁ గదు "నిండిన కుండ" కించిదా
ధారవశమ్మునన్ దొణికి తద్రస మిట్టటు చిమ్ముతే యగున్॥ ౩౧౩

ఉ॥ ఏదియొ వ్రాసె నొక్కఁడు వృద్ధుఁడు కల్లలుఁ బ్రల్లదంబులున్
బాఁదుచుఁ బండిలుం డయిన బంధుసముద్రునఁ; కేది గాంచి "యీ
మాదిరి వ్రాయునే యకట? మాన్యుఁడుఁ గూడ" నటంచు నెంచి దా
యాదుఁడు చింత నొందెనొ; మహాత్ముఁ డతం డిపు డేమి వ్రాయునో, ౩౧౪

చ॥ ఎవఁ డలనూజివీటి మము నించుక చూచినయంత భీతిమై
నవనెను "గుట్టు మే మెఱిఁగినా" మని; నున్నలపన్నమున్ దగం
గ వినిన బ్రహ్మరాక్షసునికైనడి మానుడి కెవ్వఁడేనిఁ బె
ల్లవకరమున్ వెలార్చుచు భయంపడె నాతఁ డిఁకేమి వ్రాయునో, ౩౧౫

తే॥గీ॥ ఎవఁడు "హితవాది" పేరున నేదొ సోదె, స్వలిపితోడన వ్రాసియెప్పటికొ యనిచి
పుట్టలుదవనేదిమో తన పొట్ట నున్న, పుట్టఁగ్రక్కెనొ యతఁడిప్పు డెట్టులనునొ

ఉ॥ ఆలిపియందు నుక్కెమెడ హంసపదం బిడి దిద్ది స్వీయమౌ
వ్రాలునఁ గొంత వ్రాయునొకపండితుఁ డిప్పుడు "కొప్పరంపు వా
రేల వృథాగఁ బ్రల్లదము లిన్ని లిఖించిరొ తెల్పు" మన్న నే
మూలను దాఁగునో జననిని మ్రోఁగునొ? వేఱొకతోవ కేగునో? ౩౧౬

ఉ॥ వృద్ధుని వ్రాఁత నూర్చినది, పేరిట లేమిని గొంతమందికిన్
శ్రద్ధగఁ జూచినప్పటికిఁ జాల దురూహముగాఁగఁ దోఁచుటే
సిద్ధము, వీరియుత్తరము చేతికి రామిని నిట్లు వ్రాసినా
మిదరణీసురుండును నికృష్టుఁడు గాఁడు ప్రసిద్ధుఁడెంతయున్॥ ౩౧౭

ఆ॥ వె॥ ఊరిపేరు వ్రాయ నున్నగుట్టంతయు, బైటి కెక్కఁ జేసితని వార్త నొకటఁ
బాడిస్వవాకులాది పలుమంది చూచి, సీ యని రటంచు వింటి మంబరి యేము

శా॥ చాలన్ వృద్ధత గూరి యుండియును వాచాదోషముల్ వ్రాసి తా
నే "లా" చూపి యమున్ జయింప మదిలో నీతండు తా నెంచెనో?
కాలం బెట్టిది, యిప్పుడేని దశకుం గాఁబట్టదే సత్యపుం
జాలౌరా! యితఁ డింతగా మునుఁగునే శాఖాభిమానాంబుధిన్ కెంగ

తే॥గీ॥ చాటుబ్రాఁతల కేమి వాచాటులగుచుఁ, బైకిఁబత్రికలందున *బరుకుబ్రాఁత
లెట్టులున్నవో యెఱుఁగ వారి చెట్టలకును, వ్రాయరాని వ్రాఁతలు గూడవలెలు నెక్కొ

---

*చ॥ . . హారు సిటలాక్షదృష్టి నివహంబులపాలయి స్వస్థ్సులయ్యెడిన్ .శా. తాపే దక్షులమంచు నిక్కెదరు విద్వద్ద్వేషమున్బ్రాని!...ఉ॥ ...తొలిపలిక్కిన చొప్పున ముష్టిచెంబు గే,లంగొని బిచ్చమెత్తుటయె లాభమటంచు నెఱుంగ రాదొకో? చ॥...పడఁబోలునె బూతుల ...(15 అగస్టు 1912 సం॥ మనోరంజని చూ)

(దర్బారు పత్రికలనుండి.)

.........బ్రహ్మశ్రీ॥ తిరుపతి వెంకటేశ్వరులకు:— చి॥ చక్రవర్తుల సుబ్బారాయశాస్త్రికి. ... మ॥ అరుగంజాలరు క్రోశమాత్ర మొకనిన్ హర్షమ్ము మైజూడలేరు రుజగ్రస్తులరై తలన్నెరయగా రూపంపుసాంపెల్ల పేవరిపో వార్ధకమందె...శా॥ ఆసన్ద్రింపుము, .....మదమ్మంత్యమ్ము నొందింపు...చ॥కుట్టా! మాటలనహీనత పీనతదోచుచుండుటల్, తిరుపతి వెంకటేశ్వరులు దేశికులా! యికజెప్ప నేటికిన్॥

17—1—12.

(పశ్యా పశ్యో నపశ్యోకః; (విమర్శన శేషము.)

.......యః ఎవఁడు తప్పఁ దార్గుటచేత (ఇది ప్రకరణము బట్టి తెచ్చుకోవలెను) న పశ్యతి ఏమియు కనజాలఁడో యః మఱియొవఁడు పశ్యతి జగత్సర్వం అర్థాత్ కావాసుందరి మేదృష్టిపథమియాదితి, (ఇదం సాహచర్యనియమలభ్యం) చక్షునిదేవతే కంటఁబడునాయని జగమెల్ల కలయజూచునో తావుభౌ అపశ్యౌ ఆచదవినయపండితులిరువురును పరంజి తాత్మానం పరుఁడగు నాత్మని నపశ్యతః కనఁజాలరు. పశ్య (మిత్రమా) చూడుమా.......

బ్రహ్మశ్రీ తిరుపతి వెంకటేశ్వరకవులకు.

......ఛీ యనకుందురే జనుల్...పూర్వసువాసినీ గౌరవంబు॥..

---

......కొంగా! హంసనెదిర్చి భంగపడకే కోల్పోకె నీమానమున్!...

క॥ ఆయీవ్రాఁతలఁ గన్గొని, రోయుచు నొకవృద్ధసుకవి రూక్షేక్షణుఁడై
నీ,యనియంతట విడువక, ధీయుతుఁ *డెటు వ్రాసె నొక్కొ? తెలియదె జననీ

---

...తే॥గీ॥ మేటికవులనితోఁచిన మీరెవారి, చరణములధూళిశిరము పైజల్లికొనఁడు, ఇంక నేమనియొనరింపుఁ డింతెకాని, కలుపకుఁడు మనుష్యమాత్ర మిక్కార్యమందు ......మీసింబోతు గాంభీర్యము నింకెంతకాలము వఱకు ప్రజలకుఁ జూపెదరు. తటాలున నొకరినని "పండితబ్రువము మొదలగు గ్రంథములకు కథానాయకుల గుటతో నైనఁ దమకు తనివితీరలేదా?......మీపాండిత్యమునకుఁ దోడునభ కూడ జేయవలయునా......సీ॥ అగ్రహార త్రితయాధిపుండతఁడు వారకదే విరించు యాచకులుమీరు.....సీ॥ అల్లిబిల్లిగ నాల్గుకల్లలల్లి లిఖించి కడిమి జూపెడు దివాకర్ల భట్టు, వెట్టిభంగిని తొర్రి మొర్రి వ్రాతలు వ్రాసిపేరుగాంచెడు చెళ్లపిళ్లభట్టు... (ఇట్టివ్రాఁతలకు మితియే లేదు)

☞ షరా.—ఆయీవ్రాతలు, 54 పుటలో షరాలో నుదాహరించిన వారిలోఁ గొందఱివ్రాళ్లుగల చేటభారతపు వ్యాసములనుండి స్థాలీపులాక న్యాయమున నెత్తిచూపఁబడియె, విస్తర మాయీదర్బారు పత్రికలయందే చూడఁదగు, పతిట్టుతిట్టినను శిరసావహించి "దర్బారు" వ్రికటించుచున్నదనుటకు విస్తరించి యుదాహరణము లవసరములేదు. జగమే సాక్ష్య మీఁగలదు విస్తరించి యుదాహరింపఁ బూనుదుమేని దర్బారుసంచికలలో పూడునంతయు నుదాహరింపవలసియుండును. అట్లు చేసినచో గబ్బము విస్తరిల్లుటయె కాక తిట్లమయము కావలసివచ్చును ప్రాజ్ఞు లింతటితోడనే తృప్తి నందుదురు గాక.

---

(*1912 సం॥ డిశంబరు అభినవసరస్వతినుండి.)

ఈక్రిందఁ బ్రకటింపఁ బోవుపద్యములను బ్రహ్మశ్రీ అమరవాడి రామకవిగారు మాకుఁ జాలదినములక్రిందట నంపిరి. ఇమ్మహామహుఁడు కడువృద్ధు, ఈయన ఘనికవిత్వము వసుచరిత్ర పాకముననుసరించి యుండును. ఇప్పటికాలమున నాంధ్రకవిత్వ మిక్కట్టుదిట్టముగాఁ జెప్పుమహాకవులు మాసీమయందే కాక యితరత్రగూడఁ గడునరుదు తిక్కనాదుల కాలమునుండి మాకొండవీటిసీమ మహాకవులకు నివాసమై యశమునందుటయు నేఁటి కట్టిసీమను గుకవులు తండోపతండముగా బయలువెడలి సుకవిసంరక్షణకుఁగా సుకవినిందన మొనర్చుచుఁ

క॥ ఈయమరవాది వంశజుఁ, డీయనఘుం డీమహాకవీశ్వరుఁ డకటా!
రోయునె రామానుకవి యెుకు, లేయవివేకమును జూపరేని భవానీ॥ ౩౨౧

---

గడునజ్ఞానులై వర్తించుచుండుటకుఁ గొంకి దీనివలన సీమకెల్ల నప్రతిష్ఠవచ్చునని తలఁచి యీవృద్ధమహాకవి యీపద్యములు వ్రాసిపంపిన ట్లూహింపనయ్యెడిని—

ప॥ అ॥

శ్రీమేధాదక్షిణామూర్తయే నమః

సీ॥ అలమేలు మంగలాభాప్తివర్తులు నొక్కరుఁ డలమేలు మంగలాభాఢ్యు లొకరు
విబుధసపర్యా శోభిలుచుండు నొక్కండు విబుధసపర్యా శోభిలుదు రొకరు
శ్రీమత్క్రతావృద్ధిజీవనుం డొక్కండు శ్రీమత్క్రతావృద్ధి జీవు లొకరు
రాజితాహీనగోత్రస్థితుం డొక్కండు రాజితాహీనగోత్రస్థు లొకరు
తే॥గీ॥ నామమాత్రానఁ గాక గుణక్రమమున, సములుతిర్పతివెంకటేశ్వరున కట్టి
సరసతిరుపతివేంకటేశ్వరులఁ దెగడు, వారువిబుధాపకారులు గారె తలఁప
సీ॥ గద్వాలనృపతి రంగద్వాలఖిల్యాభమతు లంచు విత్తసమ్మతులఁ జేసె
నాత్మకూరున ముదంబాత్మకూర ఘటిల్లె రోహణోపమగజారోహణంబు
వేంకటగిరిరాజు వేంకటగిరిరూప ఫణితుల్యు లని ధనార్పణ మొనర్చె
విజయనగరి, వాద విజయనగరిపుదేశికు లంచు రాజకౌశికులు మెచ్చి
తే॥గీ॥ రంతు నిందననేటికి? నఖిలలోక, మస్తకన్యస్తకీర్తిప్రశస్తు లగుచు
వఱలుతిరుపతివేంకటేశ్వరసుకవుల, నీర్ష్య రిపులేవగించిన నేమితఱుఁగు
సీ॥ కావింతు రెవ్వారి గాఢోత్సవుల సుధీదుర్లభబహుపారితోషికముల
భావింతు రెవ్వారిఁ బరిచితగ్రంథశబ్దపరిష్క్రియార్థవైదగ్ధ్యసరణి
సేవింతు రెవ్వారిఁ గోవిద ప్రోవ్యతద్వ్యాఖ్యస్వద్గుణాంశముల్ పట్టువడఁగ
రావింతు రెవ్వారిఁ బ్రాజ్ఞగోష్ఠి చర్చికల కగ్రగణ్యులఁ గావరించి
తే॥గీ॥ సకలదిగ్దేశధీరరాజన్యు లట్టి, సరస తిరుపతి వేంకటేశ్వరసుకవుల
ఖలులసూయాపిశాచసంగ్రస్తులగుచుఁ,బదఱుటయు వారలకునొక్కప్రాభవంబె
సీ॥ ఆత్మయశోవర్ధనాసక్తియే కాని పరకీర్తికి నసహ్యపడుట లేదు
వైదర్భరీతిఁ గావ్యము లల్లుటయె కాని పటిమకై గౌడిఁ జూపుటయు లేదు
పరకావ్యముల గుణస్ఫురణ మెన్నుటె కాని తప్పు లన్వేషించుతలఁపు లేదు
పామరుడైన సంభావించుటయె కాని యెుగి గర్వమతిఁ జూడకుంట లేదు
గీ॥ కలరె యిటువంటి బుధులిలని కవులుమెచ్చ, వఱలుతిరుపతివేంకటేశ్వరులనీర్ష్య
నిందసల్పినవాండ్రకే నిందగాక, వారికీర్తికి సుంత లోపంబు గలదె. ౪
సీ॥ కోవిదామోదంబుఁ గుమతిదుర్వాదంబుఁ బూన్పరే మాన్పరే భూరిసభల
సంస్థానములయందు సరసాననములందుఁ బఱపరే నెఱపరే పద్యబహుత

సీ॥ "వెంకన్న"*యనివ్రాసి వెక్కిరించితిబాగుగానంచునుక్కుఁచు మేనుమఱచు
"వెంకటే" సని వ్రాసి జంకు నా కేమని యుక్కుచు సంతోసమొందుచుండు
"వెంకప్ప" యని వ్రాసి వేలోకం డాత్మలో నానందపారవశ్యమును జెందు
"వెంకం" డనుచు వ్రాసి యింకేమి కావలెననుచుమఱొక్కుఁడు గనుముదంబు
గీ॥ అగ్గినొక్కఁడు"వెఱ్ఱివెంకటాయ"యనివ్రాసి,పరమసంతోషవారిధిఁదిరుగులాడు
నేమనఁగవచ్చుఁ గోత్రంబునోమఁదిలఁచి,పడెడిపాటులు తత్ప్రత్యక్షపాటు లకట?

---

చటులబద్ధపథంబు శతవధానవిథంబుఁ జూపరే చూపరే స్వకవనముల
సాహిత్య జననముల్ సాహిత్యకవనముల్ చేర్పరే నేర్పరే శిష్యతతికిఁ
గీ॥ దాదృశోదారశీలసందర్భులగుచు, వఱలుతిరుపతివేంకటేశ్వరసుకవుల
నీర్ష్య నిందింప వారలకేమికొఱఁత?, కొఱఁతఁ బలికిన వారికే కొఱఁతగాక.౫
సీ॥ ఆరూఢ సాహితీవ్యాకరణప్రాజదదితికశ్యఫులయం దవతరించి
చర్చితార్యసభాప్రసంగవాక్పౌఢిదంభాదితిస్తన్యపానాప్తిఁ బ్రబలి
సంస్కృతాంధ్రకవిత్వ చాతురీ కైతవచౌలోపనయనసంస్కరణ మొంది
వరకావ్యమోదితనరపాలబహుమతి వ్యాజనానాకళ లభ్యసించి
గీ॥ బహుళితశతావధానాదిపాటవాఖ్య,బలిసవనయుక్తిఁ బెరిఁగి విశ్వమున్యుఁడయ్యె
సరసతిరుపతివేంకటేశ్వరయశస్త్రి, గ్రక్కమఁ డయారె! వారి భావింపవశమె.౬

---

(*16వ ఆగస్టు 1912 సం॥ దర్బారు పత్రిక నుండి.)

...... ఓయేడుకొండలవాడా! ఓ తిరుపతి వెంకన్నా! ఓ మహాప్రభో! నీవుచాటుననుండి యమాయకులను ప్రేరేపించి వారిని యావహించి యపవాదముల నేల పలికించెదవు. నీవు వారికిని వీరికిని పూనుటకఁటె ప్రత్యక్షమయి నేమికావలెనో యేలకోరరాదు. వెయ్యికొబ్బరికాయలు వడపప్పు పానకము చేసి నిన్ను శాంతిపరచెదను. మాయందు దయయుంచి నియోగి వైదికులకు వైషమ్యములను జంప వరమియ్యుము. అప్పుడు నీపేరు సార్థకమగును. కోపించి యపవాదములను వెల్లడించిన ఈయిరువదవ శతాబ్దములో నమ్మువారెవరు. కావున శాంతింపుము. శాంతింపుము. నియోగి

[illegible] వరా:— ఇట్లు స్వయంకృతాపరాధమునుమాపైఁ బెట్టి వ్రాసినను, ఈయన తిట్లుతిట్టని హేతువునఁ గడుయోగ్యుఁ డనుకోవలసియున్నది. వెంకన్న, అనునదియే యొకతిట్టుగా నాయన తలఁచి యుండునుగాని మాకంతమాత్రమునఁ బోయిన దేదియులేదు, నిజమ

ఉ॥ ఇంకొకఁ డెవ్వరో తెలియ దేవపుఁ "బండితపుంబ్రువంబు" నే
కొంకును లేక వ్రాసె మముఁ *గూర్చియె యంచును బత్రికాధిపుల్
జంకక తేల్చి రయ్యదియు సత్యమె బండయుఁ గూడ నట్లుగా
బొంకులుఁ దిట్లు వ్రాయుఁ డని పూర్తిగఁ దోఁచెడి నంబి శాంకరీ॥ ౩౨౩

శా॥ ఆదుశ్చేష్టకు యోగ్యులెల్లరును నాహా! యంచు సీ, యంచు "నే
మీ! దౌర్భాగ్య"మటంచు నొచ్చుకొనఁగా మిన్నంది "మేల్ మేల్ బళీ"
నాదంబుల్ పచరించుచున్ 'గవిత' విన్నాణంబు చూపించె నోఁ
గానీ "దుత్తూరది భంగులోఁ గలియుచో నాశ్చర్య మే ముందెడిన్॥ ౩౨౪

క॥ ఈపాటి దీనసత్యము దీపోకడలెల్ల "వారికే మానసమున్,
బ్రాపింప"మనుచు మాన్పెఁ, గోపించుటఁ జేసి పుట్టి కొస కిట్లయ్యెన్॥ ౩౨౫

ఆ॥ వె॥ ఆసనమ్ము కొఱకు ననుఁగుంగవులు విద్దె, లభ్యసించునొకయుపాయమేది
యేనిజూడవలయు నిస్సిరో! యూతిట్లు, లేమి సేయు నింతయెఱుఁగరంబ

---

గు మాపేరదియే యగుటచే సంతసించుచున్నారము, ఈకక్షను బెట్టిన వారెవరో యీకబ్బములోని ప్రాజ్ఞుల లేఖలవలన విస్పష్టపడుచు గాన నికనేని యీయన నిజ మెఱిఁగి తనమ్రొక్కును జెల్లించికొనుఁగాక.

---

*(22 డిశంబరు 1911 సం॥ ఆంధ్రకేసరినుండి.)

రామేశ్వరీయము అను పండిత బ్రువలక్షణము ఈచిన్నపద్యగ్రంథము రామేశ్వరకవి గారిచే రచియింప బడినది. వెల ఒకఅణా. ఇది తిరుపతి వేంకటేశ్వరులకును కొప్పరపుకవులకును జరుగుచున్న కలహాము విషయమై రచియింప బడినట్లు కనబడుచున్నది. దీనిలోని చివరపద్యము నిట వ్రాయుచున్నారము....

☞ షరా:— ఈకేసరిపంక్తులవలన "పండితబ్రువము" అనునది ప్రకృతకలహమునకు సంబంధించినదేయని తేలునుగదా? ఇంతకుమున్ను 119 వ పుటలోని, 6, 7 పంక్తులవలన దర్బారు పత్రిక దానిని మానెత్తిని బెట్టినదనుట విస్పష్టము, మఱియు నీయంశమునే కవితాపత్రిక కూడ తేల్చినది దానింగూర్చి గీంత పీఠిక, VII వపుట చూడఁదగు, పండితబ్రువమును గూర్చి యెవరో పండితకవి యొవగించుచుఁ

|*మున్నే తెల్పితి మేల తిట్టెదరు మీమూర్ఖత్వముల్ సారెసన్
వన్నెల్ వాటెడిఁ గాని దాన జనియింపన్ బోదు లాభం బటం

---

ద్యములు వ్రాసి పండితబ్రువ మను పుస్తకమునందే అంటించి యున్నాఁడు ఆపద్యము లీక్రింద నుదాహరింపఁ బడుచున్నవి.

మ॥ తమపాపమ్ములు పట్టితోల్త దమకిందన్ బిమ్మటన్ జేయుమా, గ్గము గ్రొన్న మహాత్ములల్లై యిపుడీకక్షోగణంబెంచి...... నీచశ్లాఘ్య మీగిత్తమున్ భమదీరన్ గలిఖించె దీనిఁ దమ దుగ్రప్రజ్ఞ వారింపరే. ఉ॥ ఊరును బేరు లేక గాబరాఁ జరించెడి కొండబట్ట్లె లీ, తీరున విర్రవీఁగుటకుఁ దేలెను గొండబలమ్ము హేతువం, చేరుపెకల్ప లేరనుచు నెంతురు కొండను గొండపిక్క్రవా, రారయ మరు కన్ దెఱచునంత షెడీలునఁ గొండఁగూలదే. శా॥ నోటన్ గీటము లుప్పతిల్లునటు కన్నున్ మిన్నుసంగాన కే, చేటోమూఁడి వనాటుఁ డెవ్వఁడో కొనించెం దిట్లు డచ్చిలు డి, వ్యాటోపస్ఫుర దాశుధారకవితాత్యానందసద్గ్రంథవా, గ్ధాటిన్ బాటిలు మిన్ను నిందల దురాస్థన్ ముంచి తేల్చన్ వెసన్. శా॥ చెంపన్ గొట్టినయట్లు సాధుతను బెంచెంగాదె యాకాశియా, పెంపుం బెంబొనరించి కొన్నిట బుధప్రీతిన్ బొసంగించుప, శ్యాంపుశ్యాం ప్రకటింపఁగావలయుఁ గొండాని కూలు బండాసిపడున్, గంపన్ మోసెడి కొండబట్ట్రలకు వైక్లబ్యంబు గల్గుంజుఁడీ ఆ॥ వె॥ కొండబలము బంచకుండె దానిబలమ్ము, కొండజట్ట్రియలకు నుండె నౌరా బండ, కొండ, కొండబట్ట్రియల్ కుయివెట్టఁ, జేయుబిసువు తమకె చెల్లియుండె॥

---

*(శాఖాభిమానప్రవర్తకులగు లౌకిక శిరోమణుల కొక హెచ్చరిక.)

ఉ॥ తిట్టిన లాభమేమి! కనిదీఱఁగ వీలగునే సయెప్పుడో, కొట్టిన లాభమేమి! యది కోవిదమార్గము గాదు, మున్న చే, పట్టితి రెట్టులో విఱుగు బాడిత కొమ్ములు రెండు, వ్రాసిచే, నెట్టిఁ దలంచినా ర్థ్నము వినీతికిఁ దక్క్ర భుజాబలమ్మునన్॥ చ॥ పయినొక చింతకొమ్మకెగఁ బ్రాఁకితి, రందలిపండ్లు పుల్లఁగా, నయివెగటై యసహ్యమయి యందుఱకున్ దలవంపు నించె, నే, మియు నొనరింపలేక పయిమిక్క్రలిమీఁదికి దూఁకుచుంటి, ర, య్యయొ! జగతీ తలంబెఱుఁగదా! నగదా! వగదాఁగ నేర్చునే॥ ఉ॥ రాజునుబట్టుకొనన్త పయిరాష్ట్రజనుల్ చెలరేఁగి తిట్టునా, యోజను మీరొనర్చు పనులున్నవి శాఖకుఁ గీర్తి దెచ్చుటే, యీజతనంబులం గలుగునే! పయి సెచ్చపకీర్తిఁ దక్క్ర నా, హాని జగమెల్ల ఁగ్రుద్ధిదనియాని సకలమ్మునకుం దెగించుటల్॥ (విస్తరము "పశ్యాం పుశ్యాం" లో చూ.)

చు, న్నా నాఁటికి బుద్ధి గల్గెడి నటంచున్ మేము భావింప నే
మన్నన్ లే దభివృద్ధి చెందె నకటా! మాంద్యంబు సాంద్రంబుగన్॥ ౩౨౭

శా॥ మేమే కా దిటు లెంతమందినొ, సదా మిన్నంది దూషింపను
ద్దాముల్ వీరిని మందలించి రెవరిన్ దా మింత లెక్కింప కే
మేమో తిట్టుచు వ్రాయుచుందు రకటా! యీ వేని యవ్వారికిన్
ధీమత్త్వంబు నొసంగు మంబ! యటుపై ధీజాడ్యముల్ వోయెడిన్॥ ౩౨౮

శా॥ చల్లాపిచ్చయ్యశాస్త్రి నీతి గఱఁపెన్ జాజ్వల్యమాన ప్రభా
కల్లోలాకులమైన పద్యతతితో గాఢాగ్రహోదగ్రుఁడై

---

# తిరుపతి వేంకటేశ్వర స్తవము.

(1912వ సం॥ సెప్టెంబరు 9వ సంచిక అభినవసరస్వతి నుండి.)

శా॥ వెంకన్నా! యనుసంతలోటగునె నీవిఖ్యాతి విద్వచ్చమా, సంకాశస్ఫుటవైదుషీభరితవాచాచాతురీశ్రీనిరా, తంకప్రోత్థమహాశుసంఘటిత పద్యజ్వాలసద్ఘంటికా, టంకారమ్ముల నాలకించి చనుబండ ల్వేంకటేశప్రభూ. మ॥ త్రిలలనాస్వాంచి కరమ్ములన్మొగిచి పాదద్వంద్వముం బట్టి త, ప్పులనైరింపుఁడు మీకు దాసులము గామోయంచుఁ గాల్వేప్ప దె, బ్బలకాసించెడి వారిఁజూడక యెగస్పాల్గొటి సన్నెదుకొం, డలవాఁడా! యన నీయశోరమకులోటా! వేంకటేశప్రభూ!
శా॥ ఆంకెల్వేసిన లాభమా! మిగుల బారల్సాచినన్ లాభమా, బింకాల్గొట్టిన లాభమా! వెడనుము ల్వేసిలంగ నేలాభమూ, జంకున్వీడి ముఖాముఖిన్ గనవలెన్ సామర్థ్యమామీఁదటం, జంకల్గొట్టవలెన్ భళీ! యనబుధేశా! వేంకటేశప్రభూ।, శా॥ జంకుల్గల్గఁగ నొక్కవేళ కడలినిచ్చల్ దాఁటుచో రెండు వే. ల్లంకం జెర్చిన మూడువేలని కపుల్లాంగూలముల్సాచి ని, శ్శంకన్మొక్కిడి యాలువేలయిన నీసామ్యత్వముం జూచివే, టెంకాయ ల్బలిఁ బెట్టువారలఁటవింటే! వేంకటేశప్రభూ,, శా॥ అంకమ్ముల్నభజియింతురో యటులగా కాకొండ మంగొల్తురో, కంకాళిం గనఁబోదురో మఱియు మేఁకన్మింగు దేవర్లకుం, గైంకర్యమ్ములఁ జేతురో! హరిహరీ! కాకున్న లోకత్రయిం, బంకాఁజేసిన నీ కెటుల్ శివములప్పా! వేంకటేశప్రభూ!॥ మ॥ ఎటనో మూలనుగూరుచుండి తన పేరే మూలనొందోపి ప, ట్పటఁబండ్లూరక పిండిఁజేసికొని కంఠస్థాభిమానమ్ముతో, గుటకన్మింగుచుఁ దొంటిప్రాఁతలకు సంకోచింపకే లేచి చ, ప్పటులంగొట్టఁగ నీకులోటగునె యప్పా! వేంకటేశప్రభూ!॥ మ॥ ఏడనొకొండనుంటివవి యెంతురుగాదె కపీంద్రులెల్ల న, ఱ్ఱాడెమకొండలన్నితుని యల్పోనరించు టెఱుంగనైరి మో, మోడిభజించు వారలను బ్రోతువటందురు కా

పిల్లుల్ వోలెఁ దదీయధాటి కొకటన్ బెంపేది వాచాటకుల్
చల్లంగా నొరుగంగఁ జూచ్చిరి వచస్సారంబు దూరంబుగన్॥ ౩౨౯

క॥ *సుమనోఽవతంసకృతికర్త మహాభాగుండు సుగుణరాశి యితఁడు స
ర్వము నెఱిఁగి మందలించిన, క్రమ మంబరొకొ సర్వసుజనగణ్యముకాదే ౩౩౦

---

నినెత్తిబో, చ్చూడఁగఁ గొట్టుచుందు వని యూహ యొనర్చరు వేంకటేశ్వరా!॥
చ॥ తెలియఁగలారె యెల్లరును దిర్వళితో వసియించియుక్ జగం, బులఁ గలజీవరా
సులనుబొంది జగానిగలీనుకీలు బో, మ్మలవలెనాడఁ జేతువని మాటికి మాటికి
నొంటితీటచే, గలబిలసేయుచున్ శివనుగాఁదల పోతు రువేంకటేశ్వరా!॥ మ॥ పె
సలేచౌకగనున్నవో! యకట యాబెల్లంబె బల్చొకనో, వెసఁ దమ్ముం గడతేర్చి
యెల్లపుడు దోర్వీర్యంబు సంధించుచోఁ, బొసఁగంజాలినయంత నీకు వడిపవ్వన్
పానకాల్సేతురం, టని నెబానెంతటిమాట వింటిమయ కట్టా! వేంకటేశప్రభూ!॥
మ॥ కరముల్దాప్పలు సేతురఁట! మదిలో గర్వంబు లేదంట! గు, ర్గరలేమూలలను లే
నెలేవఁట! పరాకుల్ తెల్పువారంట! త్వ, చ్చరణాంభోరుహ చంచరీకులఁట!
మీసాత్త్రియలేరంట! యా, వరముల్ కావలెనంట యేమనెదు దేవా! వేంకటేశప్రభూ!॥

ఇట్లు
చల్లాపిచ్చయ్యశాస్త్రి.

---

(*శ్రీమాన్ వంగిపురంకృష్ణమాచార్యులు. బి. యే. యల్, టి, గుంటూరుకాలేజీసహోపాధ్యాయ విరచిత "సుమనోఽవతంసము" నుండి.)

క॥ శ్రీనాథుండిలసత్యము, నేనాఁడును బ్రోచుచుండ నింపుదలిర్పన్, ధీనిధసత్యవిమ
ర్శన, చేనెగడుచు నుండుఁగాత శిక్షితమతియై॥......చ॥ ...... గుం, టురిపుర
వాసులార! వెగంటుం బడ కీరువినుండు సాధు స, చ్చరణసరోజసేవనలసత్సుమ
నస్సులు కింకవీఁదరి సిం, ధురపృథుదేహనిస్సరదనూనమదాపహృతిప్రభూత
సు, స్థిరనిరవద్యదిగ్వితతిదివ్యవిభూషణసద్యశస్స్ఫుర, త్తిరుపతి వేంకటేశకవిధీర
మృగేంద్రులచెంతఁ జేరి సా, దరమతివిద్యనొంది కవితాపరికల్పనచాతురీధు
రం, ధరుఁడయి... వే, లురిశివరామశాస్త్రి బుధలోలుపమాన సపద్మ్రుఁడట్టె గుం,
టురిపురికాలెజీకవివినోదనపూరుష సంఘమందు దు, ష్కరసిజధీవిలాసకృతిచంద
ములెల్లను జూపి, శారదా, పరమపవిత్రవిగ్రహవిభాసితకాంచనముద్రనందిన
దున్, నరతతి మోదవర్ధన నినాదసముచ్చయపూర్వకంబుగా, వరశకటాంత
రంబున విభాసిలఁ గూరిమినుంచి యాబుధున్, బురి రమణీయవీథులను బొల్పుగ
నుత్సవమొప్పఁ గాలెజీ, సరసకశాఖలెల్లరు ప్రసన్నముఖుల్ విహరింపఁజేసి చే,

ఉ॥ వంగిపురాన్వవాయు నటువంటి మహాత్మునిగూడ నెంత పే
ర్మిం గన రీప్రబుద్ధులు సమిద్ధపరాక్రము లంబరంపువీ
థిం గడు దూఁకులాడుదురు తేఁకువ కొండొకయున్నఁ గాదె చె
ప్పం గలవారు చెప్పటయు వారక వింటయు నోమహేశ్వరీ ౩౩౧

---

రిరి నిజమందిరాళి 'భళిరే' యని పెద్దలు మెచ్చుచుండ; న, ద్దిర! మఱునాఁటిరాత్రి
హృదిం బురికొల్పు కుతూహలంబుమై, సరగునఁ బాకశాస్త్రవిదు సౌమ్యముఖా
శ్వవరాధిరూఢు నెం, దరముగ నూరఁద్రిప్పిరి వృథావ్యయమెంతయొ చేసి కొం
డఱె, వ్వరో; నిపుణ శ్రవః కుహరపాటనమూఁగద దీనివిన్న; న, వ్వరో బు
ధసంతతుల్, శ్రుతికిఁ బర్వమె కాయని మెత్తురొక్కొ? చే, సిరో లఘుతాలఘుత్వ
పరిశీలన సన్మతులిట్టు లెప్పుడేన్? సరసతఁ బాకముల్ నవరసంబుల నొప్పఁ గ
వీంద్రదపాచకుల్, పరఁగఁ గృతుల్ రచింతురని వారలసామ్యము చాటి యుండ్రో!
యే, కరణి నలంకృతుల్ గుణనికాయము శ్రావ్యమనోహరధ్వనుల్, విరివిగఁ
గల్గియుండి కవిబృందమనోహరమై చెలంగునా, వరకవితాలినూజఁ గనుభా
గ్యము పాచకుఁడందనేర్చునే? ని, ట్లరయక లోకగర్హ్యకృతి హర్షముతోఁ దిలకిం
ప న్యాయ్యమా? అరుదగు శేముషీమహిమ కక్కజమందుచు విద్వదర్హ స,త్క
రణము సేయదోషమా? బుధప్రవరాళిని కారసక్తులన్, విరసమనస్కులన్ గురు
వివేకరమాఢ్యులు "కూడవిట్టి తుం, టరివసులంచు గొబ్బున జనంబులు మెచ్చ నివా
రణంబు సా, కిరులయి చేయకుండ రది కేళివిలాసముగాఁ దలంచి...విమర్శ నే
యుచో; నొరులని యస్మదీయులని యొప్పనిభేదము లెన్న బుద్ధి స, త్వరమయి
న్యాయదృక్పటిమ వాయుచు స్వీయజనాళికృత్య మం, దరసియుఁగాన దొక్కనె
రసైనను; జూపినధర్మ మంచనున్, బరకృతియం దనేకగుణసారము దోషవితా
నమంచొగిన్, దురుసుఁ దనంబుతోఁ బలికి దోసపు లేశము గొప్పఁజేయు; నీ, ఘ
రివిపరీతవార్త విసఁబోలును; దాన నెఱింగి మద్వచ, స్సరసత, సద్విమర్శనము
సల్పుము మిత్రమ! అద్దియేది యుం, చరయ, నియోగివైదికులకక్కటా! పోరునము
దబ్బవిల్ల నొం,డొరులు ప్రభిన్నమార్గులయి యొప్పగఁగూడరు వైదికక్రియా,చరణము
నందు; వాక్కలహచండల ద్వేషము పెద్దసేయ సా, గిరఁటు; నియోగియాశుకవి
కిందగు కారణమేమిలేకయే, పరులవధానుబద్ధులు సభన్ దమనైపుణి చూపుచుం
డ, నా, సరసనె పీఠముంచిరది 'సత్సభగూడునుగూడ' దంచు ను, ద్ధుర కలహం
బుహెచ్చుదు "వధూవరులెక్కఁగఁ బల్లకీని నె,వ్వరితరులెక్కఁగోర" రనిపల్లె
డి నిద్దఱిలోన నొక్కఁడం, దఱువిసుచుండ; నైననువృథాగఁ దదాసనబర్బ్వహా
నకుం, డిసి; మదినొవ్వఁగా నతఁడనేన్ దనచెంగటఁ బీఠమందునె, వ్వరునుఁ బ్రఁ
గూరుచుండఁ దగుపండితుఁడయ్యెడి నీతఁడంచుఁ దీ, వరపడి; యంతనంత శ్రుతి
పాటనకారి వచోహతాత్ములై, యరిగిరనంగఁ గొందఱు గయంబున నాశుకవీం

శా॥ కార్యాకార్యవిదుండు సూనృతవచఃకైవల్యపాథోధి సం
సార్యగ్రేసరుఁ డాంధ్రహూణముఖభాషాశేషుఁ డీకృష్ణమా
చార్యుం డూరకఁ బాత్రమొందు విరచించన్ దీరి కూర్పుండెనే?
ఆర్యుం డెన్నఁటికిన్ సహింపఁడు కదా? అన్యాయధర్మాత్ములన్ ౨౬౨

---

ద్రుతోడఁ జే, రిరిగృహముల్; నిజాతిశయరీతుల నాశుకవీంద్రుఁ డంత రా, తిరి పత్రికటించెఁ బత్రికలఁ దేఁకువ నాఁడెఁ దెలుంగుమీసమి, ద్వారని యుపుండటన్న్, నెగఁబోసిరి లేఖలపైని లేఖలన్; బుధజనులెల్లరుండఁగ సమోఘవిదగ్ధవచశ్శరార్చ్యులన్, మరలఁగఁ జేయువానివలె మాటలుసెప్పి యథార్థవాది మ, త్సరముసు బెంచెనిట్టికవిసంగరమాఁపఁగ నెంతవారికిన్, దరమ! వివేకవంతులు వితాకువడం గదువృద్ధియయ్యె....స్థిరగురుపక్షపాతమె విశేషవిరోధమె కల్గియున్న హ్యా, త్సరనిజమెట్లు కల్మషదశంగసఁ గల్గు నిజానిజంబులన్,...సరసతమీఱు కృష్ణఘనసన్నిధినిం గవిహంసలొప్పి సు, స్థిరయశమందుచుం బదగతిన్ భళిచూపిరి'' యంచుఁ గొందఱం, దురు; ''నిజమిట్టులుండునె? వినోదపదంబని కాంసలెన్నఁడేన్, సరసత మీఱుకృష్ణఘనసన్నిధి సంస్కృతపాద నృత్యచా, తురినెటుచూపు? ......పూర్వమందె త, ద్విరచితమైన వర్ణనలతిత్వరఁ బాడిరటంచుఁ గొందఱం, దురు; 'నలుదిక్కులన్వ్వలయు దొడ్డయశస్సుగణించు ధీప్రభన్, వఱలు శతావధానులంటి బాపురెయంచు జగంబుమెచ్చఁ జూ, పిరితమనేర్పు వీనులకువిందుగ' నన్న యథార్థవాది బా, గరయక దోషతండమునె యల్లనఁజూపును, సత్యవాదిమా, యురె! గుణమెంచ కెంతయు మహోగ్రతతో శివరామపండితున్, ద్వరపడిదూఱ సాహసము తద్దయుఁ జేకొనిమాటకారియై, 'గురులుసహాయులౌచుఁ దనకొంకును మాన్పెడిభారమూన దు, ష్కర మగుపృశ్నలన్నియు వెసన్ సభపెద్దసిరాకరింపఁ డెం, పరియయి సల్పెఁ జక్కఁగ నవారణలీల శతావధాన' మం, చౌరులునగంగ జాటెడి సమోగ్యపు దబ్బఱలెన్నొ. ........................

......శతావధానధీవరకృతి వర్ణనీయ మని పండితులిట్టిన సత్యవాది, సాకిరియయికాదటంచు బుధఖేదము వర్ధిలఁ జేసె ...... అరయుచు దీని దుష్ఫలములాఁపఁగఁ గొందఱుసంధిసేయఁ గో, రిరి యెట్లైనఁ బండితవరేణ్యులమాటలఁ ద్రిప్పలేమివా, రిటులఁగి కృతార్థతం గనక యిమ్ములనుండిరి......రసములాలుక్కఁ జిలుక్కయు ననంతర మిట్లుపాడెఁ; ''సక్కటా!, వెఱ పొకయింతలేక కడుఁబిన్నతనంబునఁ గొందఱగ్రభుక్, పలచిన పాచకోత్సవ మపారము దావహమంచు, మన్మనోహ,హరగుఃశాలులై నిరతమార్గ్య విధేయత నొప్పబాలు రుం, డిరి యసివిన్న మస్ద్రుపయనీరజుపట్టె విచారమగ్నమై, పిరినెను, సాధుమార్గమును వీడిన వీరలతోఁ ప్రసంగ, మె త్తెఱఁగునఁ జేయఁదన్మతులు తిన్నని పద్ధతినుండునొకదా?......ఎఱుక

ఉ॥ ఈయన ఘున్ వచించుమయి నింకొకనిన్ వచియింతు రప్పురిన్
ధీయెడ యోగ్యతా గరిమఁ దేఁకువ లోఁకువ గానిశక్తి; గాం
గేయునికేని లోపము లగింపఁగ గొండొక వచ్చు నీయుపా
ధ్యాయునికిన్ బి. యే. ఎ, లిటి. కంబరొ? లేదు కళంక మెయ్యెడన్. 333

---

జనింపబాలురకు నెట్టులనైన హితంబు నెప్పఁగా, గురులకుధర్మమంచు బలుమారి
మితో వచియింతునిట్లు......యే,మరయుచు వంటవానిఁ బరిహాసకృతిప్రవణాత్మ
సంగతిన్, బురినలువీధులందమిత మోదముతోఁ గదుఁద్రిప్పి సూరి,సత్కారణము
గేలిచేసితిరి, తప్పని మీమదిఁదోఁచకున్నె? మా,యురె! బుధమాన్యపూరుషమహో
త్సవదర్శన మేవగింతొ?..... వైదికార్భకులు, కట్ట! నియోగిగృహాళిచెంత న,ల్ల
రిగడు సేసిరంచునుడులన్ విననయ్యెడి నెల్లవీధులన్!, హరి! శివ-రామునుత్సవము-
నందున నాబుధుకీర్తనంబు న,ల్లరిమొకొ? యేమిచెప్ప! కనులంగన కల్లపురాభి
మాని ది,ట్టరితన మొప్పఁజాలెఁగట.....నిరుపమశేముషీ మహిమనిష్ఠ మెయిన్ మన
సంస్కృతాంధ్రవా,గ్గరిమను బెంచునార్యులనికారము న్యాయ్యమె? చ
క్కఁజూడుఁడీ, అరసి మహాద్భుతోరుగుణమాన్యులు మెత్తురు గాన, మీమతుల్ నిర
సన సేయ కెప్పుడు గుణిప్రణుతిం జెలువొందనిండు ధీ, తిరహితమార్గులౌచుఁ
గుమతివ్యతిషంగము నల్పకుండుఁడీ; పురబుధవాగ్వివాదముల పొంతకుఁ జేరు
టమానుఁడింక!, న,ద్వరమతి దూయమానయగుఁ దప్పుడు చేష్టలు మీరొనర్ప..
...భాస్కరుఁగని మిత్రుఁడంచు నలకంజము హాసము సేయు, వాని నే, యరియని
కల్వపూ వెదను హత్తినభీతిఁ గనంగలేకలో,నెరియుచు వాడుచుండు......మధుర
గీరతులీకథ సత్కరింతు రం,చెఱుగుచు సత్కవీంద్రులకు, నింతటితో విరమింతుఁ
గాక యీ, వర'సుమమనోవతంస, సుఖవాసనపూత దిగంతకాంగ, ని,ద్దరఁగుజ
నుల్ హసింతు రదితప్పదు పద్మజసృష్టిలోనఁ; గొ,ప్పరపుఁ గవీంద్రులుర్వ శ్రుతి
పక్వద వాఙ్మధురాశు ధారలన్, విరివిగఁజల్లి,యర్థమధుభృత్కృతికల్పన ఖ్యాతి
గాంత్రు; వే,లురిశివరామశాస్త్రిబుధవిభులోపల మేటిశతావధానినై, సురుచిర మాన
సోద్గతవిశుద్ధ 'రసాశ్రయకల్పనా సుమో,త్కరకృతి కావ్యమాలిక, లఖండము
గారచియించిమించి సు,స్థిరయశమంది లోకవినుతింగని భాసిలుచుండుఁగాక; శ్రీ
తిరుపతి వేంకటేశ కవిధీమణి సత్కృతుల న్వెలింగి క,ప్పరపుఁజపుల్ చెలంగ
మునుపుంబలె మోదమువృద్ధిఁ జేయుఁ; దత్తిరుపతి వేంకటేశ వినుతిం జెలువారు
చు నెల్లవేళ, ను,న్నం, తరగత సృష్టవస్త్వచిరతాకరణ ప్రవణోరుకాలధీ,కరిప
రిపంధి దుష్కృతినికర్తన దక్షము కావ్యసద్యశ, స్సురుచిరవీతలంబున జనో
పకృతిన్ వెలుగొంది మించుతన్ (విస్తరమందేమా)

ఉ॥ బోలెఁడు ఖర్చు పెట్టి యిటు పొత్తము వ్రాయుట కేమిహేతు? వీ
కాలమునందునుం గలరుగా? గుణగణ్యులు వారి మెచ్చి దు
ర్శీలురతోఁ బ్రసంగములు చేసి గణించిన పాతకంబు ని
ర్మూలము చేసి మోదమున నుస్సుటకే యనుకొమ్ము శాంకరీ. ౩౩౮

తే॥ గీ॥ ఇట్లుమా పేరులను బెట్టి యేరి దెంత, తప్పు వ్రాసిరి కొందఱు తజ్జ్ఞులంబ?
మఱియుఁ గొందఱు మహిలోని మమ్ముఁ బేరు, పెట్టకేదియు వ్రాసిరెట్టెట్టొ బట్టు"

ఉ॥ (1) ఆశువు పేరుపెట్టి యొక రట్టులె బిట్టుగ గుట్టులోడ(2) న
త్యాశువు పేరుపెట్టి యొక, రన్యులొకానొకరో (3) శతావధా
నాశువు పేరుపెట్టియును నాత్మకుఁ దోఁచినరీతి వ్రాసి రో
యీశకుటుంబినీ! కలహ మేర్పడు హేతువుచేత స్వేచ్ఛగన్ ౩౩౯

---

(1912 సం॥ ఆగస్టు మానవసేవపత్రికనుండి.)

(1)...శా॥ ఆశుకవిత్వ మన్న నిపు డంద ఱకుం బరిహాసపాత్రమై, పేశలభావశూన్యమయి వృత్తుల కామడదూరమై గ్రహా,వేశము రీతిఁ బట్టి పలవింపఁగఁ జేయుచుఁ గొందఱన్ వృథా, దేశము లెల్లఁ ద్రిప్పెడు క్షితిన్ నిరపత్రపవృత్తి నక్కటా!॥ గీ॥ యతులు గని పెట్టి చూడ దుర్గతుల నొందెఁ, బ్రాసములు చూడఁ జూడ సన్న్యాసులయ్యె, ధర్మధర్మి విభేదంబు దగ్ధమయ్యె, నౌర! నీ కెట్టిగతి పట్టె నాశుధార!॥ గీ॥ పదపటుత్వమ్ము నీకడఁ బనికిరాదు, సరసవాక్యమ్ము నా నీకు విరసమగును, రస మనెడిపల్కు విన్న నీరసము గల్గు, నౌర! నీకెట్టిగతి పట్టె నాశుధార!॥ గీ॥ పద్య మని చెప్పుటకు నిన్ను వలను పడదు, గద్య మని చెప్పుటకుఁ గూడఁ గాన రాదు, చరణములు లేమి సరస మాసరణి లేమి, నౌర! నీకెట్టిగతి పట్టె నాశుధార॥ గీ॥ పుల్లియాకులు గాని చీపురులు గాని, చెప్ప రా నట్టియది గాని, స్త్రీ! యి దేమి, కాలమహిమమ్మొ! నీకు లక్ష్యమ్ము లయ్యె?, నౌర! నీకెట్టిగతి పట్టె నాశుధార!॥...శా॥ ఎవ్వఁడెఁ బల్కరించిన "నిదేమి కవిత్వము? మూల నుండుమా యవ్వ వచింపలేదె? రసమా? పదసౌష్ఠవమా? మృదుత్వమా?, నవ్వనివార లెవ్వరె వినంగనె? దీని నిఁక ట్టియాశువున్, బ్రువ్వ వచించి పామరుల మ్రోల గడించుఁడు ద్రవ్య" మం చనున్॥ గీ॥ రసము పాండితియుఁ బదమార్దవము భావ, హావభావలు భాసిలునట్టి కయితఁ, జెప్పనత్కవులిట్టినిం జేర నీరు, హా! యిఁక కేఁటికి నీ బ్రదుకు కాశుధార!॥ మ॥ అవధానమ్ముల ధారణాపటిమ యత్యాశ్చర్య సంధాయకం, బపురీతిన్ బ్రకటించి పండితులు వహ్వా! యనుచు శ్లోకింప నుం, డవలెన్ లేనియెడన్ ఘన మ్మెలుక గ్రంథమ్ముల్ రచింపన్ వలెన్, గవులావారికి రెండు పద్ధతుల యిక్కాలమ్మునం దర్హముల్.—శతావధాని, పిసుపాటి చిదంబరశాస్త్రి.

తే॥గీ॥ ఎంతకాలమ్మునుండియో యిందుపరిగ, బసియొనర్చి మెప్పునుగన్న వారలుండ
వృథగ నస్మాదృశులఁ బట్టి విద్యనిందఁ, మనెడివారల నేమన నగును సుదంబ.

ఉ॥ కావున వారివాఁతలను గాదను వారమె కాని వారితో
నీవిషయమ్మునందు గలియ మెంతటి సత్కృవు లేనివారు స
ద్భావముగల్గి వ్యాజను లవమ్మును గల్పక విద్వదిడ్యహా
తోడ్పను బోవుచో నెదియుఁ ద్రోయక సైకొనునాగ [illegible] ౨౩౮

(సర్వశూన్యశతకము నుండి.)

(2) సీ॥ అష్టభాషలకు నాగనుశాసనుండైన నన్నయార్యకవి నెంచినాఁడు మున్నె
పేర్మిమానుబంధంబుతో మన్గుముప్పటిల్ తిక్కన్నకవి మున్ను దిద్దినాఁడు;
పరువుగాఁ బల్లకీ నైనసర్వదేశముల్ శ్రీనాథకవి మున్ను ద్రిప్పినాఁడు;
లలితశయ్యారసాలంకారవస్తువుల్ పెద్దన్న మున్నె పంపించినాఁడు;
గీ॥ నేమములు దాఁటనీయండ నిలిపినారు. [illegible] తక్కనవేరు తెల్ల
నేఁటికే తెంచెఁ గవితకు మేటికేడు, సకలగీర్వాణ జనమాన్య సర్వశూన్య॥
సీ॥ అబల సుగాత్రి విద్యావతి గదుస్సాంకుమార్యంబు గలదాన మంగవజ్ఞాన
బల్మినైన బరబరఁ బడగాసు [illegible] వేగంబు ముఖ్యంబుగాఁగఁ గొంచ
అత్యాశుకవులకట్టా! దాన నైపోర్వని యంగశరీరంబు డస్సె నవనవ సునము
సంధులు విఱిగె విశ్రామంబు గఱువయ్యెఁ బదసౌష్ఠవంబెల్ల భగ్నమయ్యె
గీ॥ నీరసంబెక్కువయ్యెకన్నీటఁ బడెను, నైఁటకోఁగునఁ బెనుపొంగివడఁ దొడఁగె
సుకవితాకన్య యూపదిఁ బాడుపయ్య, సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.
సీ॥ అథమాశుకవన ముహాద్రిగాఁ గల్పించి కవుల జంగాలఁగాఁ గలపినావు
పద్యాలు పాటగాఁ బాడించి కవుల బొబ్బిలిపాటగాండ్రఁ గావించినావు
పరువైన యత్యాసు పదమున కర్థంబుఁ జెఱిచి పెండ్లాలంబుఁ జేసినావు
కపు లనుపేరఁ దిత్తొక్కగ్యంబు గావించి తోలుబొమ్మలఁ దాఁకొల్పినావు
గీ॥ పండితులు మెచ్చు కవితానుభావ మెల్ల, పామరుల మెప్పులకుఁ బాలుపఱచినాఁడ
వీవు దలఁచిన సేవ చేయింపలేవు, సకలగీర్వాణ జనమాన్య సర్వశూన్య
సీ॥ కవితారసంబు చాకలిచేతఁ గూడ నొప్పించుకాలంబుఁ జెప్పించినావు
ఆశుకవిత్వార్ద్ర మంబష్ఠుచేతఁ జెప్పించుకాలంబు రప్పించినావు
కవిసింహబిరుదంబు కవిఖరులకును నర్పించుకాలంబుఁ గల్పించినావు
చిరతరంబగు కీర్తి సిగ్గులేనికి సమర్పించుకాలము నిరూపించినావు
గీ॥ సిగ్గులో హాదియుంగ మున్గింపఁగలవు, రాళ్లదేలింపఁ గలవు నీరంబులోన
నఘటనాఘటనావటీయసీ ప్రభావ, సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య

# గుంటూరిసీమ, పూర్వరంగము.

ఉ॥ వీరల తోడనే మొక్క … రెడి వ్రాసిన వారు గారు భా
షారుచిరాంగి … బడి దాసంగున నైపగఁ జెందునట్టి సం
సారులు. … , పేరు పెట్టి మము సారెకు నాజడిఁ జేయ వ్రాయు ని
న్నారుల దుష్కవిత్వపుఁ బసందున కేమనుదాన నంబికా॥ ౩౮౦

గీ॥ సారె దర్బారులోన వాచాటకులు దు,రీహతో వ్రాయువ్రాఁత లెన్నేనిమున్న
సంగ్రహంబుగ నిందుఁబ్రసంగవశతఁ, దెలిపితిని వాని సారఁబు దెలియుమింక

ఉ॥ లోపల వీరు మాయెడల లోకము పాటిగఁ బ్రేమచూపువా
రే పరమేశ్వరీ? *అదియు నించుక వీరలు తిట్టుపద్దెపుఁ
శాపము లందుఁ గన్పడెడి శాఖకుఁ గీర్తి ఘటింప నెంచి యే
పాపపు వ్రాఁత వ్రాసినను భక్తి బయల్పడ కెట్లు దాఁగెడిన్. ౩౮౧

ఉ॥ దాఁగదు మానసం బెటులు దాఁచినఁ బైకది వచ్చుచుండుఁ దా
లోఁగదు లోఁగఁజేసినను లోఁగఁగఁ జేయ యతించుమానవుం

---

చెప్పవచ్చును, ... ఓ శతావధాన నిపుణులారా? ఆశుకవిసింహులారా? మీ ప్రబల ప్రయత్నము నంతయు దేశహితాచరణమునం దుపయోగింపుఁడు,......ధనవంతులగు భారతీయులారా? మీరును వృథాగా మీ ద్రవ్యమును వెచ్చఁబెట్టక ...ప్రతిష్ఠాపనల నభివృద్ధి పఱతురుగాక, (21 జూన్ 1912 సం॥ కృష్ణ చూ)

---

(*దర్బారులోని విశ్వేశ్వర ప్రశంసనుండి)

......చ॥ తిరుపతి వేంకటేశ్వరులు దీర్ఘగుణాఢ్యులు సత్కవీశ్వరుల్। వరమతులార్యసంస్తుతు లవారిత కావ్యకళావిలాసులే, తెలుగ మెవారి! వారికళలెల్లను మొన్నటి దసరా నీపురిం, దఱుచుగఁ దాము సకటకటా! పలు మాఱును నెన్న నేటికిన్॥.

(దర్బారులోని బుధవిధేయుని పద్యములనుండి.)

......సీ॥ ప్రబలగద్వాలభూపాల ధర్మధరాధరమ్మున భూరివ్రజమ్ముగొనుట, ఆత్మకూరి ప్రాజ్య రాజ్యమదేభముల నెక్కి వీధులలో విఱ్ఱవీఁగి చనుట, గజపతిక్ష్మాపాలనికరార్పిత కాంచనాదులఁగొని చింతలేదిచనుట, పోలవర క్ష్మాలోలాభ్యుదయకీర్తికాంతమన్ననలనే గాంచిమనుట గీ॥ సరససుకవిత్వసంధానచాతురీణ, ధీవిశేషపాణింధము శ్రీవిలాస, గరిమ నని యెంచుచుంటి సుకవిట! పురాణ,వాక్యల నఁగానియనవ్యమ్ము వలనఁగాదు...(ఇవి తిట్లనుండి సంగ్రహింపఁబడిన స్తోత్రములు.)

డోగొనరించుపట్లు; నది యొండొక లోఁగినయట్లై యుండి పై
కేగుఁ గనంగలేఁడ జరుఁ డిట్టి దురాగత మోమహేశ్వరీ. ౩౪౩

చ॥ ఒగిఁ జదరంగపున్నడక లొక్క త్రుటిన్ గ్రహియింప వచ్చు న
ప్పగిదిఁ దెలుంగునన్ యతియుఁ బ్రాసయుఁ గూర్చిడి నేర్పుగూడ రా
నగుఁ ద్రుటిలోన; మీఁద నుభయంబును గష్టమె కొంద ఱంతద
నర్క గనక యాట యాపదురు కైతయుఁ జెప్పదు రిచ్చ కచ్చుగన్ ౩౪౪

ఉ॥ ఈగతివారలే యిపు డనేకులు పద్దెము లల్లి మమ్ముఁ దా
మోగును బాగునం గనక యూరక శాఖుఁడుఁ గాఁగఁ దిట్టును
ద్యోగులు; చెట్టుగొట్టికొని యూరక నెత్తిని వైచుకోఁగ నే
యాగడమో పొనర్చునుగు ణాఢ్యులఁ బోల్పఁగ నమ్మ యీశ్వరీ. ౩౪౫

ఉ॥ వీరికి మమ్ముఁ దిట్టెడికవిత్వపు వ్రాఁతయె విఘ్ననాథు పూ
జారచనంబు; మున్నెదియు శాంకరి? పద్దెము వ్రాసి యుండ రీ
శూరులు; వీరిహేతువున సొంపు వహించెదుఁ గాక శాఖ; నీ
కారుణికత్వముం గని సుఖంబు యశంబును వీరు గాంచుతన్. ౩౪౬

ఉ॥ తిట్టిరటంచుఁ గొంజఱు మదిన్ దురపిల్లుదు రేమ సంతసం
బుట్టిపడంగఁ బొంగితిమి యొండొక హేతువులేక యూరకే
తిట్టుట స్తోత్రమే యగు నుతించునదుల్ వినుకన్నఁ బ్రాజ్ఞు లీ
తిట్టులె హాయిగా విని మదిన్ సుఖ మందెద రో మహేశ్వరీ. ౩౪౭

ఉ॥ బండతనం బటంచు నిది పండితు లాడెద రేమొ? "బండకున్
బండకుఁ జెల్లు వాద" మని బండతనంబునుగూడ నేర్చి యె
వ్వండెటు తిట్టినన్ మరల వానికి దిట్టక వానితిట్లయం
దుండినమంచినే గొనెద మోజగదంబ? ద్విరేఫముల్ బలెన్. ౩౪౮

ఉ॥ అట్టి ద్విరేఫతాగరిమ యాత్మకు నీకృపచేఁ జేసి పేరునం
బట్టియె దానికిం బలెనె వచ్చెను దిర్వతివేంకటేశ్వరుల్
తిట్టులు లెక్క సేయరు సుధీమణు లీవును నుండ నూరకే
కట్టెఁడు లెంత వాగినను గాలికిఁ బోయెడిఁగా? మహేశ్వరీ, ౩౪౯

క॥ ఎఱుఁగని మొఱకులతిట్లును, నెఱుఁగని యాశుకవనములు నెకరూటిగా రూ
పఱు గాలికిఁ బోయెడి యల, కొఱ గానిపరాగ మట్లకోవిదజననీ. ౩౫౦

ఉ॥ కొప్పరపుంగవీశులు రగులాఁను కోపము కల్మి మమ్ము నె
ల్లప్పుడుఁ దిట్టుచుండుటకు నంతగ నకజమంచఁ బోము *మ
మ్మెప్పుడొ యెవ్వరో కడఁగి యేమొ పరాభవ మాచరింప వీ
రప్పుడు కాచి పుచ్చిరట? అందులకంబరొ? యకజంబగున్,, ౩౫౧

శా॥ కాఱుల్ వ్రాయుచు సోదరుల్ గడఁగి "నాలాతాటిపట్టా? యటం
చారంగా మును పాడిరొఁగద? యదే యస్మాదృశుల్ పలుకఁ జో
ధీరుల్ మెచ్చరు దేవి? వీరెపుడు వర్ధిష్ణుల్ మమున్ గాచి?, రే
కారామార్యుఁడు చెప్పఁగావలయు లోకంబెల్ల మెచ్చన్ వలెన్ ౩౫౨

క॥ ఏకారామయ గా రది, సాకల్యముగా నెఱుంగుసాక్షు లగుదురో
లేకమఱొకరు వలయునొ, శ్రీకరు లలసోదరులు వచింపఁగ వలయున్

ఆ॥వె॥ ఏమిసాయమన్న "నెదురుగా రాకుంటె సాయ" మన్ననుడి ప్రసక్తమయ్యె
కొంకు జంకు లేక కోఁతలు కోసెడి, ఘనులధాటి కడ్డు గలదె జనని?

క॥ వీరల కాశుకవిత్వపు, ధోరణితోపా టసత్యధోరణి దొరలున్
సారమసారమనక 'ద, ర్బా'రదిప్రకటించు ముందు పరికింపదహో! ౩౫౫

మ॥ తన జన్మించిన దిందుకోసమని యేతత్పైప్రవ 'దర్బారు' నై
కొను నామాత్రన లాభమే? కనిన లోకుల్ మెత్తురో లేదొ లోఁ
గనఁగా వల్వదె యేమి భాగ్యము? వృథాగాఁ దప్పులన్ గుప్ప నం
తన నానాఁటికిఁ బ్రాజ్ఞ లోకమునకున్ దత్త్వంబు గన్పట్టదే ౩౫౬

మ॥ మఱి దర్బారది పుట్టకుండఁగనె తన్మార్గమ్ములున్ దాని సం
బరమున్ దానిజనించు హేతువును దత్త్వజ్ఞుల్ $విచారించి పం ౩౫౭

---

*(ఈవిషయమునకు 96 వ పుటలోని 23-24 పంక్తులు చూ)

($ఈక్రిందిపద్యము లొకానొకరు పంపిరి.)

శా॥ దర్బార్ ... తెగి...గాదే! భవ, న్నిర్బాధప్రధితావధానకవితా
మ్న స్వభావాపగా, హిర్బుధ్న్యప్రభసత్క విభ్రమమనోహేలాలవాలోర్మికా,వా

పిరి నైకొంటిమి, దానిఁ బ్రాఁత లవి యెప్డే నస్మదుద్యద్యశ
స్ఫురణన్ హెచ్చొనరించు నిక్క మని నమ్ముక్ మామనం బంబికా. ౧౪౯

గీ॥ సుకవులహాళాహళులు లేక సుకవియశము, మిగులఁ జెలువారదనిక దామేటి సుకవు
*లందు రదినిక్కముగు నేని యంబ! మాకుఁ, గరమునుపకారి దర్బారు గాక పోదు

క॥ తనవలెఁ దప్పుడువ్రాఁతల, కనుమోదింపదని 'కవిత, యభినవపదపూ
ర్వనకటి! సరస్వతిని నై, కొన దీ దర్బారు నెత్తికొని ముద్దాడున్. ౧౫౦

గీ॥ ఎఱుఁగునో లేదొ పాప! మిద్దెఱుఁగుఁ గాక
తనకు దర్బారె కాదు బాంధవ మొనర్ప
నల మనోరంజని యొకండు గలదు త్రితయ
$మొక్కటిగఁ జూచుచున్నారు యోగ్యతములు ౧౫౧

చ॥ వెనుకయు ముందునుం గనక వేఁదుఱు వ్రాతలు వ్రాసినంతనే
చనవు సుకీర్తు, లంతనె యశంబు గణింపరు మాయికుల్; నిజం
బును గని పెట్టు నేర్పుగల బుద్ధిమదగ్రిణు లక్కడక్కడెం
దును గలరంచు లోనెఱిఁగి దోహులు వర్తిలు టొప్పు నీ పయిన్॥ ౧౫౨

---

ర్బిందూత క్కరకర్పురద్యుతుల, వహ్వా! క్రిందుమీ దెంచ దే॥౧॥క॥ ఈ ప్పాడ......కొప్ప
రపుం......చెప్పిన యొప్పనిటప్పా, లొప్పం దర్బారునందు నూహింపరొకో॥ అ॥

---

*'సీ॥ ఏమహాత్ములు గల్గ భూమీశసభలలోఁ గవులకు బహుళవిఖ్యాతి గల్గె
(భట్టుమూర్తి)

---

బెజవాడ
24-11-12

$...ఆర్యా! సందర్భాసందర్భములను సమయాసమయములను తెలియక నింద
యే ప్రధానముగా నెంచి వాపోవు దర్బారు, కవిత, మనోరంజనీ, పత్రికలు చూడ
మామనంబులకు నత్యంతకష్టముగానున్నది......మీరు ఇట్టి తరుణములో అశ్రద్ధ చే
సిన యెడల......కొప్పర- రామకృష్ణకవీశ్వరజయమను నామముతో గాని లేక
యింకొక నామముతో గాని గ్రంథ మొకటి మీతదనంతరము బయలుదేరగలదు గా
న తగురీతిని పుట్టిన వాడును పుట్టినట్లుగా చంపుటకు తగు ప్రయత్నములలో యుం
డవలెను. ... ... చిత్తగించవలెను. వేలమూరి గోపాలకృష్ణయ్య

తే॥గీ॥ అభినవసరస్వతీమణి యసదృత మాడి, మమ్ము వినుతించు నఁట! యిట్టిమాటలకటా!
మాకృతజ్ఞులు వ్రాసిరి మఱియు మమ్ము, దూఱి సంతన యశమది దొరకు నొక్కొ—

క॥ తమగుట్టు గిరతము స, క్రమముగఁ బైటఁ బడవేసెఁ గా! యీపాత్రం
బమలము 'దర్బార్, వ్రాఁతల, శ్రమ మెల్లను బయటఁబెట్టి సంరక్షించున్.

తే॥గీ॥ అభినవసరస్వతి *వచించునట్టిపలుకు, లేనిజంబులో సారెకు నెపుడు! నసదృత
మాడు దర్బారుకవితల యఱపు లేని, జంబులో యెఱుంగు నిటుపైని జగము జనని.

తే॥గీ॥ తగుదు నంచును 'గవిత, యే తలకుఁ బాయు, §దబ్బఱలనో లిఖించెడిఁ దగ్గ ద
కటా!, మందలించిరి యెందఱో మహితులైన, నేమి దానికి జనియింప దింకబుద్ధి.

---

(1912 సం॥ మార్చి, యేప్రిలు అభినవసరస్వతిలోని మిత్రవిజ్ఞప్తి నుండి.)

*......మిత్రులారా! మీవ్యాసములెన్ని చూచినను దిరుపతివెంకటకవులనిందతో నిండియున్నయవి......మనబోటులు మహాకవుల కవిత్వమును విమర్శించుట కడు శోచనీయము. మనకు వారిపాదధూళి శిరమున ధరింపఁదగు యోగ్యతయేని లేదు ......తిరుపతి వేంకటేశ్వరులకీర్తి దిగంతవ్యాప్తమైనది మన దేశమందుఁ బ్రతిభాజ్ఞానకును వారియందు గౌరవము విశేషించి కలదనుటకు వారికి జరిగిన సపర్యయే సాక్ష్యమిచ్చును......శాస్త్రేతర విషయమును మీరేమి వ్రాసినను దిరుపతి వేంకటేశ్వరులు వ్రాయరు ఈయంశము మీవ్యాసములు వారివ్యాసములు చూచినవారే యెఱుఁగుదురు......ఈసీమవారైనచోఁ దిరుపతివేంకటేశ్వరులు మనకు జంకుదురేమో కాని యితరసీమవాసులు, వారిని శాస్త్రవాదముచే జయింపవలసినదే కాని దూషించియు నేమో చేసియు మనము జయింపఁగలమా?......

---

(1912 సం॥ సెప్టెంబరు కవితలోని అట్టహాసము నుండి.)

§......అభినవసరస్వతి—(తొట్రుపాటుతో) తిరుపతివేంకటకవులే మాగొప్పవారు దర్బారు—(చిఱునగవుతో) (30-6-1912.) అవధానులెవ్వరును లేనితరుణమున శతావధానులమని నటించుటవలననో...యెట్లయిన నేమి, తి॥ వెం॥లకు గతకాలమునఁ గొంతవఱకు గౌరవ మున్నమాట సత్యమే......అభినవ—(నివ్వెఱతో) నేనేమెఱుఁగుదును మాపట్టాభిరామశాస్త్రిగారటు చెప్పినారు, దర్బారు—ఔను. ఆయన తఱచు వింతవార్తయనియు మిత్రవిజ్ఞప్తియనియుఁ బేర్లతోఁ ది॥ వేం॥ కవులను బురస్కరించుకొని వ్రాయుచుండును......అభినవ—(రోషముతో) వారి విషయమై యిట్టిమాటలు నీవనవలయుంగాని మఱెవ్వరు ననరు, దర్బారు—పోనీ! వారియందుఁ బ్రజకెట్టి యభిప్రాయమున్నదో దేశమాతనడుగుదము. దేశ—ఎం

తే॥గీ॥ తనదు దబ్బఱ వ్రాఁతలు *ఘనులు పూర్తి, గా నెఱింగిరి కొంపఁ గష్టపడక
"కవిత" యిఁక నేనియనృతముల్ గట్టిపెట్టి, దివ్యదాతకుఁ బేర్గూర్పఁ దలఁచుఁ గాక

---

దుల నూరక కలహించెదరు ఆవిషయమై కవియు రాజునగు మంత్రిప్రగడ భుజంగరావు బహద్దరువారి నిష్పక్షపాతాభిప్రాయము నొకటిచాలును వినుడు, కృష్ణ, దర్బారీ! అభినవసరస్వతిమాటలకేమిలే దాని కేదియైన వ్రాసియిత్తురని వారి నట్లూరక పొగడుచుందురు......

పరా:— ఈ 'కవిత', మాయశమునుతగ్గించునూహతో నేయే వ్రాఁతలను బ్రమాణముగాఁ దన 'అట్టహాసముల్లో' లిఖించెనో అందన్నియు మృతప్రాయము లనునంశము 43వ పుటలోని ఇంగ్లీషుత్తరము మొదలు 50 వ పుటతుట్టతుదవఱకును గల దిద్దుబాటులోనగు భాగముచే విస్పష్టమగును శ్రీ శ్రీ భుజంగరావు బహద్దరు వారిశాఖాభిమానపుఁ బ్రసంగము 61వ పుట మొదలు 69వ పుటవఱకును జదివికొన్నచోఁ బూర్తిగా ఖండితమనియు దానిపై వారు ప్రత్యుత్తరమునొసంగకుంటచే వారియభిప్రాయమునిందెత్తికొనుట మఱియు ననవసరమనియు అభినవసరస్వతిని, కృష్ణపక్షపాతినిగాఁ బలికినట్లువ్రాసిన వ్రాఁత బొత్తిగాఁ బనికిరానిదనియు నందులకుఁ గవితలోని యీబొంకుప్రసంగమును జూచి యసహ్యమును విస్పష్టముగా వెలువరించిన శ్రీకృష్ణాపత్రికా సంపాదకులే పరమప్రమాణమనియు నెఱుఁగఁదగు, వలసినచో నిందునుగూర్చి బ్ర॥ శ్రీ॥ ముట్నూరి కృష్ణారావు కృష్ణాప్రెస్ వారికి వ్రాసి తనసంశయమును గవిత తీర్చికొనఁదగు, పనిలోఁబని ఈకవితాపత్రిక వారివ్రాఁతలకుఁ బ్రాజ్ఞలోక మెట్టియభిప్రాయమును బొందుచున్నదో తెలుపఁదగుపద్యములు గొన్నియుదాహరించుచున్నారము. ఇట్టివనేకములు గలవు, అందుఁగొన్ని గీరతప్రశంసాపర్వమున నుదాహరింపఁ బడును.

---

(నవంబరు 1912 సం॥ అభినవసరస్వతినుండి.)

*గీరతమునుగూర్చి పలువురు విద్వత్కవులు మావద్దకు సరసతరములైన తమ యభిప్రాయములను బంపుచున్నారు, అవకాశము గలుగ మికిఁజింతించుచు నిప్ప

ఉ॥ పాతిరి యోడిరంచు 'దరబారున' సారెకు వ్రాయునంతనే
చేరదుమీకుఁ గీర్తి,యల "శృంగపుభంగము;,రామకృష్ణులన్

---

టి కీశతావధానిగారి పద్యములను బ్రకటించుచున్నారము. వ॥ అ॥

పరిస్తుతము పిఠాపురీ కవీంద్రులగు బ్ర॥ రామకృష్ణశాస్త్రులవారి కొక
చిన్న విజ్ఞాపనము, అయ్యా!

ఉ॥ గీరత మేగుదెంచెఁ దమకీరితిఁ బూరతిఁ జేసె నాపుహూ
కారసరస్వతీ యుగముఁ గాఁదనఁ జాలెడుపాతిగుండె యే
ధీరునకుండెనో! వెదకి తెచ్చుకొనుండుఁ వృథాప్రగల్భముల్,
నేరిచినంతఁ బత్రికల నింపుటగా దిది, సప్రమాణమా"

మ॥ నరులే న్మెచ్చఁగఁ బోరు మీచెయిది, నేనారయ్య పీఠయ్యలో
గురుపద్యంబునఁ గూర్చినారనుచు, మీకుం జాల మోమోడి యే
కఱతల్ బిట్టువచింతురిగాక యవి నిక్కంబంచుఁ జిత్తంబులో
నరయంబోకుఁడు వారు వీరు నిపు డేమైన న్నివారింతురే!

మ॥ ఒకరాజా? యొకపండితప్రవరుఁడా? యోజింపుఁ డీమధ్యభూ
మికి లోనున్న యశేషమానవులునున్ బెంపార నవ్వారి మై
త్రికొ? శైష్యమ్ముకొ? కోరుచుండెదరె, యుక్తింగాన లే రీర లే
టికి, మృత్పిండము వజ్రపుందునకతో డీకొన్న నేమయ్యెడున్

మ॥ కలిలోనం బడి పోదు రేమిటికి! లెక్కన్ నాల్గొకో! మూడొకో!
నెలలే కా దొక రెండు రోజులయినన్, నిక్కంబుగా మీరు శి
ష్యులరే వ్వారికి నీకృతఘ్నతను సూచూడంగఁ బోరాదు, కే
వల మాచార్యతఁ జూపకుంటిరి సరే! పైఁ దిట్టు లింకేటికిన్

మ॥ శివ? సత్యంబని "శృంగభంగ" మొకఁడున్ సృష్టింతురే! యేటి తేఁ
కువ? యీలాటి మొగంబులా? "కుకవిరాట్కుంభీంద్రకుంభస్థలో
ద్భవ ముక్తాఫలమణ్యలంకృత నఖోదంచత్ప్రపంచాస్య మా
హావరంగమ్మున గర్జిలన్ నిలిచి నోరాడించు ప్రోడల్ బళా!

సీ॥ ఆత్మకూరునృపాలుఁ డసమర్థుఁడా! వీరికే చంద్రహారమ్ము లిచ్చుటేమి
గద్వాలపతి చేతకానివాఁడా! వీరికే పెద్దకానుకల నిచ్చుటేమి
ఆనందభూపాలుఁ డవివేకియా! వీరికే జయపత్రమ్ము నిచ్చుటేమి
వేంకటగిరిరాజు వెఱ్ఱివాఁడా! వీరికే వేయినూటార్ల నిచ్చుటేమి

తే॥గీ॥ చిన్నరాయన రేంద్రుండు చెడ్డవాఁడ, వీరికైతనె సతతంబు కోరు టేమి
చేయఁగాలేక పోయిరో! "శృంగభంగ"మింత మొనగాండ్రవారల చెంత లేరొ

ధీరులం జేయఁగాఁగలిగెనే! నిజముగా గని పెట్టుధీరులు
న్నారు చూఁడీ! వృథాగఁ గవనం బన్నృతంబున నింపఁ బోకుఁడీ ౩౬౮

మ॥ చినుఁగుల్ మూసినయట్టు లెట్లొ కవితం జెప్పంగ నుంకించునీ
మన బోఁట్లందఱు "శృంగభంగ" మొనరింపం జాలువారైన ఖ్యో
ణి నిఁకం "దిర్పతి వేంకటేశ్వరులు" లేనే లేక పోదుర్గదా!
మన మీ కార్యముఁ జేసినా మనిన నమ్మ్నం దెంత యున్నాదియుగా

మ॥ "కలరేరో గురు"లంచు మీరు పలుకంగా వింటిమే? వారు గీ
ర్బలసంతోషిత భూపగోపతికరాబ్జద్వంద్వ నిర్ద్వంద్వనం
కలితాంఘ్రిద్వంగదనానదోహదవిధాకాసద్యశోవల్లరీ
లలిత "శ్రీపతి వేంకటేశ్వరులఁ" బోల న్నేర్తురే చెప్పఁడీ!

శా॥ సూరార్యారాయనృపాలుక న్నైదుట మీచూపించు వాధాన్యసో
యార్యుల్ "తిర్పతి వేంకటేశ్వరులు" మీ కాచార్యు లంచాడెదుగా
సౌర్యం బేటికి? మీ నచించు గురుసంతానంబులోఁ జూపుఁడీ
కార్యంబుం బొనరింపఁ జాలిన సుధీకంజాప్తులే యున్నచోన్

మ॥ కవితాపాకము కేమి గాని, మొటులో కష్టించి యాధారణా
ది విశేషంబుల సంగ్రహించితిరి, యేదిన్ లేక మొట్లోవ్వ? భూ
ధవుఁడేగా, "దిర్పతి వేంకటేశ్వరుల" ఛాత్రత్వంబు గాదంచుఁ బె
త్కువివాదమ్ముననింకేలకి?, వట్టి టకటొంకుల్ మెచ్చువారుందురే!

మ॥ "గురు" లంచు న్నుతిసేయకుండినను దిక్కుడ్యప్రదేశావరో
ది రహస్యంచరకాకవింద్ర కుయశస్త్రీవాగ్రంథకారచ్ఛటా
హారణప్రస్ఫుటచండితీకాయితతతవ్యాకోచకీర్త్యంగనా
గురు' లంచైన నమస్కరింపఁ దగరో! గూటింపులింపాసెకో!

మ॥ ఎవ రేమూలలఁ బాలు ద్రావినను 'మే మే, యంచు నేకవ్యహం
యుపు లెరోఁకటి పాట పాడినను నే 'గ్గా' యన్నఁ జంచద్యశః
కవచ శ్రీపతి వేంకటేశ్వర" సుధీకంఠీరవద్వంద్వ స
త్కవితా వైభవ సంపద లెరుచుఁడి, శంకాతంక మిం కేటికిగా

శా॥ ఏ పద్మోద్భవు నాఁటఁ బుట్టినదొకో! యీపార్థివక్ష్మాతలై
ష్వర్యసాధ్యాయిక, రూపు మూసినది మీ"హాహాహూహూ" లతోఁ జాలు నీ
లోపం బిప్పటి కేరుఁ జేయ రకటా? లో కాను వాదంబునం
దే పాతిత్యము, మిమ్ముఁ జుట్టికొన దిప్డేగా వారిఁ బార్థింపుఁడీ

క॥ "హాహాహూహూ,, లెమికొనుదర్పును, బాహాబలమేమి సేయుఁ? బరిపంథి సుధీ
వ్యాహారబర్హి రాస్యఘు, నీహృద్యమహాప్రవాహ నివహము పొంగగా

తే॥ గీ॥ కవితవారి త్రోవను బోవు కారణమునఁ, దాదృశంబగు ఘనతయే తవులు మీకు
కొప్పరంపు సోదరులార! తప్పుత్రోవ, లింక నేని మానుఁడు లిఖియుంపకుండు.

తే॥ గీ॥ ఆసనం బీయకున్నంత నంత శతులు, భావమేటికి? మము *గర్దభములుగాఁగ
వ్రాయుమీ బంధుగుల వ్రాఁత వైఖరులను, గనియు మాసహాసమునఁ గాంక్షచను నె.

చ॥ శివశివ! †"పండితబ్రువుల"చెంతను "గాడ్దల" చెంత మీకు గౌ
రవ మిదునే సహాసనము? ప్రాజ్ఞులు సర్వ మెఱింగి నాఁడు బాం
ధవు లెటువట్టు వట్టిరొ కదా యది యబ్బక పోవు టేసుఁడీ
శివకర మయ్యె మీఁకు, గవిసింహులు! సంతస మందుఁడీ పయిన్ ౩౨౮

---

సీ॥ మాలకాకుల డాలు గీలుకొల్పిరిగదా! వైష్ణవార్యుని కీర్తి వనిత నుదుట
బొగ్గువన్నియలోని నిగ్గుఁ బూసిరికదా? కాశినాథుని కీర్తి కాంతమేనఁ
గటికిచీఁకటిచాయఁ బటిక నార్చిరిగదా! రావుగారి యశఃపురంధ్రి మొగము
కాటుక కన్నీరు గాఁజేసిరిగదా! కొప్రంపు గిరితికొమగవదల
గీ॥ నరరె! "తిరుపతి వేంకటేశ్వరు"లనంగ, దోమలో, చీమలో గాఁగఁదోఁచినారొ
బేలతన మేల? కుకవి శుండాలగండ, మండలవిదారి చండప్రచండ హరులు

శ్లో॥ ప్రౌఢా తాదృశసాహితీ సుకవితా పీయూషనిష్యందినీ
వాణీ ధిక్కృతగోస్తనీ పరజనాఽసాధారణా ధారణా
వృత్తి ర్హైమవతీపదప్రణయినీ ధారాఽపగాఽఽకారిణీ
శ్రీమత్తిర్పతి వేంకటేశ్వరసుధీ ద్వంద్వస్య నింద్యేత కైః

ఇట్లు
రాళ్లభండి వెంకటసుబ్బ శాస్త్రి, శతావధాని.

---

(*పండితబ్రువలక్షణమను బండతిట్ల పొత్తమునుండి)

చ......నా, సరసకు నీవు రాఁదగవు చాలును బొమ్మని కూయ నంతలో, నరుగునె తాను గాడిదె నటంచు నెరింగియె కూసెఁ గాని......గాడిదె చెంత నిల్వ గేసరి కది పోలునే...

---

(‡పాటిబండ సూర్యనారాయణరావుగారి పండిత లక్షణమునుండి.)

చ...నా, సరస నిలంగ నేరికిని శక్యము గా దనుచుం బ్రగల్భ వాక్సరణి వచించుచుండుట ప్రశస్తతరంబ బనిపింపఁ జాలునే...మూర్ఖశేఖరుడు ... దాంభిక పండితబ్రువుల్ (1911 సం॥ అక్టోబరు 13 వ తేది కృష్ణాపత్రికనుండి.)

న్యావివాద మనునది, హృద్యంబనవద్య మందు నెవ్వరు మును పీ
య్రశఫలముల ననృతపు, గద్యమ్ముల నాడ రదుగఁగాఁదగు బుధులన్

క్రితిమి బాగుగా నని, యట్లైు ముదంపడకుఁ డయ్య! అతిట్టులె మీ
క్రరొ తెలుపునుఝఁడి యి, ట్టట్లనకుం డనృతములకు నలవడకుఁడిఁకన్.

త్తరరంగమ్మున మీ, యుత్తరముల తత్త్వములు నొగి రాజీకై
త్తినయెత్తులు యుష్మ, త్పత్త్రాసంపత్తియను బ్రసంగింపఁబడున్. ౩౭౪

గాసినయింతలో ననృతవాక్కులు గల్గినఁ జూపుఁడీ! వృథా
ంసము తిట్టఁబోకుఁ డిఁక, నందఱకు న్నిజ మిద్ది తెల్పు మా
ంసము, మీదురోసమును, మేలు గనున్ యశ మంద విద్దెల
య్యసము నేయుఁ డీసుడిని భావన నేయకుఁ డన్యథా మదిన్ ౩౭౫

ంబా? యార్యులలేఖులున్ మఱి యనార్యవ్రాతముల్ వ్రాయునం
ంబుల్ గొన్ని యిటన్ లిఖించితిమి సత్సంఘుంబు నీవున్ యథా
ంబున్ గూర్చి విచారణల్ సలుప నాధారంబుగా; నింకఁ బ
)ంబుందెచ్చి యొసంగువారల వికారంబుల్ విశంగాఁ దగున్. ౩౭౬

త్చ్చిరి పత్ర మట్టులు విధేయుల పోల్కి నటించుచున్; జనం
ృతు నెందఱో గలర, యప్పుడు మా విజయంపు, నాటకం
చ్చుగ నాచు నుండె, నట నెట్టులొ పత్రము విచ్చి మాకు వీ
మ్చటకున్ గడంగి రది యేగతి సాగని దయ్యె నయ్యెడన్. ౩౭౭

ముదటన్ మాకొసఁగిరి యా, పదపడి యది వినికి సేయవలయు నటంచున్
బదిఁబది నడిగిరి తిర్పతి, యదలింపఁగ యుక్తి లేక యరిగి రనదలై. ౩౭౮

కూసెను గుక్కుటంబు లొగిఁ గొక్కొరుకోయని, కాకవుల్ రొదల్
నేసె దివాకరుండు దయచేసెడిఁగా! యని ఘూకవుల్ మదిన్
దాసముతోడఁ గొండగుహ దాఁగఁ దొడంగెను నాటకంబు ము
ఁ సరిగా ముగింపఁబడె నిండ్లకు నేగితి మంత నంబికా॥ ౩౭౯

గద్య

ఇది శ్రీ...తిరుపతి వెంకటేశ్వర రాశీకృతంబగు
'గుంటూరిసీమ' యందుఁ బ్రతికా
కపాయాపరనామకమ్మును,
ఉపోద్ఘాతప్రాయ
మ్మునున గుపూర్వ
రంగము.

# శుద్ధపత్రిక.



| పు | పం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 8 | 3 | జూావూడి | జూపూడి |
| 8 | 9 | ఏమిగ | ఏగతి |
| 8 | 10 | ఠేమిగణింతు | ఠేగణియింతు |
| 16 | 12 | పండితుత్ | పండితుల్ |
| 30 | 25 | తాపోన | దాహేన |
| 41 | 17 | దికుల్ | వైదికుల్ |
| 58 | 2 | తదదుక్తి | తదుక్తి |
| 82 | 1 | యొకకరుఁడు | యొకరుఁడు |
| 86 | 3 | యధా | యథా |
| 88 | 13 | దోకొ్ర | దాకొ్ర |
| 91 | 32 | నభ్య | సభ్య |
| 106 | 25 | మాగ్రామములోనే | మావద్దనే |
| 108 | 21 | 10 తేదీ | 15వ తేదీ |
| 113 | 5 | రీరని | రంచును |
| 115 | 29 | కపులారా | కపులారా |
| 116 | 7 | మూరక | మూరక |

ఇవి స్థూలదృష్టిచేఁ గనిపెట్టిన ప్రమాదములు- మఱియుఁ గలప్రమా ప్రాజ్ఞులు యథోచితముగ దిద్దికొనఁ బ్రార్థితులు. ఇతరుల యుత్తరములలో యథాప్రాప్తములుగ ముద్రించితిమి గాన నందలిలోపములను గణింపక మునే గ్రహింపఁ గోరెదము.